ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# సారస్వతవిమర్శలు

## భారతసంస్కరణము (కలగూరగంపలోనివన్నది)

గ్రంథపరిశోధకులారా! ఈక్రింది సంశయములను దీర్పఁ బ్రార్థించుచున్నారము.

లక్షణగ్రంథములెల్ల భారతము నాశ్రయించియే పుట్టియున్నవి. కవిమండలమెల్ల భారతము ననుసరించియే తమతమ కబ్బముల వెలయించియున్నది. భారతము నాంధ్రముగా నొనర్చిన కవులు మువ్వురు. అందొకరికొకరు తీసిపోవువారు గాకున్నను బ్రథమికుఁడగుటచేత నన్నయ్యభట్టారకునియం దెక్కుడు గౌరవమును గొందఱు లాక్షణికులు సూచించియున్నారు. ఇందులకప్పకవీయములోని

"ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతమ్ములో
నేది వచింపఁగాఁ బడియె ..................."

అను పద్యమును, అహోబలపండితీయమున నన్నయ ప్రయోగసరణిని మహాభాష్యకారవచోరచనబలెఁ గైకొని యక్కడక్కడఁ దిక్కనాదుల వచోరచనల ఖండించు నుద్యమంబును, బోధకములు కావచ్చునుగాని, వారు మువ్వురును నాంధ్రకవిలోకమునకు మార్గప్రదర్శకులే కావున మూర్తిభేదముంజేసి వారిలో వారికొకింత భేదమున్నను మనకు వారు మువ్వురు నొకటేతీరున శిరసావహింపఁదగినవారు. భారతమెల్లఁ బ్రమాణమే యగునుగాని భారతైకదేశము మాత్రమే ప్రమాణమై తదితరము కాదనుటకు వలనుపడదు. ఈసిద్ధాంతమనాదిగా వచ్చుచున్నది గాని నేఁటిది కాదు.

చ. ఎవరు కవిత్వముల్ సలిపిరేనియు భారతపుం బ్రయోగముల్
చవి గొనియే రచించిరి, విచారణ చాలనిచోట నన్యథా

భవనము గల్గుఁగాక, పొరపాటది ; దానికినేమి, నేఁడు మీ
కవియొకతమ్ము లేర్పఱిచి యేటికి భారతముం గలంచుటల్ ?

ఉ. భారత మిట్లె యుండు నని పండితమండలి నమ్మి దానియా
ధారమునం గవిత్వము పదంపడి గట్టికొనెన్ గదా! తదా
ధారముఁబట్టి లాక్షణికతండము లక్షణముల్ రచించె, నేఁ
డారసి దిద్ది యేమి ఫలమయ్యె, చెడుంగద వారి పూనికల్.

ఇయ్యది మహావిషయము. స్వల్పముగా వ్రాసినం దేలెడునది కాదు. దిఙ్మాత్రము నేఁటి దిద్దుబాటులను జూపి వానివలన వచ్చెడి హానుల నుదాహరించుచున్నారము.

క. "జ్ఞానము కేవలకృప న
జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రకాశము"

ఈపద్యములోని ద్వితీయచరణమున నుండు యతి నాధారముచేసి కొని అప్పకవి "సోమయాజులు వాడుకతన" అని హేతువును జెప్పుచు 'జ్ఞా'కును 'కా'కును విశ్రమమును విధించియున్నాఁడు. ఇటీవల దీనిని 'ప్రజనితము' అని దిద్దియున్నారు. ఈపాఠము వెనుకటిపాఠమునకన్నఁ దీసిపోవుట యటుంచి దీనింబట్టి యప్పకవి లక్షణ మేమి కావలయునో, ఆతనిం గాని తిక్కన్నగారి ప్రయోగముంగాని యనుసరించిన కవుల ప్రయోగములకు నేమిగతి చూపితిరో తెలుపఁగోరెదము. మఱియు,

క. నమ్మమి మృత్యువు పెద్దయు
నమ్ముట యపమృత్యువగుట నరపతి నమ్మీ
నమ్మక పనిగొనునది ని
త్యమ్మను సూక్ష్మమతి దాన యరయఁగవలయున్.

శాంతి ౪ ఆ 350.

ఈపద్యములో నిన్నమొన్న వచ్చిన భారతములో,
"నరపతి మిత్రు న్ననమ్మి పనులు గొనునది"

అని విపరీతమైన మార్పు కన్పట్టుచున్నది. ఆమార్పువలనఁ దిక్కన్న గారి యభిప్రాయము పూర్తిగా నవ్యథాత్వము నందుటయే కాక సంస్కృత భారతమునకుఁ గూడ వైరుధ్యము కలుగుచున్నది.

శ్లో. ఏకాంతేనహి విశ్వాసః కృత్స్నో ధర్మార్థనాశకః । అవిశ్వాసశ్చస
ర్వత్ర మృత్యునా చ విశిష్యతే । అకాలమృత్యు ర్విశ్వాసో విశ్వసన్
హి విపద్యతే । యస్మిన్ కరోతి విశ్వాస మిచ్ఛత స్తస్య జీవతి । తస్మా
ద్విశ్వసితవ్యంచ శంకితవ్యంచకేషుచిత్. ఏషా నీతిగతిః—

(శాంతి—అశీతితమాధ్యాయము శ్లోకములు 8-12.)

తిక్కన్న సోమయాజి "క. నమ్మమి..." అను పద్యమునందు పైశ్లోకముల తాత్పర్యము సూత్రప్రాయముగా నిమిడ్చి తన యసమాన కవితా ధురంధరత్వమును వెల్లడించెను. ఆ శ్లోకానుసరణమున శోధించికొన్నచో, "నమ్మినమ్మక" అను పాఠమునకుఁ గల యోగ్యత "మిత్రున్నమ్మి" అను పాఠమునకు లవమును గలుగనేరదుగదా! అయినచో నీదిద్దుబాటెంత బాధకరమో పరికింపుఁడు.

తే. గీ. సంస్కృతపు భారతమునకు సంకటమ్ము
తెలుఁగుఁ బ్రతుల కన్యోన్యము కలఁతపాటు
తదనుసారి కవీంద్రుల దారి కడ్డు
భారతం బిట్లు దిద్దుట పాడియగునె ?

మహాకవియగు సోమయాజిగారి "నమ్మినమ్మక" ప్రయోగము దిద్దఁదగిన స్థలమందు లేమింజేసియేకదా ! శ్రీనాథుఁడు "వినీవినక" అని తన శృంగార నైషధమందుఁ బ్రయోగించికొనియె. మఱియు ధూర్జట్యాదులు "రోసీరోయక" "చేసీచేయక" లోనగునవి ప్రయోగించికొనుట కాధార మాయొక్క ప్రయోగమే కదా! దానిని మీరు రూపుమాపి తిక్కన్నగారి కజ్ఞతను గల్పించుటయే కాక యిటీవలి మహాకవుల కెందఱికిఁ గల్పింపవలసివచ్చినదో విచారించుకొనుఁడు. ఆప్రయోగము వ్యాకరణసిద్ధముగాదని దిద్దితిరో! అట్లేని యెన్నిచోటులనో భారతము దిద్దవలసివచ్చును. దీనికి సమగ్రమగు వ్యాకరణ మింకను జనింపలేదు. సంస్కృతమునకు మహాభాష్యప్రయోగ మెట్టిదియో తెల్గునకు మహాభారతప్రయోగ మట్టిది. సూత్రకారుని సమ్మతి లేకున్నను భాష్యకారుని ప్రయోగమున్నచో నది సూత్రమును బుట్టించును. అట్లే మహాభారతప్రయోగమును నని యెఱుఁగఁదగు.

..."చ॥ వరదుఁడు" అను పద్యములో "వృత్తికిన్నరుడుగ" అను ప్రయోగముండుటంజేసి పోతన్నగారు తమ భాగవతమునింప "సర్వమున్నతని"

లోనగు ప్రయోగములు ప్రయోగించికొనిరి. అహోబలపండితీయరచన వఱకును పై భారతప్రయోగ మట్లే యున్నదనుట కాధారము కలదు. ఇటీవల దానిని దిద్దిరి.

మఱియు "మదీయభాషిత మెన్నఁడు, న్నేని" అను భారతప్రయోగ మున కీమధ్య నొక రన్యథాసిద్ధిని దెల్పుచు నాంధ్రభారతిలో నొక వ్యాసమును బ్రకటించియున్నారు. అందు "ఉండును" అను రూపమునకు "ఉన్న" అనునది రూపాంతరమనియు, కావుననే "ఉన్నే" ఇత్యాది మహాకవిప్రయోగములు సంగచ్ఛమానము లగుచున్నవనియును నభిప్రాయపడి "ఎన్నఁడు+ఉన్న +ఏని"అని విడఁదీసి "ఎన్నఁడున్నేని" ప్రయోగమును సాధింప సాహసించిరి. కాని అది సరియైన త్రోవ కాదు. "ఉండును" అను దానికి "ఉన్న" అని రూపాంతరములేదు. "ఉన్నే" అనునది నిపాతమని శబ్దరత్నాకరములో వ్రాసిన మార్గమే యుక్తమైనది. ఆరూపాంతర మున్నదనుకొన్నను "ఉండును" అను దానికి "ఉన్నను" అని యుండునుగాని "ఉన్న" అని మాత్ర ముండదు. అయినచో "ఉన్ననేని" అగునుగాని "ఉన్నేని" కాదు. విస్తరింపఁదగిన విషయమే యైనను ప్రకృతముగామింజేసి యుపేక్షింపఁబడియె. వీరు తమ యభిప్రాయమును మాత్రము తెల్పిరి కాని యేపుస్తకమును దిద్దినవారు కారు. పైవారో, యిచ్చవచ్చినట్లెల్ల దిద్దుచున్నారు.

"చేతుఁ" అను ప్రయోగము లొకటి రెండు భారతములో నున్నవి కదా యని శ్రీనాథాదులు ప్రయోగించికొనిరి. చిన్నయ్యసూరిగారు దానిని మాటదక్కించుకొనిరి. పదపడి యీప్రయోగము బూతనికూడఁ గొందఱు వ్రాయ సాహసించుచున్నారు. బాలవ్యాకరణములోని వ్రాఁత నాధారము చేసికొని యీరెండు ప్రయోగములును 'చేయఁ'అని యొకటియు 'సేతున్' అని యొకటియు దిద్దివేయఁబడినవి. సూరిగారు విశేషపరిశీలకులే యైనను భ్రాంతి పురుషధర్మము గాన నెందేనిఁ బొరపాటు రావచ్చును. దానింబట్టి భారతము దిద్దుటకన్న బాలవ్యాకరణమే దిద్దుట యుక్తముగదా! లేదా సంస్కృత వ్యాకరణము వేదమును దనశిక్షకు లోఁగనిదానిఁగాఁ దలఁచి పలికినట్లు భారత మీవ్యాకరణములకు లోఁగనిది యనియేని భావించుట యుక్తము. అంతియకాని యిప్పటి వ్రాఁతలంబట్టి దానిని సవరింపఁబూనుట "రాట్టమురాకకు బంఁడి తప్పి కొనుట" వంటిది కాకతీరదు.

నన్నయభట్టు, "చ॥ అమలినతారకాసముదయమ్ముల" అను పద్యములో మహాభారతమును సముద్రముగ రూపించి "సముద్రము దరియంగనీఁదను విధాతృనికైనను నేరఁబోలునే" అనినొక్కివక్కాణించియున్నాఁడు. అట్టి వాగనుశాసనునికే మహాభారత మట్టిది యైనచో నితరులు దానిని దరింపఁగలరా! అందీ ప్రయోగమమాత్రమే యున్న,దిది లేదని నిశ్చయింపఁగలరా? అట్లు చేయఁగలమనుట కాని కలరనుట కాని సాహసమాత్ర మని మాయభిప్రాయము. ఇట్టి దుష్కరవిషయములలో నేఁటిపరిశోధకులు మిక్కిలిగ సాహసించుచున్నారు. 1916 వ సం॥ అచ్చయిన యుత్తరరామాయణ పీఠికలో ౧౮ వ పుటలో "పోవలయున్" అనుటకు బదులు "పోవలెన్" అనియును, "కావలయున్" అనుటకు బదులు "కావలెన్" అనియు పాపరాజుగారు ప్రయోగించినట్లును నది ప్రాచీనమహాకవి సమ్మతము కానియట్లును వ్రాయఁబడియున్నది. భారతములో, ఉద్యోగములో 3 వ అశ్వాసమున "ఉ॥...శ్రీ గావలె నంచు" అని తిక్కన్నగారు వాడియున్నారు. అది యిప్పటివఱ కెవరును దిద్దలేదు. ఈ పీఠిక ననుసరించి యెవరేని ముందుఁ బుణ్యముగట్టికొందురని యూహింపవలసియున్నది. మున పరిశీలకతాలోపము గ్రంథకర్తలయందుఁ బెట్టుట న్యాయముకాదని పరిశోధకులను వేఁడికోవలసియున్నది.

తిక్కన్నగారు శాంతిపర్వమున "అడరు" అను పదమును, 'సంకటము' అను నర్థమునఁ బ్రయోగించిరి. దానింబట్టి ఆముక్తమాల్యదలోఁగూడ నదే యర్థమున శ్రీకృష్ణదేవరాయలు ప్రయోగించె. తిక్కన్నగారి ప్రయోగము ప్రతిలో లేమింజేసి నిన్న మొన్నటి భారతమునఁ దిద్దఁబడినది. ఈదిద్దుఁబాటునకు హేతువు శబ్దరత్నాకరములో నది యాయర్థమున వ్రాయకుంటయే! నిఘంటువుంబట్టి కవితచెప్పవా రుండరు. ఉన్నచో 'పుంసివాకొమ్మెక్కి' అను లోకోక్తికి భాజను లగుదురు, లోకానుసరణముంజేసియుఁ బూర్వమహాకవుల రచనల ననుసరించియుఁ గవితాధార ప్రవహించెడిని. ఆ పూర్వమహాకవి ప్రయోగముల ననుసరించి నిఘంటు వ్రాయువా రొకకొన్నిటిని వదలినచో నీనిఘంటువువలన నవి దిద్దఁబడి తుదకుఁ దదనుసారుల తలకు వచ్చుట తటస్థించుచున్నది. ప్రతిస్థానమున లేదని దిద్దుటకేని యెన్నియో దిద్దవచ్చును. తెల్గున నింత సాహసించుచుండిరేకాని సంస్కృతమున సాహసించుటలేదు.

‘అన్వైహి. అవేహి’ అను రఘువంశపాఠమునకు సంబంధించిన చర్చవలన నీ సంగతి విస్పష్టమగును. కేవల యతిప్రాసస్థానములం బట్టియే, యీపదము కారాది యనియు నిది యికారాది యనియు నిర్ణయించఁబూనుచో శబ్దరత్నాకరాదులను నేఁటి నిఘంటువులలో ననేకములు పోవలసివచ్చును. సుప్రసిద్ధులను పెద్దల వ్రాఁతప్రతులనే తఱచుగాఁ బ్రమాణీకరించుకొనుచుఁ బూర్తిగాఁ దప్పుగాఁ దోఁచినచో నది వ్రాఁత పొరపాటనుకొని దిద్దికొనుట యుక్తముగాని యేదియైనను నేఁటి నిఘంటువులలో లేదని ప్రాచీనగ్రంథములు దిద్దుట యుక్తముగాదు.

అశ్వమేధపర్వములో ‘అతని కాహార మొనరఁ, జేసికొనుట కఠినమయి చెల్లుచుండె’ అని తిక్కన్నగారి ప్రయోగము ప్రాచీనప్రతులయందేమి యిటీవలఁ గొంతకాలమువఱకు నచ్చైన ప్రతులయందేమి కానవచ్చుచున్నది. దానిని “దుర్ఘటమయి” అని దిద్దిరి. వీరి తాత్పర్య మిది. కఠినశబ్దమునకు ‘కష్టము’ అను నర్థము నిఘంటుప్రసిద్ధము కాదు గాన దిద్దవలయును. లేనిచోఁ దిక్కన్నగారి కక్షతి సంభవించును. అని యోజించినట్లు పొడకట్టెడిని. ‘దుర్ఘటము’ అని దిద్దిన దిద్దుపాటు హృదయంగమము కాదని మాయభిప్రాయము కాదు. కాని తిక్కన్నగారి ప్రయోగ మౌపచారిక మనియు వారు లోకము ననుసరించి యట్లు ప్రయోగించియుండి రనియు, దేశభాషల విషయమున ‘వ్యవహారతశ్చ’ అనునదియే శబ్దగ్రహోపకరణములలో నెల్ల మిన్నయనియుఁ జెప్పుచున్నారము.

భారతములో ‘దిక్కు’ అనునది పలుచోట్ల “శరణము” అను నర్థమున వాడఁబడియున్నది. ఇది సంస్కృతపదము గదా! దీని నే సంస్కృతకవిగాని శరణార్థకముగా వాడినట్లు లేదు. లోకమందో “వాఁడు దిక్కుమాలిన వాఁడుగా నున్నాఁడు” లోనగుచోట్ల శరణార్థకముగా వాడుచున్నారు. దానిం బట్టియే తిక్కనాదులు వాడియుండిరి. అట్లే లోకమున దరిద్రుఁడు “నాకు సంసారము గడపికొనుట కడుఁగఠినముగా నున్నది” యనియును “దుర్ఘటముగా నున్నది” యనియును వాడుట కలదు. ఈ దుర్ఘటపదముకన్నఁ బలువురు “కఠిన” పదమునే ప్రయోగింతురు. తదనుసారమునఁ దిక్కన్నగారు వాడఁగా దాని నేల దిద్దవలెను? దిద్దిరిపో! పాఠాంతరముగా నేని ప్రాచీనపాఠమును జూపకపోవుట యన్యాయముకాదా! సామాన్యముగాఁ బరికించినచోఁ గుదురని ప్రయోగము లనేకము లున్నవి. అవి యెల్ల దిద్దుట యుక్తమా?

ఒక్కచో 'చతు, ర్దనుల నుభయపక్షవశత వచ్చు' అని శసలకుఁ ప్రాసము భారతమునఁ దిక్కన్నగారు వాడిరి. దీనింబట్టి యిటీవలి కవులు ప్రాసస్థానముల నీయభేదమును గైకొనుచుండిరి. అది యిప్పుడు దిద్దఁబడినది. శోధకులకు గ్రంథస్థపాఠము హృద్యమని తోఁపనియెడలఁ బీఠికలోఁ దమ యభిప్రాయమును దెల్పి యిట్లు దిద్దినచో యుక్తమని మాత్రము వ్రాయుటతో విరమించుట యుక్తమని తోఁచెడిని. భారతాదులలో నచ్చటచ్చట నఖండయతుల కాధారములు గానవచ్చుచున్నవి. వానింబట్టియే అప్పకవి "అఖండయతి పొల్పగు నాదికవిప్రణీతమై" అని కొంత యాధారమును జూపెను. ఇప్పటి భారతములో నాయాచోట్లు చాలవఱకు మార్పఁబడినవి. ఎట్టిదేని యము నది భారతసమ్మతమైనచో మనము శిరసావహింపఁదగినది యని పూర్వలాక్షణికుల మార్గమువలనఁ దెలిసికొనవచ్చును.

చూడుఁడు. 'చేసెన్ + మహా' అనునది ప్రాసస్థానమున "చేసెమ్మహా" అగుట కేవ్యాకరణమేని యంతకుమున్న కలదా! అందులకు శబ్దానుశాసనుని ప్రయోగమేకదా శరణము! అట్టిచో వారి బుద్ధిపూర్వకప్రయోగముల నేల దిద్దవలయును? ఈదిద్దుఁబాటులనుగూర్చి ముందు విపులముగాఁ జూపఁబడును.

ఉ. దిద్దకుఁడయ్య భారతము దీనిని దానిని బోలె, దాన నా
పద్దశ మూఁడి పూర్వకవిపద్యము లెన్నియొ వన్నెఁదక్కె, మీ
రెద్దియు నేని దిద్దునెడ నించుక సంస్కృతభారతమ్ముపైఁ
దద్దయుఁ జూడ్కి నింపుఁడు, పదంపడి దిద్దుఁడు హాని లేనిచో.

ఆ వె. సంస్కృతమ్మున కిది సమమైన తెల్గు గా
దందు రేమొ! నిక్కమగును గాని,
యెల్లయెడల నట్టులే యుండ, దొక్కింత
శ్రద్ధ గలిగి మనము చదువవలయు.



# ఉపోద్ఘాతము

## భారతవిశేషములు

చదువరులారా,

ఈచిన్నిపొత్తమునందుఁ జర్చించిన భారతప్రయోగములను దిలకించి యిదేరీతి నందుఁ గల భారతవిశేషములను మీహృదయముల కెక్కించుకోఁ గోరుచున్నారము. అంతియకాని మనకుఁ గల స్వల్పానుభవముతో నాంధ్ర కవితాలతాలవాలమగు వాగనుశాసనుని ప్రయోగములకు శంకలు వెట్టి గొప్ప గడింప నెంచుటకుఁ బ్రయత్నింపకుందురుగాక! నేఁటివారిలోఁ గడుంగడుఁ శిష్టులును విద్వత్కవివరులును నగు నొక రిట్టిపనికే పూనియున్నారు. వారివ్రాఁత యందలి యసారతనుగూర్చి మా 'పురశ్చరణమున' గొండొక చర్చించి యవ్వెడ నీపొత్తమున విశేషించి చర్చింతు మని తెల్పి యుంటిమి; కాని యిటీవల వారును మేమును ఏలూరిలో శ్రీరాజా మంత్రిప్రగ్గడ భుజంగరావు బహద్దరు జమీందారువారి సన్నిధిని జాలసారులు కలిసికొని కొన్నిదినము లొకచోటనే వసించుసందర్భము తటస్థించుచు వచ్చినది. అప్పుడు వారు వ్రాసిన 'భారతభక్తి'లోని కొన్నివిషయములు మే మడుగుటయుఁ వారేవో కొంతవఱకు సమాధానము చెప్పుటయు, దానిపై మరల మేము ఖండించుటయుఁ, బిదప వారు మిన్నకుండవలసివచ్చుటయుం బ్రాప్తించుటచే మరల నావిషయములనే యెండెత్తి విస్తరింపక యుపేక్షింపవలసినవారమైతిమి. ఆంధ్ర మహాభారతము సంస్కృతమునకు "మక్కికి మక్కి" తెలుఁగు కాదను విషయమును మన మాక్షేపింపరాదు. ఏమందురా, గ్రంథకర్త లట్లు ప్రతిజ్ఞ చేసి యుండలేదుగదా! వారు కథాప్రధానముగాఁ దెలిఁగించిరి, వారే యననేల, భాస్కరాదులుగూడ నట్లే యాంధ్రీకరించుచువచ్చిరి. ఇటీవల ననఁగా నిన్న మొన్నటినుండి యీ "మక్కికి మక్కి" ప్రకరణ మారంభమైనది. దీనిం బట్టిన యాక్షేపణలకు వా రుత్తరవాదు లెట్లగుదురు? మఱియుఁ గొన్నియెడల సంస్కృతమున నొకవిధముగా నుండఁ దెలుఁగున వేఱొకవిధముగా నుండుటయుఁ, గొన్నిచోట్ల దానికిఁ గేవలవిరుద్ధముగానే యుండుటయుఁ గల, దదియేమి

యాక్షేపణీయముకాదా యందురేని, అయ్యదియు నాక్షేపణీయము కాదని మా యాశయము. అష్టభాషావాగనుశాసనునకు సంస్కృతభారత మన్వయించు కొనుపాటి సాహిత్యముకూడ లేదని వాదింప నేప్రాజ్ఞునకు నోరువచ్చెడిని! కావున నాభేదమునకుఁ గారణము కొన్నిచోట్ల వారి బుద్ధిపూర్వకమగు మార్పు నియు మఱికొన్నిచోట్ల నాయా గ్రంథములయందుండెడి పాఠభేదము లనియు మేమూహించుచున్నారము. సంస్కృతాంధ్రభారతములకుఁ గల వ్యత్యాసములు కొన్ని మాభారతనాటక పీఠికలోఁ జూపియున్నారము. అవి యందందుఁ జూతురుగాక. ఇఁకఁ దిక్కన రచనలోని విశేషములను నేఁటివారన్యథాకరించి కొన్నిటిని బునరుక్తులుగను మఱికొన్నిటిని వేఱొక తెఱఁగు దోసఁగులుగను బోల్పఁజూచుట «మాతా మే వంధ్యా» అను లోకోక్తికిఁ బ్రథమ లక్ష్యములగుటకుం జేయు ప్రయత్నమేకాని వేఱొండు కాదు. అవి దోషాభాసములుగాని దోషములుకావు. 'భ్రాంతేః పురుషధర్మత్వాత్' అను నుక్తింబట్టి నన్నయాదులుగూడ మనుష్యమాత్రులే కావున వారుగూడ భ్రాంతివశమున నెచటనేని దోసఁగు పొసగించి యుండవచ్చునను వాదము యుక్తిసహము కాక పోదు గాని వారల్లెక్కడనేని భ్రాంతిపడియున్నను వారి కిటీవలి మహాకవులనేకు లాభారతమును సంస్కరించి యుందురు గాని యట్లే యుంచి యుండరు గదా! అట్టిస్థితిలో నాయా మహామహు లనేకులు సంస్కరింపఁగాఁ గూడ నిప్పటివారికిం గొన్ని దోసఁగులు నిలిచియుండునని వాదింపఁ బూనుట సాహసమాత్రము కాక మఱియేమి? ఆనిల్చుటయేని యటుదుగాఁగూడఁ గాక ప్రతి పదమందును గల పనురీతిని వ్రాయఁబూనుట మఱియును సాహసము. ఇట్టి వ్రాఁతలకెల్ల ముఖ్యకారణ మస్మదాదులకు భారతకవిత్వమునందలి రచనావిచ్ఛిత్తి గనిపెట్టఁ దగినంత యనుభవము లేకపోవుటదక్క వేఱుకాదని చదువరులూహింతురుగాక. పాండిత్యము వేఱు; అనుభవము వేఱు. వేయేల భారతమున లేఖకప్రమాదప్రయుక్తములగు దోసఁగు లేవేని యుండిన నున్నవేమో కాని యంతకు మించిన దోసఁగు లేవియును లేవని మేము నమ్ముచున్నారము. 'భారతఫక్కి'లో వట్టిలేఖక ప్రమాదములం గుఱించి ప్రసంగించినట్లు తోఁచదు. కేవలము భట్టారకునిమీఁదికే దండెత్తినట్లు స్ఫురించును. అట్టి స్ఫోరకములఁ గొన్నిటి నుదాహరించుచున్నారము.

“ఉ॥...భీముఁడు మల్లవిద్య నేర్పేర్పడఁగా హిడింబు బలహీనపరాక్రముఁ జేసెఁ జెచ్చెరన్” బల= ఉక్కు, పరాక్రమ = బీరము; హీనబలపరా

క్రమము అని భావము చేసికొనవలయునా ? యతికొఱకు హీనశబ్దము, బలపరా క్రమముల నడుమకు వచ్చినది గాఁబోలు !" (భారతఫక్కి 42 పుట)

ఇది యేటి విమర్శనము ? అట్లనుకొనుటకన్న, బలశూన్యమైన పరాక్రమము కలవానిఁగాఁ జేసె నని యథాశ్రుతముగానే యేల యన్వయించుకొన రాదు ? ఈయన్వయమునందు హిడింబునకు బలము నశించినను బీరముమాత్ర మింకను దగ్గలే దను సారస్యముగూడఁ గన్పట్టి 'చింత చచ్చినను పులుసు చావ లే'దను లోకోక్తి కది స్మారకము కావచ్చునుగదా ! కవియాశయ మిటులుండ దాని నన్యథాకరించి యతికొఱకనియుఁ బ్రాసకొఱకనియు వెక్కిరింపులు శోచ నీయములు గాక మఱెట్టివగునో !

"క॥...మఱి త। త్కృతమున కగ్గలముగ స। త్కృతి చేయుట యుక్త మంచు కృతబుద్ధులకున్" సత్కృతి యనుచో నుపకృతి యన విస్పష్టము.
(భారతఫక్కి, 44 పుట)

సత్కృతి యనఁగా గౌరవము. ఉపకృతి యని యావదర్థముగాఁ బరిగ ణించుచుండఁగా నుపకృతియనియే వ్రాయవలయునోటు !

"ఆ॥వె॥ సతి విముక్తయైనఁ బతికిఁ బునర్దార
సంగ్రహంబు సేఁత శాస్త్రమతము
పతి విముక్తుఁడయిన సతి కన్యపురుష
సంగ్రహము సేఁత లోకగర్హితంబు"

"శ్లో॥ నచాప్యధర్మః కళ్యాణ బహుపత్నీకతా నృణామ్ ।
స్త్రీణా మధర్మ స్సుమహాన్ భర్తుః పూర్వస్యలంఘనే" సంస్కృతము నకుఁ దెలుఁగు సరిగానున్నదో లేదో పరికింపుడు. (భారతఫక్కి 45 పుట)

ఆంధ్రీకరణప్రసక్తియెడల ననుభవ ముండవలయుంగాని భట్టారకుని తెలుఁగు సరిగానే యున్నది. 'సరిగా' అను పదమునకు 'మక్కికి మక్కి' యని యర్థము చేసికొనఁ గూడదు. భంగ్యంతరముగా రచించుట భాషాంతరీకర్తల నేమయము. అంతమాత్రమున నది మూలము నుల్లంఘింపదు. విస్తర మనవసరము.
"తే॥గీ॥ వీఁడు పుట్టిన పదియవ నాఁడు"

"శ్లో॥ జాతమాత్రః పురాచైవ మమాంకా
త్పతితో గిరా" భేద మరయునది. (భారతభక్తి 47 పుట)

పుట్టినతోడనే తొడనుండి పడుట యసంభవము కావున భట్టారకుఁడు జాతమాత్రపదమున కట్టి యర్థమును గైకొనియె ననుట సహృదయైకవేద్యము. ఏల యసంభవ మందురేని వినుఁడు. సద్యఃప్రసూత యగు ప్రసవిత్రి యొడ లెఱుఁగునంత తెల్వితో నుండదు. అప్పు డామె యిటీవలం బోలెఁ దన యంకమున బాలు నిడుకొని కూర్చుండుట యసంభావనీయము. కావునఁ గొంత గడు వొసఁగి భట్టారకుఁడు తనకుం గల లోకజ్ఞతను వెల్లడించెను.

"తే. గీ. బ్రాహ్మణులకుఁ బ్రియమువాయక చేయంగఁ, గాన్పుసూవె పుణ్యకర్మఫలము" పాయక = విడువక. ఇది వ్యర్థమును గర్మక్రియల నడుమ నుండి యపార్థమును నైయున్నది. (భారతభక్తి 47 పుట)

వ్యర్థమనుకొన్నచో నా పదము వ్యర్థము గాని, సార్థక మనుకొన్నచో సార్థకమును నగును. 'బ్రాహ్మణులకుఁ బ్రియము చేయుము, బ్రాహ్మణులకుఁ దప్పక ప్రియముచేయుము' అట్లును నిట్లును గూడ నుండ వచ్చును. అది కవి వివక్షాధీనము. కర్మక్రియల నడుమ నితర ముండఁగూడ దని శాసన మేమియును లేదు అపార్థముచేయ నెంచుచో రానిచో టెయ్యది? కావున నాయీశంకలు చొప్పదంటుశంక లనకతప్పకవచ్చుచున్నయది.

"కనకశైలనికుంజంబును బోని వాని వక్షము" పోని=పోలిన, పకారాదిత్వమో, బకారాదిత్వమో, అనిర్ణీతము. (భారతభక్తి 48 పుట)

అనిర్ణీతమే యగునెడల "పోని=పోలిన" అనిమాత్రము విమర్శకు లెట్లు వ్రాయఁగల్గిరో కదా!

"సవ్యహస్త దక్షిణ కరమ్ములఁ గటికంఠ ప్రదేశములు పట్టికొని" సవ్యదక్షిణకరమ్ములనరాదా? (భారతభక్తి 48 పుట)

వేఱొకరు కుడియెడమచేతు లనరాదా యని ప్రశ్నించి యందుకు హేతువుగా నిది తెలుఁగుగాన నచ్చ తెలుఁగుపదమే వాడుట యుక్తమన్నచో గతియేమి? ఇవి యేటి శంకలు, కుశంకలు.

"అసాధ్యబలుఁ", "అపారబలుఁ", అన మేలు (భారతభక్తి 49 పుట)

ఇప్పుడు వచ్చిన కీ డేమి యున్నది? అపారమైవను నయ్యది సాధ్యము కావచ్చును. అసాధ్య మనుటలో విశేషము కలదుగదా! అదిగాక యిది యేటి దిద్దుఁబాటు? చాలుఁ జాలు, ఇఁక నీ 'భారతఫక్కి'లోని శంకల యసారతం గూర్చి కాగితములు వమ్మొనర్చుట యేల? దీని వాలకముం జూచిన నిది సర్వవిధముల మాశిష్యుల శతఘ్నికి మార్గప్రదర్శినిగాఁ గన్పట్టుచున్నది. శ్రీశాస్త్రిలవారు మొదట నీ ‚‚ఫక్కిని,, రచించి ముద్రిణమునకుఁ దమకడ కంపఁగా దీనిని వరవడిగాఁ బెట్టికొని వాం డ్రాశతఘ్నిని రచించియుందురని యిప్పటికి విస్పష్టపడినది. ఇంతకు మున్నే శాస్త్రిలవారి సాహాయ్య మున్న ట్లాశిష్యులు కంఠోక్తిగా వ్రాసినను కొందఱు నమ్మకము చాలదనువా రుండెడు వారు. వార లిప్పటి "భారతఫక్కి" శైలితో దానిని సంపరితించి చూచు కొన్నచో దీనిమొగము చెప్పక చెప్పినట్టు లుపకరింపఁ గలదు. ఈరీతి విమ ర్శనములు పూర్తిగా ననాదరణీయము లను నంశమా ‚‚ఫక్కి'' పుట్టనిపూర్వమే పుట్టి ప్రకటితమై యిపుడు పునర్ముద్రిణమునకు వచ్చి యున్న మా ‚‚అపూర్వ కవితా వివేచనము" వలన విస్పష్టమే కాన మరల నదే విషయము నెత్తి చర్వితచర్వణ మొనర్పక ప్రస్తుత మింతతో ముగించుచున్నారము.

తిరుపతి వేంకటేశ్వరులు

శతావధానులు.



# భా ర త వి శే ష ము లు

## ధారాశుద్ధి

శా. విద్వన్ముఖ్యుఁడు ధర్మమూర్తి త్రిజగద్విఖ్యాత తేజుండు కృ
ష్ణద్వైపాయనుఁ డేగుదెంచి సుతశిష్యబ్రహ్మసంఘంబుతో
సద్వంద్యుండు సదస్యుఁడయ్యె ననినన్ శక్యంబె వర్ణింప సా
క్షాద్విష్ణుండవు నీవు భూపతులలోఁ గౌరవ్యవంశోత్తమా. (ఆది-౨ ఆ.)

నన్నయభట్టారకుని ధారాశుద్ధి కింతకు మించిన పద్యములు "మదమాతంగతురంగ" "నిండుమనంబు" లోనైనవి యెన్నో యున్నను దీని నుదాహరించుటకుఁ గారణము ప్రాసము దుష్కరమయినను నాతనిధార సడలదని తెల్పుట కని యెఱుంగునది.

## 2. కూర్పునేర్పు

మ. రజనీనాథకులైకభూషణుఁడవై రాజర్షివై ధారుణీ
ప్రజనెల్లన్ దయతోడ ధర్మచరితం బాలింపుచుం దొంటి ధ
ర్మజు నాభాగు భగీరథుల్ దశరథుల్ మాంధాతృ రాముల్ రఘుల్
విజయుం బోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత పారిక్షితా! (ఆది ౨ ఆ.)

ఇందలి మూఁడు నాల్గు చరణములఁ బోలిన కూర్పు శ్రీకృష్ణరాయవిరచితమగు, ఆముక్తమాల్యద ౨ వ ఆ ౧౭ వ పద్యమునఁ గలదు. ఇది కడు హృద్యము. ఎవరి కవిత్వమునందుఁ గూడ నిట్టివి పెక్కుపద్యములు దొరకవు.

## 3 సాంస్కృతికాన్వయపత్ప్రవృత్తి.

ఉ. అనఘుఁడాత్మజుండగు యయాతి యధిజ్యధనుస్సహాయుఁడై
యానతశాత్రవుండు మృగయాలసలోలనిబద్ధబుద్ధిఁ ద
త్కాననమెల్లఁ గ్రుమ్మరి నికామపృతశ్రముఁ డేగుదెంచె వం
దానలినాక్షియున్న విపినాంతరకూపతటంబు నొద్దకున్. (ఆది 3 ఆ.)

ఇందలి మధ్యమధ్య మన్న విశేషణ సంప్రదాయము సంస్కృతాన్వయ స్ఫోరక మని యెఱుఁగఁ దగు.

## 4 శ్లేషలక్షణత.

చ. పరమగురూపదేశమునఁ బార్థుఁడు పార్థివరత్నశేఖరుం
డరిదిబలమ్మునన్ భుజబలాతిశయమ్మున నీశుఁ బన్నగా

భరణుఁ బ్రసన్నుఁ జేసి దయఁ బాశుపతాదిక దివ్యబాణముల్
హరసురరాజదేవనివహమ్ములచేఁ బడసెన్ గ్రమమ్మునన్. (ఆది 3 ఆ)

అర్జునుఁ డీశుం బ్రసన్నుఁ జేసి పడసినది పాశుపతము మాత్రమే. తక్కిన వారిని బ్రసన్నులఁ జేసినట్లు చెప్పనే లేదు. లేకున్నను నుత్తరమునఁ గల యంశమువలన నీశారాధనము తక్కినవారి యారాధనమున కుపలక్షక మని యెఱుఁగఁదగు.

5 అన్యథాకరణము.

ఉ. సంచితపుణ్యుఁ డంబురుహసంభవునంశము దాల్చి పుట్టి లో
కాంచితుఁడైన వాఁడు నిఖిలాగమపుంజము లేర్పడన్ విభా
గించి జగంబులందు వెలిఁగించి సమస్తజగద్ధితంబుగాఁ
బంచమవేదమై పరఁగు భారతసంహితఁజేసె నున్నతిన్. (ఆది 3 ఆ)

"వ్యాసో నారాయణో హరిః" లోనగు ప్రమాణములం బట్టి నారాయణాంశ సంభూతుఁడనఁదగు వ్యాసుని బ్రహ్మాంశసంభూతుఁ డనుట యన్యథాకరణ మని యెఱుఁగఁదగు.

6 విచిత్రసంబోధనము.

"ఉ. ఈ వసుధాధినాథుల జయించినయట్టిఁడ! నాకుఁ జక్కనై
పోవక నిల్వు నా కెదిరి పోర మదీయ ధనుర్విముక్తనా
నావిధమార్గణోగ్రగహనమ్మున దగ్ధభ్రమఁ బొంద కెమ్మెయిం
బోవఁగఁ బోలు నీకనుచుఁ బూరుకులోత్తముఁ దాకె వీఁకతోన్."
(ఆది 8 ఆ.)

7 సముచ్చయలోపము.

"క. హిమకరుఁడు శైత్యమును న
ర్యముఁడు మహాతేజమును హుతాశనుఁ డుష్ణ
త్వము విడిచిరేని గుర్వ
ర్థము నాచేకొనిన సద్వ్రతమ్ము విడుతునే!" (ఆది 8 ఆ)

విడిచిరేనియు అని యున్నం గాని హృద్యముగా నుండదని యెఱుఁగ వది. ఇందులకు మఱియొక ప్రయోగము.

"ఆ. వె. పర్వతములు వజ్రపాతహతిఁ బడక
దక్కనేని నింద్రతనయు దివ్య

నిశితబాణతతుల నిశ్శేషమగుఁగాక
పరుల సైన్య మెట్లు బ్రమయుఁ బోర." (అరణ్య ౧ ఆ.)

'తక్కనేని' అనుచోఁ 'దక్కనేనియుఁ' అని సమన్వయము చెప్పవ
లెనొడల, 'ఆదేవాలయ మెవరు గట్టించిరో నే నెఱుఁగనుగాని యీకాలువ
త్రవ్వించుట నాకుఁ దెలియదు' అను వాక్యమునకు దీటగు నని యెఱుఁగఁదగు.

8 సముచ్చయాధిక్యము.

"సీ॥...వదలక పెరుఁగుచున్నదియుఁ గాన" (ఆది 3 ఆ)

"తే॥గీ॥...సత్యమ్ముతో సరియుఁ గావు" (ఆది ౪ ఆ)

9 లోకానుస్మృతి.

"క. వీ రెవ్వరయ్య? ద్రుపద మ
హారాజులె! యిట్లు కృపణులై పట్టువడన్
వీరికి వలసెనె! యిపుడు మ
హారాజ్యమదాంధకార మది వాసెనొకో!" (ఆది ౬ ఆ)

10 లోకోల్లంఘనము.

"క. ...మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్" (ఆది 3 ఆ)

"క. ...ప్రజా। పతినిభుఁడగు భార్గవునకు" (ఆది 3 ఆ)

లోకమునఁ బైని గుఱుతుంచిన పదముల దురర్థ మెఱుఁగనివారు లేరు.

11 ఏకదేశాన్వయము.

"క...వధగావచ్చిన విప్రార్థమున..." (ఆది 3 ఆ)

వధగావచ్చినవాఁడు విప్రుఁడుగాని విప్రార్థము కాదు.

12 పాణినీయరహస్యజ్ఞత.

"క. భీమాసురవీరుల ము
ష్టాముష్టిరణోత్థితచ్ఛటాశబ్దంబుల్" (అరణ్య 3 ఆ)

ముష్టీముష్టియే గాని ముష్టాముష్టి సాధువు గాదనువారు పెక్కురు గలరు.
దీని సాధుత్వమును దత్తద్వ్యాఖ్యానమువలన నెఱుఁగఁదగు.

13 రూపితవస్తుప్రాధాన్యము

"చ...లతాలలనల్ మృదులానిలాపవ
ర్జితకుసుమాక్షతావళులు సేసలు వెట్టినయట్టులైరి" (ఆది ౪ ఆ)

14 వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి

"వ. సర్వలక్షణలక్షితంబులైన దాని సర్వావయవమ్ములు సూచి" (ఆది ౪ ఆ)

సర్వపదము వర్ణనయోగ్యతావధిక మని వ్యాఖ్యానము చేయఁదగు.

15 పాణినీయవ్యాకృత్యనుసృతి

"క. విదితముగ నిన్నుఁ జేయిం
చెదఁ గ్రతువు ధరాధినాథ!" (ఆది 3 ఆ)

నీచేఁ జేయించెద నని తాత్పర్యము. సంస్కృతభాషలోఁ బ్రేరణార్థక ధాతువుల కిట్టి ప్రయోగ ముండు నని యెఱుఁగునది.

16 అనువృత్తిపరిచారము

"క. ఘోరున మృతసంజీవిని
కారణమున నిహతులయ్యుఁ గా రసురవరుల్" (ఆది 3 ఆ)

'ఏమి గారు?' అని యాకాంక్ష రాఁగా నిహతులు అను పూర్వవాక్యస్థ మగు పద మనువర్తిత మగును.

17 నిషిద్ధముత్వర్థీయము

'ఆ. వె. ...శృంగియన్। వాఁడు శృంగిసముఁ డవంధ్యకోపి' (ఆది ౨ ఆ)

'ఇట నకర్మధారయాత్' అను నిషేధమున్నను క్వాచిత్కముగా భాష్యసమ్మతి కలదనియు నన్నయాద్యాంధ్రకవులు మాత్రము సార్వత్రికముగా వాడుచున్నా రనియు నెఱుఁగునది.

18 అవివక్ష

"వ. ...గరుడుండు తల్లి కిట్లనియె.

ఉ. ... పనుల్। సేయఁగ నేమికారణము చెప్పుము
నాకుఁ బయోరుహాననా" (ఆది ౨ ఆ)

ఈసంబోధనమున కిట నవయవార్థమును వివక్షింపవలసిన దని కవిహృదయము గాదు. స్త్రీత్వమాత్రబోధక మనియు నందునను బ్రకరణముంబట్టి 'అమ్మ' అను నర్థముమాత్రమే వచ్చు ననియు నెఱుఁగఁదగు. సంస్కృతమహాకవుల కవిత్వములో నిట్టి వెన్నో కలవు. ఇంతమాత్రమున వారి కజ్ఞత కల్పించి యౌచిత్యభంగ మయ్యెనని యనుట సాహసము, వాస్తవదూరము. దీనింబట్టి అరణ్య ౭ ఆ. లోని 'తమలతాంగి' ఇత్యాది సంబోధనములు గూడ సమర్థించు

కొనఁదగు. ఆవిశేషములు యముఁడు సావిత్రింగూర్చి పల్కినవి. ఆమె యప్పుడు మహాపదలో నున్నయది. పైఁగా నఖండపతివ్రత. యముఁడో, ధర్మస్వరూపుఁడు. ఇట్టిం డట్టి దుస్థితిలో నున్న సాధ్వి నట్లు సంబోధించు నని యెఱ్ఱన్నగా రనుకొందురా? వారి తాత్పర్య మేమి? అవయవార్థమునకు వివక్ష చేయక స్త్రీమాత్రబోధకముగా నర్థము చెప్పికోవలసినది యగుచో, ఇట్టే కవుల యాచార మని యెఱుఁగఁదగు.

## 19. ఔపచారికము.

"క. మీరలు నాపితృదేవత
లారాధ్యుల రేను మీకు నాత్మజుఁడను" (ఆది-౩ ఆ)

ఒక్కఁ డండఱకుఁ గొమరుఁ డెట్లగును? అందెవరికో యొకరికిమాత్రము కొమరుఁడు, తక్కినవారికి మనుమఁడు, మునిమనుమఁడు, ఇనుమనుమఁడు కావలెను. కాన పైప్రయోగ మౌపచారిక మని యెఱుఁగఁదగు.

## 20. ప్రసిద్ధిత్యాగము,

"వ. అని సకలభువనరక్షణప్రభువులై యాద్యులయిన హరిహరహిరణ్యగర్భ
పద్మోమావాణీపతుల స్తుతియించి" (ఆది-౧ ఆ.)

త్రిమూర్తులును వేఱువేఱు కార్యములకుఁ బ్రసిద్ధి చెందిరి. అందు రక్షణ మనునది విష్ణునికిఁ బ్రసిద్ధము. అట్టిస్థితిలో మాగురకును దానిని జెప్పుటలో నభిప్రాయమేమి? వారు సర్వసమర్థులు గాన మన మన్యథాగాఁ గూడ వివక్ష చేయ వచ్చుననియే భట్టారకాశయము. అట్లే కానిచో, "ప్రథమకబళే మక్షికాపాతః" అనునట్లు వాగనుశాసనుఁడే ప్రవర్తించినఁ దక్కినవారి గతియేమి!

## 21. విశేషణ విశ్లేషణము

"వ. ...అట్టి భృగునకుఁ బుత్రుఁడై పుట్టి పరఁగిన
క, చ్యవనునకు సుకన్యక కుద్భవ మయ్యె ఘనుండు" (ఆది-౧ ఆ)

పరఁగిన అనునది విశేషణము. అది తదనంతర పద్యము మొదట నున్న "చ్యవను" నితో నన్వయింపవలెను. ఇట్టి ప్రయోగములు కడు మృగ్యములు గాని నిర్దుష్టము లని యెఱుఁగఁదగు.

## 22. లోకోక్తి.

"వ. ...వినత నగి నీవేకన్నులం జూచితే..." (ఆది-౨ ఆ.)

నీవు చక్కఁగాఁ బరికింప లేదనుటకు లోకమున నిట్లే వ్యవహరింతురుగదా!

23. లింగధిక్కృతి.

"ఉ. ...విప్రులఁ బొంది యున్న యపవిత్రులు పూజ్యులు గారె? కావునన్
విప్రకులుండ! వెల్వడుము వేగమ నీవును నీనిషాదియున్." (ఆది-౨ ఆ.)

విప్రుని బొందియున్న నిషాదింగూర్చిన వాక్యమున సామాన్యవచనముగా "పూజ్యులు" అని వ్యవహరించుట దోసముగాదు. ఇట స్త్రీపుంలింగముల కేకశేష కూడఁ జేయనక్కఱలేదని యెఱుఁగునది. ఇట నిషాది నిషాదుని కూఁతు రను నర్థమున వచ్చిన జీషుగా నెఱుఁగఁదగు.

24. మహదమహత్సాంకర్యము.

"వ. ...ఆ సారమేయము వడిచిన నది యఱచుచు" (ఆది-౧ ఆ.)

25. మిశ్రసమాసగ్రథనచాతురి.

"ఉ. ...ఎవ్వనియేని ముఖామృతాంశు బింబమ్మున" (ఆది-౧ ఆ.)

ఈ 'ఏని'కి సమాసమధ్యస్థితి గలిగింపఁదగు ధీరుఁ డింకొక్కఁడు గానం బడునా? అది యమ్మహామహునికే చెల్లినది.

26. పాదపూర్తి

"చ. ...పాండవోత్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్"

సతతంబు అనునది యుండఁగా "ఎంతయున్" అనునది పాదపూరణార్థకమే కాని కొందఱు దానికి 'మిక్కిలి' అనునర్థము గాన "ఎల్లప్పుడును, మిక్కిలిగా" వినుటయం దాసక్తి యని సమన్వయింతురు. అది సహృదయులొప్పరు.

27. విపులీకరణనైపుణి.

"చ. జలధివిలోల వీచివిలసత్కలకాంచిసమంచితావనీ
తలవహనక్షమం బయినదక్షిణహస్తమునం దదున్నమ
ద్గళదురుఘర్మవారికణకమ్రకరాబ్జము పట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్."(ఆది-3 ఆ.

యయాతి దేవయానిని నూతినుండి బయటికిఁ దీసె ననునది యిందలి ముఖ్యాంశము. దాని నెంత పెంచెనో అం దెంత రసము నించెనో సహృదయులరయుదురు గాక.

### 28. కుంచింపు

"చ. అతులబలాఢ్యులైన యమరాంశసముద్భవులెల్లఁ బాండుభూ
పతిసుతపక్షమై సురవిపక్షగణాంశజు లెల్ల దుర్మదో
ద్ధతకురురాజపక్షమయి ధారుణిభారము వాయ ఘోరభా
రతరణభూమి నీల్గిరి పరస్పర యుద్ధము సేసి వీరులై. (ఆది-3 ఆ.)

ఇందు యుద్ధపంచకగాథయే కాక యాయా వీరుల యంశావతరణములు ధర్మజదుర్యోధనుల యోగ్యతాయోగ్యతలు గూడ సంగ్రహింపఁబడినవి. కాని యిది కథను గుంచించుటకే యుదాహరణ మనుకొనుట యొప్పు. మఱి యొకటి రెండుగూడ నుదాహరింతము

క. తనయెఱిఁగిన యర్థం బొరుఁ
డనఘా! యిది యెట్లు సెప్పు మని యడిగినఁ జె
ప్పని నాఁడును సత్యముఁ జె
ప్పనినాఁడును ఘోరనరకపంకమునఁ బడున్ (ఆది-౧ ఆ.)

క. మతిఁ బరికింపఁగ జీవిత
మతిచంచల మెండమావు లట్టులు సంప
త్ప్రతతు లతిక్షణికంబులు
గతకాలము మేలు వచ్చుకాలముకన్నన్. (ఆది-౫ ఆ.)

### 29. భిన్నక్రమము.

"క. ...యజనస్వాధ్యాయకవ్యహవ్యతపోదాన." (ఆది-౨ ఆ.)

హవ్యకవ్యములు గాని కవ్యహవ్యములు గావు. "పాఠక్రమా దర్థక్రమో బలీయాన్" దీనింబట్టి అరణ్య-౭ ఆ. లోని "క. మామయు నత్తయు" లోనగునవి సమాహితములని యెఱుఁగఁదగు.

### 30. పునరుక్తపదాభాసము

"వ. రాజయినవాఁడు తనరాజ్యభారంబు తానచూచి యారయవలయు"
చూచి విమర్శింప వలయునని తాత్పర్యము

### 31. క్రమాన్వయము.

"క. పిడుగును గాడ్పును జనులకుఁ బడుటయు వీచుటయు..." (ఆది-౬ ఆ.)
పిడుగుపడుట గాడ్పు వీచుట అని యన్వయము.

"చ. కలిమియు లేమియుజ్ సతము గావవి పెందినచోఁ జెలంగుచుజ్
కలఁగుచు నున్కి ధీరుల ప్రకారమె" అరణ్య-౭ ఆ. .........

లోనగున విట్లే యెఱుఁగఁదగు. ఇట్టివి సంస్కృతమున విశేషించి కలవు. ఆంధ్రమునఁ బ్రికారాంతరమున నిట్టివి ప్రబంధములయందున్నను సామాన్యవాక్యములయం దంతగా లేవని యెఱుంగునది.

32. తృతీయార్థక ప్రథమ,

"క. ...వినయము మెఱయుచు నుండిరి." (ఆది-౬ ఆ)

వినయముచే మెఱయుచు నని యర్థము.

33. వక్రాన్వయము.

"క. ...దండింపఁగ బ్రాహ్మణుండఁ దగునే నన్నున్" (ఆది-౫ ఆ)

(నేను) బ్రాహ్మణుండ నన్ను దండింపఁగఁ దగునే యని యన్వయము.

34. నిరర్థక ప్రత్యయము.

"క. ...గావింపు। విచిత్రవీర్యక్షేత్రమునజ్." (ఆది-४ ఆ.)

సంజ్ఞావాచకమునకుఁ గ ప్రత్యయము చేర్చుట యంత హృదయంగమము కాదు, అందులో స్వార్థమున మఱియుం గూడదు. ఇటుఁ గొందఱు 'అల్పార్థకత్వకుత్సితార్థకత్వములు కల్పింపఁ జూతురు గాని యంతకన్న యతిస్థానమున నొకానొకప్పు డెంతవానికిని నిట్టి కక్కుఱితి కలుగుచుండు ననియు నంత మాత్రమున గ్రంథకర్తను బరిహసింపఁ దగదనియుఁ దెలిసికొనుట సమంజసమని మా యభిప్రాయము.

35. 'తాను' ప్రయోగపు సొగసు.

"ఉ. ఎందులదాన వేకతమ యియ్యమునానది నోడసల్పుచుజ్।
సుందరి! నీవు నిట్లునికిఁ జూడగఁ దా నుచితంబె." (అది-४ ఆ.)

36. షష్ఠ్యర్థక ప్రథమ.

"చనుటయు...పుట్టుటయు ... ఉంటయు నే కారణంబు॥ (ఆది-४ఆ.)

చనుటకుఁ బుట్టుటకుఁ గారణ మేమి అని యుండుటకు బదులు ప్రథమగా వాడఁబడియె. లేదా, ఏమి కారణము గలది యని యేని యౌపచారికముగా నన్వయించుకొనఁదగు.

37. బహ్వర్థకైకవచనము.

"ఒండు గావు ప్రియములు" (ఆది-४ ఆ.)

ఒండు "ఒక్కటి" కి రూపాంతరము. ఇది యన్యశబ్దార్థకము. ప్రక్ర్త్రము బహువచనార్థమున నుపయోగింపఁబడినది.

38. అశాస్త్రీయవదాభాస.

"వాఙ్మనఃకాయప్రవర్తితానేక." (ఆది - 3 ఆ.)

వాక్చ మనశ్చ వాఙ్మనసం అని కావలెఁగదా యని స్థూలదృష్టుల శంక. వాక్చ మనశ్చ కాయంచ అని బహుపదద్వంద్వ మనియు, అచతురేత్యాది సూత్రమున కిది విషయముగాదనియు, మర్మజ్ఞుల సమాధానము. దీనింబట్టి తిక్కన యెఱ్ఱన రామలింగాది మహాకవుల ప్రయోగములెల్ల సమాహితము లని తెలియంగఁదగు

39. సాన్నిధ్యబలము.

"క. కడుఁదడవు నిద్రవోయితి" (అరణ్య -2-ఆ.)

నిద్రాశబ్ద సాన్నిధ్యమందే పోవుధాతువున కనుభవార్థకత్వప్రతీతి యని తెలియఁగునది.

40. అపాతతస్సిద్ధి.

"క. ... నేఁ డింతపడి మసలుటకు వా । రెంత వడిరొ యేమియైరొ యెట్లు న్నారో." (అరణ్య-2-ఆ.)

ఎంత 'పరితాప' పడిరో అనునది వానియంత నదియే సిద్ధించును. ఇటఁ బడు ధాతువు సకర్మకము.

41. ప్రధానపరిత్యాగము.

"క. వినుము మనోవాక్కాయము" లన మూఁడు తెఱంగు లందు నంతఃకరణం బనఘ! ప్రధానము..............." (అరణ్య-2-ఆ.)

మూఁడు తెఱంగులగు కరణములయం దని చెప్పవలసియుండును. కరణ శబ్దము కాయమునకుఁ గూడ వాచక మగుఁగాన నీత్రికమునకుఁ త్రికరణములను పేరు చెల్లును. "కరణం సాధకతమక్షేత్ర గాత్రేంద్రియేష్వపి" అని యమరము.

42భావప్రధాన నిర్దేశము.

"చ. పతిరహితంబు దుస్సహము, భర్తృవినాకృతయైన కాంత దూషితయగు..." (అరణ్య 2 ఆ)

ఇట రహితము రాహిత్యార్థమున నుపయోగింపఁబడినది. ఇట్లే కవిత్రయము వారి 'సహాయము' 'సరసము' లోనగునవియు సమాహితము లని యెఱుఁగఁదగు. ప్రకృతపద్యమునందు, జీవనము అనునది యధ్యాహార్యము కాఁగూడదా ? యందురేని, కావచ్చునుగాని యన్యార్థ మంగీకరింపఁదగిన భావప్రాధానత నాశ్రయించుట యంతకన్న సుగమోపాయ మని యెఱుఁగఁదగు.

43 అభేదోపచారము.

తే॥గీ॥ ఏడు మాట లాడినయంత నెట్టివారు
నార్యజనులకుఁ జుట్టమ్ము లగుదు రనిన... (అరణ్య 2 ఆ)

పైవాక్యము 'సఖ్యం సాప్తపదీనం' అను నుక్తింబట్టి పుట్టినది. 'అథ మిత్రం సఖా సుహృత్' సఖిశబ్దము బంధుపర్యాయము గాదు గాన నిట నభేదోపచారము స్వీకరింపవలయును.

44 యాదృచ్ఛికానుసృతి.

క॥... తేప వయి కడవఁ బెట్టిన
నీపుణ్యచరిత్ర కీర్తనీయము తల్లీ! (అరణ్య 2 ఆ)

ఇందలి తుదిచరణము శ్రీనన్నయభట్టారకుని

క॥...మునులకు నీయింద్రియజయము కీర్తనీయము తండ్రీ! (అరణ్య 2 ఆ)

అను రచనకు జ్ఞాపకమగుచున్నది. ఏకవిగాని యింతమాత్రమున గ్రంథచోరుఁ డనఁ దగఁ డనియుఁ దనకన్న ప్రాచీనులగు కవులలోఁ దన కేకవి కవిత్వమున నెక్కుడభిమానముండునో యతని కవిత్వమునందలి పోలికలు తన రచనలో యాదృచ్ఛికముగా నేని రాకమాన వనియు నెఱుఁగఁదగు. ఈవిషయమున కిట నిచ్చిన యుదాహరణ మంత బలవత్తరమైనది కాదు. ఎన్నేని యుదాహరణములు మిగుల బలవత్తరములు కలవని యెఱుఁగునది. ఎఱ్ఱనవంటి మహాకవికైనచో నీయనుసృతి యాదృచ్ఛికమైనది గాని సామాన్యులకెల్ల నట్టిది యనుకొనఁదగదు. ఈనిర్ణయము కడుదుష్కరము. 'సహృదయాః ప్రమాణం.'

45 ఆవృత్తి.

వ॥ ... ద్యుమత్సేనుండు ... కొడుకునుం దానును గజారూఢుఁడై సతీసమేతుఁడగుచు...పురంబునకుఁ జని......(అరణ్య 2 ఆ)

ఇట సతీసమేతత్వ ముభయులకు నన్వయింపవలయును. లేనిచో సావిత్రి వట డించినట్లు తేలును గాన నాపద మావర్తింపక తప్పదు.

46 కాక్వర్థక సముచ్చయము.

ఉ॥ నీవును బ్రహ్మచారివి వినీతుఁడ వేనును కన్యకన్॥ (ఆది 3 ఆ)
ఇట నీవును వేనును అనుచో, నీవా, బ్రహ్మచారివి; నేనా, కన్యకను
అను నర్థము హృదయంగమము. దీనింబట్టియే యెఱ్ఱాప్రగ్గడ—

చ॥ తమమును జెల్లగాఁ బరఁగె దవ్వు నిజాశ్రమభూమియున్ మదిన్
శ్రమమును బాయ దిప్పు డను చందమయేని జనంగ నేల యిం
పమరఁగ నింత ప్రొద్దు సుగుణాకర యిచ్చట నిల్చి రేపు వో
దమె తెఱఁగెద్ది? నావుడును దన్వికి సాళ్వతనూజుఁ డిట్లనున్॥(అర౭ఆ)

47 అనుకృతి స్వాతంత్ర్యము.

క॥ ధిక్కారమ్ములు చరణద । భక్కారమ్ములును...... (శల్య ౧ ఆ)
ఇందు దభక్కారము స్వేచ్ఛాద్యోతకము.

48 అకర్మక సకర్మక వినిమయము.

తే॥గీ॥...అపుడు। విడుచుటకై ప్రాణ మాఁగినాఁడు
తే॥గీ॥ హర్మ్యములనుండి పణ్యపుణ్యాంగనాని
కరము లక్షితయుతమౌక్తికములు సేస
లొలుక...... (శాంతి ౧ ఆ)

పైని జూపిన 'ఆఁగు' 'ఒలుకు' అనునవి వ్యవహారమం దకర్మకములు.
ఇక్కృతము సకర్మకము లని యెఱుఁగఁదగు.

49 ఆర్థికవిశేషణము.

ఉ॥ ధన్యుల కాసుభద్రకు శతక్రతుపుత్రున కుద్భవించె॥ (ఆది ౭ ఆ)
ఇట ధన్యులకు అను బహువచన మర్థగతద్విత్వప్రయుక్తమని యెఱుఁగఁదగు.

50. సర్వనామసంఘటనావైపుణి.

..చ. అనిన నుపేంద్రువాక్య మను నయ్యమృతమ్మునఁ జేసి,, (సభా-౧ ఆ)
ఇట అయ్యమృతము అనుచో నున్న సర్వనామప్రయోగము కడు
హృద్యము; ఇతరకవుల ప్రయోగములందు మృగ్యము.

చ॥ ...శిరముల కొప్ప నర్చనలు సేసిన పువ్వులయవ్విధమ్మునన్ (ఆ-౭ఆ)
లోనగు భారత ప్రయోగముల సొబగెల్ల నిట్లే యరయుదురుగాక.

### 51. ధారుణీగతోకారనిర్ణయము.

చ॥ గుణముల నొప్పి బ్రాహ్మణులకుం గడు భక్తుఁడవై సమస్తధా
రుణిప్రజఁ బ్రోచుచున్ విగత దోషుఁడవై...... (ఆది-౭ ఆ)

యతిస్థానమున నుంటచే ధారుణి యుకార మధ్యమనుట వాగను శాసన సమ్మతము. ఎక్కువ విమర్శనాజ్ఞానము గలవా రనేకులు 'ధారిణీ' శబ్దమువలె 'ధారుణీ' శబ్దము నొప్పరు. ఇది సంస్కృతకవిప్రయోగములచే నిర్ణయింప శక్యము గాదు. ఉకారము లేఖకప్రమాద మనినం బోఁగలదు. ఈవిచారము నేటికి 20 వత్సరములకు మున్ను శ్రీ మహామహోపాధ్యాయ పర వస్తు రంగాచార్యులవారి సందర్శనమున కరిగినప్పుడు ప్రసక్తించినది. ఇటీవలఁ జాలకాలమున కీప్రయోగము చిక్కినది. ఉభయరూపములును సాధువు లని యెఱుఁగఁదగు.

### 52. అపూర్వప్రయోగము.

ఆ. వె॥ ... ఉండుఁగావ్రతమ యఖండితముగ (ఆది-౮ ఆ)

ఇట కావ్రతమ్ + అ, అనియుండ మకారాదేశము వచ్చుటలోఁ జిక్కు లేదు కాని భారతమునందక్క వేఱొకచో నిట్టిప్రయోగ మిట్టిపట్టున మృగ్యము

### 53. సార్థబిందు నిరర్థబిందు ప్రాససాంకర్యము.

క॥ ఓగువెడలక ... యె
సఁగుఁ బూర్వస్థితిన బ్రదుకు నమకూరంగన్ (శాంతి-౩ ఆ)

### 54. శ స ప్రాసమైత్రి.

ఆ॥ వె॥ ... చతు । ర్దనుల నుభయపక్షవశత నచ్చు (అనుశా-౪ ఆ)

### 55. అఖండ విశ్రమము.

సీ॥-తే॥ గీ॥ చెప్ప వయ్య పుణ్యసతీప్రభావంబు నాకు (అర-౫ ఆ)

### 56. నమ్మినమ్మకనుగూర్చి

క. నమ్మమి మృత్యువు, పెద్దయు
నమ్ముట యపమృత్యువగుట నరపతి నమ్మీనమ్మక... (శాంతి ౨ ఆ)

53-56 ప్రయోగము లిటీవల నిన్న మొన్న నచ్చయిన భారత సంపుటములలో దిద్దఁబడి యున్నవి. కాని యథాశ్రుత పాఠముల ననుసరించి తదనంతర మహాకవులెల్లఁ బ్రయోగించికొని యుండుటచేత నేమి, మఱికొన్ని హేతువుల చేత నేమి, దిద్దుటయే చింత్య మని సంక్షేపము.

57 సాహచర్య విశేషము.

వ. కూఁతునల్లుని బూజించిన (ఆది-3 ఆ)

ఇట "పూజించు" ధాతువులోఁ గూఁతుశబ్దార్థముగూడ నన్వయించినను గేవల మావెను మాత్రమె యుద్దేశించి నన్వు డిట్లు ప్రయోగింపఁబడియుండ దని యెఱుఁగఁదగు.

58. నిర్బీజ ప్రయోగము.

వ॥ ... ఋతుమతియునై యాత్మగతంబున (ఆది-3 ఆ)

ఆత్మగతశబ్దము నిర్దుష్టమైనను నిట్టి యర్థమున దీనికిఁ బ్రయోగము సంస్కృతమున మృగ్యము గానఁ దత్సమములో నుండుట యపూర్వ మని యభిప్రాయము. ఇట్లే "అంతర్గతంబున" లోనగు ప్రయోగము లెఱుఁగునది.

59. ప్రయోగ వైచిత్ర్యము

మ త్తకో॥ నీతపర్థము గాఁగ దేవవినిర్మితం బిది (ఆది-౨ ఆ)

60 యతిపలని యుపయోగము

చ॥ ... విజితేంద్రియుండనఁగ నమ్మునిఁ బాయక విందునంచు దా
నిది కలకూ వెఱుంగ నవనీపతి యుత్సుకుఁ డయ్యె నాత్మలోన్
(ఆది-ర ఆ)

ఇట సామాన్యముగాఁ బదచ్ఛేదము చేసికొనువారికిఁగూడ 'ఇది' యని విఱుగదని తెలిసికొనుటకు విశ్రమము కొండొక సహాయ మొనర్పవచ్చును. సూక్ష్మదర్శులగువారి కే సాయముతోఁగాని పనియె లేదు. కాన నింతో మాత్రమున యతికిఁ బూర్ణమైన సార్థక్యము గలుగునని చెప్ప సాహసింపము. దానికి నింత కన్నను ముఖ్యప్రయోజనములు కల వని యెఱుఁగునది. అవి వేఱొకచో విస్తరింతుము

61 పర్యాయత స్వాకర్యము.

క॥...పాణిగ్రహణము చేయుము నన్నున్॥ (ఆది ర ఆ)

పాణిగ్రహణమునకుఁ దెలుఁగులోఁ బర్యాయపదము పెండ్లి యనునది. నన్నుఁ బెండ్లి చేసికొనుము అని సమన్వయించు కొన్నప్పుడే ద్వితీయ హృదయంగమ మని యెఱుఁగఁదగు. 'కొని' లేకుండఁగూడ నాత్మనేపదార్థకత్వము భారతసమ్మతమని యన్యత్ర విస్తరింపఁబడియె.

### 62 విశేష్యద్విత్వయాపాతము.

క॥...వనమంద్రం। గాంచి గంగ యెంతయుఁ బ్రీతిన్

వ॥... గంగ సంతసిల్లి యిట్లనియె. (ఆది ౪ ఆ)

పైనిఁజూపినఁ గంగ అనునది రెండుపర్యాయములు వేఱువేఱు చోట్ల వాడఁబడినను వానికి రెంటికిని దుదకు నన్వయము 'ఇట్లనియె' అను సంపూర్ణ క్రియయందే కావలయును. అట్లేని యిందొకటి వ్యర్థ మైతీరవలయును. కాని రచించు ధోరణిలో నిట్లు ప్రతికవికిని బడుచుండు ననియు భిన్నప్రదేశస్థితి కతన నిది సహ్యమనియు నెఱుఁగఁదగు.

### 63 సామాన్యనిర్దేశము.

క॥ జనవర! యాభ్రమానిని న
న్నను మఱి నీభ్రాతృవరులనుం జూచితె? నీ
వనవుడుఁ జూచితి (నన్నిటి)
ననఘా! వృక్షమున నున్న యవ్విహగముతో॥ (ఆది ౫ ఆ)

ఇట 'అన్నిటి' అనునది యమహదర్థకము. కర్మవాచకములలో భ్రాను మాత్రమే దాని కనుగుణ మగునుగాని తక్కిన మహదర్థకములు కావు. పోనిమ్ము 'అన్నిటి' అనునది 'అందఱ'అని సవరించినచో "మాత్రను" సమన్వ యింపదు. అయినను బాహుళ్యమును బట్టి 'అందఱన్' అనుటయె యుక్తము, గాని వ్యక్తిని బురస్కరించుకొని 'సామాన్యే నపుంసకం' అను శాస్త్రానుసార మున 'అన్నిటి' అని వాగనుశాసనుఁడు వాడె నని యెఱుఁగునది.

### 64. మహద్వివక్ష.

"క. ... పాండవ। వజ్రప్రాకారుఁడు జాముండెను." (ఆది-౬-ఆ)

ఇట ప్రాకారమనుట యుక్తమైనను సముద్రాది శబ్దములకుంబలె మహ ద్వివక్ష చేయఁబడినది. సముద్రాదులయందు దేవతాత్మత్వ మున్నట్లు ప్రాకా రమునందు లేదు. లేకున్నను గ్వాచిత్కముగా నట్లు వివక్షింపవచ్చునని భట్టా ర్కుని యాశయము. కావుననే తెనాలి రామకృష్ణకవి—

"సీ. అఖిలభూమీపాలకాస్థానకమలాకరోదయతరుణసూర్యోదయుఁడవు."

అని ప్రయోగించికొనియె నని యెఱుఁగఁదగు.

65. యౌగికబలీయస్త్వము.

"వ. ... పవనతనయు బ్రాహ్మణార్థమ్ము గాఁదన సమర్పించుటయుం జెప్పి"
(ఆది-౭-అ)

బ్రాహ్మణార్థశబ్దము యోగరూఢము. దీనిని బిత్రుకార్య నిమంత్రణమున మాత్రమే కృష్ణా గోదావరీతీరవాసులగు పండితపామరులు యోగరూఢముగా వాడుదురు. నన్నయ గోదావరీతీరస్థుఁడయ్యు బ్రాహ్మణప్రయోజనము అను నర్థమున దీని నుపయోగించెను. వేఱొక బ్రాహ్మణార్థమువలె నిది రూఢము గాఁజాలదు. శాస్త్రకర్తలు రూఢికి బలీయస్త్వమును శాసించుచున్నను నియ్యెడ నవయవార్థమునకే బలీయస్త్వము చెప్పక తప్ప దని యెఱుఁగునది. కొన్ని శబ్దములకు నొక్కొక్కచో నిట్లు చెప్పినం గాని కాళిదాసాదుల కవన ముకూడ దుస్సాధ మగునని ప్రాజ్ఞు లరయుదురుగాక.

66. ప్రయోగవైచిత్ర్యము

చ॥ ...ఏ। నెఱిఁగిన యంతనుండియును నిట్టి లతాలలితాంగిఁ జూచి యే నెఱుఁగ......॥ (ఆది-౭ అ)

67. అచ్ఛరకదుష్ఠితసంశ్లేషము

మత్త॥ ......మదీయభాషితమెన్నఁడుఁ। న్నేని మోఘము గాదు దిగ్ధరణీరవీందు లెఱుంగఁగన్॥ (ఆది-౭ అ)

ఇట 'ఎన్నఁడొ నేని' అని కొన్నిపాఠములు గనవచ్చుచున్నవి. కాని యీదిద్దుఁబాటును శాస్త్రకర్తలు పాటింప లేదు గాన దిద్దుట చింత్యము. ఇందులకు వహోబలపండితీయము చూడఁదగు. భారతాధారముననే మహాకవి పోతరాజుగారు భాగవతమున నిట్టిప్రయోగములు తప్పు తెప్పలుగాఁ బ్రయోగించి రని యెఱుఁగఁదగు.

68 గౌరవార్థకబహువచనము

వ॥ ... వీరు కుంతీమహాదేవులు॥ (ఆది-౭ అ)

నిందార్థమున 9 వ అంకెగలచోఁజూపఁబడియె.

69. అపూర్వప్రయోగము

క॥ ... పర్వతశిఖరం బెత్తి వి। గుర్వింపుము చూత మనిన గోత్రభిదుండున్
(ఆది-౭ అ)

### 70. ప్రయోగస్వాతంత్ర్యము

క॥ ... హిమపర్వత పార్శ్వమునందు॥ (ఆది-౨ ఆ)

హిమవత్పర్వత మనుటకు హిమపర్వతమని యుపయోగింపఁ దగ దని కాదు గాని జ్ఞానలవదుర్విదగ్ధులు చేయు కుశంక కవకాశము గలుగు నని యెంచి వ్యాఖ్యానము చేయఁబడియె. దీనింబట్టి కుంభోద్భవుఁడను నర్థమునఁ బ్రయోగించిన "కుంభసంభవుండు" (భార-ఆది-౨ ఆ) జలధిశయనుఁడను నర్థమునఁ బ్రయోగించిన 'జలశయనుఁడు' (భార-ఆది ౨ ఆ) లోనగునవియు వ్యాఖ్యాతము లని యెఱుఁగునది.

### 71. స్వరతోవిశేషప్రతిపత్తి

వ॥ ... తపోమహిమ నెవ్వరికంటెఁ బెద్ద యయినవాని (ఆది-౬ ఆ)

ఇట "స్వరవశమున" ఎవ్వరికంటె అనుదానికి, "అందఱికంటె, అను నర్థము వచ్చు నని యెఱుఁగునది.

### 72. అతంత్రిత

వ॥ మణలూరు పురము॥ (ఆది-౭ ఆ)

ఇట "ఊరు" అనుదానికి నర్థము వివక్షింపరాదు. వివక్షించినచో "పురము" అనునది పునరుక్త మగును. ఊరు వేఱు, పురము వేఱు, అనుట వితండవాదము కాన నుపేక్షించి సంజ్ఞావాచకగతైక దేశమున కిట్టి పట్టుల నర్థవివక్ష చేయుట ప్రాజ్ఞసమ్మతము గాదని స్థిరీకరించుచు 'అన్నమాంబాపతి' (విరా ౧ ఆ) లోనగు ప్రయోగములు సుసాధనము లగుట కిదియే మార్గమని యెఱుఁగఁదగు.

### 73 విలోమద్వంద్వము.

వ॥...వసుదేవదేవకులకుం జెప్పి (ఆది ౭ ఆ)

దేవకీవసుదేవు లనుట యుక్తము. అయినను ఛందస్సౌకర్యమునకై యిట్లు మార్పవలసివచ్చినది. ఇట్లే "చ॥ నలపమయంతులిద్దఱు" (అర ౧ ఆ) లోనైన వెఱుఁగఁదగు. కేవలాంధ్రకవులే కాక సంస్కృతమహాకవులుగూడ నిందులకు సమ్మతించిరి. మేఘసందేశస్థ "నదనదీ"త్యాది కాళిదాసప్రయోగములు చూడఁదగు.

74 సప్తమ్యర్థక ప్రథమ.

ఆ॥...వానిచేఁత లోకటియేనియుఁ దలఁపవు (అర ౫ ఆ)

75 సంధిపట్టున 'ఋ' కారము హల్లగుటనుగూర్చి.

మ॥...గర్వోన్నతుల్ ఋక్షవానరకీరుల్ (అర ౬ ఆ)

ప్రాసవిషయమునకు 'అప్పకవీయము' చూడఁదగు.

76 ప్రయోగవైచిత్ర్యము.

వ॥ హరియందు లక్ష్మిగ్రని......వసిష్ఠునం దరుంధతిని బోలి సుందరి! నీపతు లందుఁ బ్రీతి పతిభక్తి యొప్ప నపత్యంబు వడయుము. (ఆది ౮ ఆ)

77 భిన్నలింగకోపమితి.

ఉ॥ ఆధృతరాష్ట్రుఁడా వఱచిన ట్లఱచెఁ...... (ఆది ౬ ఆ)

దీనింగూర్చి రసగంగాధరమునఁ గొంత చర్చించెంగాని క్వాచిత్కముగా సహృదయరంజక మగునేని యిట్లు కూర్పం జను నని తన సమ్మతిం దర్శించెను. విస్తర మందే చూడుఁడు.

78 ప్రయోగవైచిత్ర్యము.

క॥...గుణో । ద్భాసితు వినినట్ల చూచి॥ (ఆది ౫ ఆ)

తా నెట్లు విని యుండెనో యందుల కించుకయు భేదింపని ద్రోణాచార్యునిఁ జూచె నని తాత్పర్యము.

79 తెలుఁగుమరియాద.

క॥...ఘనతరముఖనేత్రనాసికాకర్ణములంను॥ (అర ౬ ఆ)

ఇట సంస్కృతమునందు "ముఖ...కర్ణమ్" అని ఏకవద్భావము వచ్చును. తెలుఁగులో బహువచనము చేయుటకుఁ గారణ మర్థగతబహుత్వ మని యెఱుఁగఁదగు. కొంద ఱీసందర్భ మెఱుంగక దిద్దుచున్నారు. కొన్నిచోటుల దిద్దఁబడినను— 'వ॥...వికలహృదయ లైన సఖీజనంబులు' (అర ౨ ఆ)

'క॥ దేవతలు ధర్మవర్తులు' (అర ౨ ఆ)

ఇత్యాదులయం దర్థప్రాధాన్యముం జేసియే విశేష్యవిశేషణభావ మగు చున్నము గావలయును. లేదా ? నిత్యస్త్రీలింగ మగు దేవతాశబ్దమునకు 'ధర్మవర్తులు' అను విశేషణము సమంజస మెట్లయ్యెడిని ? ఇట్లే సఖీజనశబ్దమునకు 'వికలహృదయలు' అనునదియు నని యెఱుఁగఁదగు. అన్యత్ర స్వీకరింపఁబడిన యావశ్యకత కిప్పటనే తా వొసంగుట యుక్తమని విజ్ఞు లెఱుఁగుదురుగాక.

80. విచిత్రాన్వయము.

"ఉ॥......పాండుభూ।పాలుని ధర్మనందనుని, పంకజ నాభునియట్ల కావె"
(ద్రోణ 3 ఆ).

81 చర్వితచర్వణము.

తే॥గీ॥ వంతఁ దలపోసి తలపోసి, వనరి వనరి
మిగుల వందురి వందురి పొగిలి పొగిలి (విరా ౨ ఆ)
చెప్పినవిషయమే చెప్పినను నిట రసము చెడలేదు.

82. సర్వశబ్దపర్యాయము.

ఉ. ...ఎల్లవాఁ। డుం దనవారిఁదోడ్కొనికడున్ రభసమ్మున. (విరా 3 ఆ)
ఈ 'యెల్లవాఁడు' సర్వశబ్దమునకు సరియై యేకవచనమందుండియు బహువచనమందుండియు నొకటేవిధమగు నర్థమును బోధించెడిని, గాని యేకవచనమున నించుక వైలక్షణ్యముకలదు. అది సహృదయు లరయుదురుగాక. మఱియు 'ఎల్లవారు' అనుటకు 'ఎల్లరు' అను రూపాంతరము కలదుగాని 'ఎల్లవాఁడు' అనుదానికి 'ఎల్లఁడు' అను రూపాంతరము మృగ్యము. 'అట్టివాఁడు' 'అట్టేఁడు' లోనగువానింబట్టి చూచినచో నుండవలసివచ్చుచున్నను, అనభిధానమగుటచే లేదనుకొనవలయును.

83. ఈయన కియ్యనయుం గలదు.

ఉ. ...తల్లీ! నీ। కియ్యనలక్ష్మి నూఁది చరియింపక యిప్పుడు వాయఁబాడియే.
(ఆశ్రమ – ౧ – ఆ)
ఈప్రయోగము వ్యాకరణవిరుద్ధ మని లేదుగాని 'ఆయనకు అయ్యన, ఈయనకు ఇయ్యన' లోనైనవి యనభిధానప్రాయమ్ములగుటచే నుదాహరింపఁ బడియె నని యెఱుంగునది.

84. లాక్షణికప్రయోగము.

తే. గీ. అనుదినమ్మును భక్షింతు రర్థవంతు.

85 నణప్రాసవిచారము.

ఆ. వె. దుర్ణయమున శకుని కర్ణదుశ్శాసనుల్. (ఆది – 3 – ఆ.)
'దుర షత్వణత్వయోః' అను నిషేధ ముంటచే నియ్యెడ ణత్వము దుర్ఘటముగాన 'దుర్నయ' అని దిద్ది దీనికి
ఆ. వె. అక్షౌహిణి, యానిరంతర ప్రమాణసంఖ్య, (ఆది-౧-ఆ.)

అనుదానిని జతఁ జేసి, "ఉభయప్రాసము భట్టారకసమ్మతంబు" అని నేఁటివారొకరు వ్రాయుచున్నారు. ఉభయప్రాసము అనఁగా నణప్రాసము భట్టారకునకు సమ్మతము కాకేమి గాని పైవారనుకొను తెలుఁగున మాత్రము సమ్మతముకాదు. కావుననే అప్పకవి— ఆ. వె. ధాత్రిఁ బాణినీయసూత్ర॥

అను పద్యమునందు నెట్టి ణకారము నకారముతోఁ జెల్లునో తెల్పియున్నాఁడు. ప్ర + మాన=ప్రమాణ అనునది తాదృశణకారమే గాన దానిని నీనితో జోడింపఁ దగదు. కర్ణశబ్దగత ణకారమునకును, ప్రమాణశబ్దగత ణకారమునకును నెంతో భేదము కలదు. నకారమునకుఁ బ్రాసము కాఁదగు ణకారము స్థలాంతరమునం దెప్పుడేని నిరుపాధికమైనప్పుడు తన స్వస్వరూపమును బొంది యుండవలయు ననునది యిందలి పరమార్థము. అట్టిస్థితి కర్ణశబ్దగత ణకారమున కున్నట్టులు ప్రాజ్ఞులుభావింపరు. కావున నట'దుర్ణయ' 'దుర్నయ'గా సిద్ధక ఉభయరూపసత్తకు యత్నింపవలయును.అందులకు దుస్, దుర్ అను నుభయోపసర్గసత్తయు "లక్షణప్రతిపదోక్త" పరిభాషయు సాధకములు. ఆయుద్దేశముతోడనే భట్టారకుఁ డట్లు ప్రయోగించెను గాని యథేచ్ఛముగా న ణ లకుఁ బ్రాసము చెల్లింపవలయు నని కాదు. యావత్సుకవివిదితమగు నీవిషయమున నింతకంటె విస్తరింపవలసినదిలేదు. శేఖరకారుని యిటీవలి నిష్కృష్ట సిద్ధాన్తమునుబట్టి దుర్ణయగత ణత్వము నిలువదంచురేని, నిలువకపోయినచో నన్నయ నాఁటి కట్టి సిద్ధాన్త ముదయింపలేదు గాన నతని యుద్దేశమును మార్పఁగల సామర్థ్య మీ యిటీవలి సిద్ధాన్తమునకుఁ గలుగదు. అగుచో నేఁటివా రా ప్రయోగము ననుసరింపక శేఖరకారు ననుసరించి ప్రయోగించుకొనుటయే యుక్తమందురా? అది యుక్తమే కాని, ఈపూర్వపక్ష సిద్ధాన్తములు పండితు లాయాయీ కాలములయం దవిచ్ఛిన్నముగా జరుపుకొనుచునే యుందురు. ఒకరొకప్పుడు నెగ్గొకరు మఱొకప్పుడును జయము నందుచునే యుందురు. అంతమాత్రమున శ్రీనాథ పెద్దనాద్యనేక మహాకవి సమ్మానితమైన ప్రయోగమునకు క్షతికలుగఁ జేరదు. వాది దౌర్బల్యమే గాని వాద దౌర్బల్యముండనేరదు. ఆ ప్రయోగమే యితర మహాకవి దేని యగుచోఁ బోఁగలదేమో గాని ఆంధ్రభాషకు మహాభాష్యప్రాయ మగు మహాభారతస్థమై యెట్లు పోయెడిని? పోదు. సంస్కృతకవుల కది యనుసరణీయము కాకపోవచ్చును గాని తెలుఁగు కవి అనువానికెల్ల ననుసరణీయమగుట కేయభ్యంతరమును నుండదు. కొంత [illegible] కాధారముగల యీ ప్రయోగమె తెలుఁగు కవుల కనుసరణీయముకానిచో.

"తనమయము, తమమయము, మెదడు ప్రోవులమయము" లోనగు తిక్కనా రంభదాసుల ప్రయోగముల కేసంస్కృత వ్యాకరణ మాధారమై గతి గల్పింపఁ జేసెని. కావున భారత ప్రయోగములవిషయమై యెవ్వరును వృథాస్వాతంత్ర్యము నవలంబింపరాదు. ఈ యంశము పాశుపతమునఁ గొంత వివరించినదియే. పోనిండు, దుర్ణయగత ణత్వవిచారము తెలుఁగులోని ప్రయోగములనుబట్టి మాత్రమే చేయవలసివచ్చిన దని యనుకొనుచుంటిరేమో అట్లుకాదుసుఁడీ.

శ్లో॥ క్షుత్తవోహ్య మమ వృద్ధస్య దుర్ణయస్య ఫలోదయః॥ (హరివంశము)

ఇక్కడ దిద్దుదు మందురా? మీ రనిన లాభమేమి? వాచస్పతియట్టి మహాపండితున కీ మాత్రము దిద్దుసాహసము లేకయేపోయె నని యెవ రనుకొందురు. ఇట ణత్వము వచ్చుట కొంతవఱకు న్యాయముకాదని వ్రాసెనే గాని యతఁడు దిద్ద సాహసింపలేదు. అతఁడు శేఖరకారకున కిటీవలివాఁడగుట చేత ణత్వసత్త ననుమానింపఁజేసినవాఁడయ్యు "దుర్ణయ, దుర్నయ" అను రూపద్వయసత్తను తన నిఘంటువునం దంగీకరించెను. అట్లే 'ఏప్టి' అను నిఘంటుకర్తయు నంగీకరించెను. విస్తర మెందులకు, ఈవిచారము సంస్కృతభాషా గ్రంథములయందును నుపలబ్ధమగుచున్నది హరివంశప్రయోగ మార్షమందురా? అనుఁడు. వాచస్పతి యట్లేల యనలేదో విచారించికొనుఁడు. వారు త్రొక్కకున్నను మీరు క్రొత్తత్రోవ త్రొక్కి దిద్ది చేసిన విశేష మేమున్నది? ఆపసిద్ధాంతమునకుఁ గడంగితిరికదా! ఈసిద్ధాంత మింతవఱకు కేలాక్షణికునికి సమ్మతిమో యొకనిఁ జెప్పఁగలరా? పైఁగా, ప్రమాణశబ్దగత ణకారస్వరూప మెఱుఁగనివా రేసిద్ధాంతము కల్పించిన నేమి నిల్చును? వినుఁడు, దుర్ణయగత ణకారముంబలె నెన్ని శబ్దముల యందెన్ని సందర్భములు శాస్త్రకర్తలచే ఖండితములయ్యు ననంతరమహాకవులచేఁ బ్రయోగింపఁ బడుచున్నవో—

(1) "అపతరశబ్దస్య... దీర్ఘత్వ వ్యత్యాసో బాలానాం, బాలిశానాం ప్రయోగేష్వితి, తేహ్యపతరణ మవతార ఇతి ప్రయుఞ్జతే 'మారుతావతార, ఇతి నహ్యయుక్తః, భావేతర తేరవిధానాత్...'

(2) ముగ్ధిమాదిష్విమనిజ్ మృగ్యః, ముగ్ధిమా, ప్రౌఢి మేత్యాది ష్విమనిజ్ మృగ్యః, అన్వేషణీయః (కావ్యాలంకారసూత్రము)

పైని జూపిన ప్రమాణముల ననుసరించి రామావతారము, కృష్ణావతారము లోనగు ప్రయోగములెల్ల దుష్టములేకదా! అగుచో

"మాభూత్పరీవాదనవావతారః" ఇత్యాది కాళిదాసాది మహాకవుల ప్రయోగములు నన్నయ్యగారి 'దుర్ణయ' ప్రయోగము వంటివే కావలయుం గదా! ఈ వామనునికన్నఁ బ్రాచీనుఁడుగాన కాళిదాసు తన ప్రయోగమును దిద్దికొనకున్నను నిటీవలివారేని దిద్దికోవలయునుగదా. అట్లే మహాకవి దిద్దికొనియెనో ప్రమాణమిచ్చువారు కలరా? అట్లే 'ప్రౌఢిమ' అనునదియు దుష్టమే కావలయును. అగుచో నీమూకమహాకవి ప్రభృతుల ప్రయోగములగతి యేమి?

శ్లో॥ ఇంధానే భవవీతిహోత్రనివహే కర్మౌఘచండానిల।
ప్రౌఢిమ్నా బహుళీకృతే........॥ (మూకపంచశతి)

అవతారశబ్దమునకుం బలెనే ప్రౌఢిమకును ప్రయోగములు పరశ్శతముండెడి నని యెఱుఁగనివారే లేరు. కావుననే వామనుఁ డనేకశబ్దములంగూర్చి యిట్టి చర్చజరిపి ఖండించియున్నను సర్వసామాన్యముగా నుండెడిశబ్దములనే యిందు గైకొని విచారింప మొదలిడుట. ఈ వామనుఁ డెంతవాఁ డనుకొంటిరి సామాన్యుఁడు గాఁడు. వైయాకరణశిరోమణి యగు శ్రీభట్టోజిదీక్షితునకుఁ గూడ మాననీయుఁడు.

"అనైహీతివృద్ధిలవద్యా" అనైహీత్యత్ర వృద్ధి రవద్యా, గుణ ఏవయుక్త ఇతి"
(కావ్యాలంకార సూత్రములు)

తేనా నైహీతి వృద్ధి రసాధురేవ (కౌముది)

ఈరెంటికిం గల సంబంధమును, వీరియుభయ కాలభేదమును, నెఱిఁగినవారికీవామనుఁ డెట్టిఁడో తెలియక పోదు. ఈవామనుఁడు కాశికావృత్తికర్తయగు వామనునికన్నఁ జాల నిటీవలివాఁడయ్యు దీక్షితులకన్నఁ జాలఁ బూర్వుఁడని యెఱుఁగఁ దగు. కొన్నిచోట్ల దీక్షితు లితని మతమునకు భిన్నముగాఁ బోయినట్లు స్థూలదృష్టికిఁ గన్పట్టును గాని బాగుగ విచారించినచో నితని మతమునకించుక యనకాశ మొసఁగియే దీక్షితులు తన సిద్ధాంతమును వ్యాపింపఁజేసెనని స్ఫురింపక మానదు

ఊకారాంతా దప్యూఙ్ప్రవృత్తేః, ౫-౨. (కావ్యాలంకార సూత్రములు)
ఊత, ఊఙ్వ్యాహితః, ఊకారాన్తాదపి క్వచి ద్భవతి ఆచార్యప్రవృత్తేః, అప్రాణిజాతేశ్చారజ్వాదీనాం, ఇతి అలాబూః, కర్కన్ధూరిత్యుదాహరణం,

తేన "సుభ్రూకిం సంభ్రమేణ" అత్ర సుభ్రూశబ్ద ఊజి సిద్ధో భవతి ఊజిత్వేపతి సుభ్రూ రితి స్యాత్" ఇట్లు వామనుఁడు సమర్థింపఁగా, దీక్షితులు "కథంతర్హి వాపితః క్వాఽసి హే సుభ్రు ఇతి భట్టిః ప్రమాదఏవాయమితిబహవః" అని లిఖించి యున్నాఁడు. ఇట 'బహవః' అను శబ్దస్వారస్యముంబట్టి చూచిన నితనిని గౌరవించినట్లే స్ఫురించెడిని. ఇది ప్రకృతమున కంత యవసరము కాదు. తెలినసార మిది, దీక్షితునికిఁగూడ మార్గప్రదర్శకుఁ డనఁదగు వామనభట్టుచే నసాధువు లని త్రోయఁబడిన అవతార, ప్రౌఢిమాదిశబ్దములు మహాకవి ప్రయోగారూఢములను హేతువున నెల్లరు నిరాఘాటముగ వాడుచుండ హరివంశాదుల యందలి యుపలబ్ధింబట్టి యష్టభాషావాగనుశాసనుఁడు ప్రాసస్థానమున వాడిన దుర్ణయ శబ్దమునందలి ణత్వ మిటీవల శేఖరకారకునిచే ఖండింపబడిన నయ్యది యతని బుద్ధివైశద్యమునకే స్ఫోరక మగునుగాని నన్నయ్య ప్రయోగమును ఖండింపనేరదు. అతఁడే యాంధ్రకవనమున కాచార్యుఁ డగుటచే నాంధ్రకవనము చెప్పు ప్రతివానికిని నయ్యది శిరసావహించఁ దగినదే యని వాక్రుచ్చుచున్నారము. "అది నన్నయ బుద్ధిపూర్వకముగా వాడినది కాదు. ఇటీవలి వారి వలనఁ గలిగిన ప్రమాదము" అని దిద్దినచో సమ్మతించి తీరుదుముగాని, ఆత్రోస బొత్తిగా నిలువదని ప్రమాణశబ్దవిచారముచేఁ బ్రాజ్ఞులకు బోధపడి యుండును కాన భట్టారక ప్రయోగము ణకారఘటితమే యనియు, అతని కీయశాస్త్రీయ వణప్రాస మభిమతము కాదనియు నయ్యానఘున కొకటఁ బ్రమాదము చెప్పఁ దగియున్నను నది దుర్ణయ శబ్దమునకు ణత్వము చేయుటలోఁ జెప్పుట యుక్తము కాని యయుక్తవణప్రాసమును సృజించుటలోఁ జెప్పఁ దగదనియు నొక్కి చెప్పుచున్నారము. ఎందులోఁ జెప్పిన నేమని యందురేని వినుఁడు. నన్నయ్య తెలుఁగు నిబంధనల కాచార్యుఁడు కావున నం దతఁ డపసిద్ధాంతమునకుఁ బోయె నని నొడివినచో నతనియందలి ప్రామాణ్య మమాన్య మెట్లు కాకుండును ? పాణినీయశాస్త్ర నిష్ణాతత్వమునకో, ఇతనిని మించినవారు పలువురు గలరు. అందుల కితఁడే పరమప్రమాణము కాఁడు. కనుక నందుల కంగీకరించుటలో వాక్షేపణలేదు. ఈతరతమ విశేషచర్చ "ఊకాలోజ్ఝ్రస్వదీర్ఘప్లుతః" అనుచో హ్రస్వదీర్ఘప్లుతం, ప్లుతాః, అను సందర్భమున శాస్త్రబాధ చెప్పుట యుక్తమా, లోకబాధ చెప్పుట యుక్తమా ? అని విచారించి చేసిన సిద్ధాంత మెఱిఁగినవారికి హృదయంగమము కాకపోదని సూచించి వదలితిమి.

ఉ. భారత మాంధ్రసత్కవులపాలిటివేదము, దానియందు వా
గ్ధోరణు లెట్టివేని నవి త్రోయఁగరానివి, తప్పులంచు సా
ధారణరీతిఁగాఁ గుకవితండము లాడు ప్రయోగజాల మా
భారతమందుఁ గన్పడెడిఁ, బండితు లయ్యవి స్వీకరింపరే!

(దేవీభాగవతము, ప్రథమస్కంధము)

మఱియుఁ గొన్ని పద్యములు భారతప్రాశస్త్యమునుగూర్చిన నాయీఘట్టమునం దందే చదువఁగోరెదము. ఆయీసందర్భములు మనమం దుంచుకొనియే

క. వ్యాకరణ మొక్కత్రోవ, మ
హాకవులొకత్రోవ, కోశ మఖిల మ్మొకత్రో
వై కన్పట్టెడి నీ భా
షాకావ్యమ్ములను దఱుచు చదివినకొలఁదిన్.

అని యాసందర్భమున మేము వ్రాసియుంటిమి. ఆయీవ్రాఁతయం దేమేని సార మున్నచో విజ్ఞులు కైకొందురుగాక. ఇంతకు మున్నిందుఁజూపిన ప్రతి భారతవిశేషమునకును నిట్లే విస్తరించి వ్రాయవలసియున్నను గ్రంథ విస్తరభీతిచేఁ గొంచెము వ్రాసియు నేమియు వ్రాయకయు గడపుచు వచ్చితిమి. పనిపడినచో విజ్ఞులిట్లేవ్యాఖ్యానము చేసికొనుటకుఁ బ్రార్థితులు.



# శృంగారరసము.

ఈశ్వరునికిఁగూడ దేనిలోఁతు తెలియరానిదని మనపూర్వులు నిశ్శంకముగాఁ జెప్ప సాహసించిరో, దేని రసమ్మున నిమగ్నులై బ్రహ్మానందాస్వాదమునుగూడ నంతగా మన్నింపక తృణీకరించుచుండిరో, దేని సాహాయ్యమునఁ దమ యశఃకాయము ననామయముగాఁ జేసికొని,

శ్లో. జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయమ్.

అను సూక్తి కుదాహరణములు గాఁగలిగిరో, అట్టి మహాకవుల సూక్తులయందుఁ గూడఁ గొందఱు జ్ఞానలవదుర్విదగ్ధులు వృథా దోషారోపణము చేసి తమ యజ్ఞాన విలసితత్వమును బ్రకటించుచు "అహో మూలచ్ఛేదీ తవ పాండిత్య ప్రకర్షః" అను ప్రాచీనోక్తికిఁ బ్రథమలక్ష్యకక్ష్యయందుఁ బ్రవిష్టులగుచున్నారని వినుట కెంతయుఁ జింతింపవలసియున్నది.

శ్లో. శక్తిర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్
కావ్యజ్ఞ శిక్షయాఽభ్యాస ఇతి హేతుస్తదుద్భవే.

శ్లో. న స శబ్దో న తద్వాచ్యం న సా విద్యా న సా కలా
జాయతే యన్న కావ్యాంగమహో భారో గురుః కవేః.

లాక్షణికు లుదాహరించిన పై శ్లోకములవలన నేమి, యింకను నాతిశాసనములవలన నేమి, కవి కాఁదగువానికి నానావిషయములయందుఁ బరిశ్రమ గల్గియుండుట యత్యావశ్యకమై యున్నది. తక్కిన విషయము లట్టులుంచి ప్రకృత ముపన్యసింపఁ బూనుకొన్నది శృంగారరసమును గూర్చినది కావున దాని తత్త్వవేత్తృత్వమున కుపకరించు వాత్స్యాయనశాస్త్రపాండిత్యము గూర్చ కూడ లాక్షణికులు శాసించి యుండిరనుసంశయమును నుపశమించుదు గాక.

శ్లో. వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా.

శ్లో. అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
శృంగారీచేత్కవిః కావ్యం జాతం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చేన్నీరసం సర్వమేవ తత్

ఇత్యాది లాక్షణికోక్తులవలన శబ్దార్థదోషమాపితము గాకుండ నిరంకుశముగాఁ గవివాణి ప్రసరింపవచ్చునని తెలుచున్నది. "నిరంకుశాః కవయః"

అనువారోక్తి నేఁడు పుట్టినది కాదు. ఇట్లుండఁగా నేఁటివారు పూర్వు లనాగరికులనియు, వారయుక్తముగా శృంగారమును వర్ణించిరనియు, నప్పుడు తగిన పరిశీలకులు లేమిం జేసి యవి యట్లె నిల్చిపోయినవనియు, నేఁడంతకన్న మిన్నలగు పరిశీలకు లుద్భవించిరి కావున వారు వానిని సంస్కరించి కొన్ని టికి మూలచ్ఛేదమును గొన్నిటికి నంగమాత్రచ్ఛేదమును విధించి ప్రపంచమునకు మహోపకార మొనరింపఁ బూనిరనియు వ్రాయఁగా నీవిషయములను బత్రికల యందుఁ జదివికొని ప్రాజ్ఞు లనుభవించు విచారమునకుఁ బారమే కానరా కున్నయది.

“దోషాఃఖలు సాకల్యేన పరిగణితాః” అని మహాభాష్యకారులు చెప్పి నట్లు పూర్వలాక్షణికుల విమర్శనా ముకురము నందుఁ బ్రతిఫలింపని దోషము గాని గుణముగాని నేఁటినాగరికుల హృదయాదర్శమునందు గోచరించునది లేశమును నుండదని చెప్పుటకు జంకవలసిలేదు. వారు సంభోగశృంగారవర్ణనము దూష్యమని యొక్కచోఁ గాకున్న మఱియొక్కచో నైన నొకరుగాకున్న మఱియొక్కరేని వ్రాసినట్లు మామాగురువులు మాకెవ్వరికిని నుపదేశించినది లేదు. ఎవరేని యెచ్చటనేని యీవిషయము త్యాజ్య మని వ్రాసిన దున్నచోఁ దెల్పి యీసంస్కరణమునకుఁ బూనినచో దీనిని శిరసావహించుట కభ్యంతర కము లేదు గాని, వట్టిపాడిమాటలచే మహాకవుల కావ్యములను దుమ్ముదూళి గావించయత్నించువారి వాక్యములను విశ్వసింపఁజాలము సరికదా, పైపెచ్చు మాకుఁ గల ప్రాచీనలాక్షణిక గ్రంథవిశ్వాసముచే నవ్వారియుక్తులను ఖండించి మాకృతజ్ఞతను బ్రకటించుకొని మాజన్మమునకు సార్థక్యమును గల్పించుకొను టకు సంసిద్ధులమై యున్నారము.

“అదోషౌ సగుణౌ సాలంకారౌ కావ్యమ్” అని కావ్యలక్షణమును జెప్పుచు మొట్టమొదటనే “అదోషౌ” అను విశేషమును సంఘటించిన వారి శాసనముకన్న నితరుల పొడిమాటలు మా కుపాదేయములు గావు.

శ్లో. “తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన,
స్యాద్వపు స్సుందరమపి శ్విత్రేణైకేన దుర్భగమ్.”

అని చెప్పిన మహాభాగులు సంభోగశృంగారమును వర్ణించుట దోష ముగాఁ బరిగణింపరైరి. అట్టిచో దాని నిటీవల నిన్న మొన్నటివా రేల గర్హిం

తువో మా కెఱుఁగరాకున్నయది. అది రహస్యవిషయ మనియు గోప్యావయవ
గోపనమెంత యావశ్యకమో యిదియును నంత యావశ్యకమనియుఁ జెప్ప వత్తు
రేమో! వాదసౌకర్యమునకు క్షణకాలము వీరియుక్తి నొప్పుకొందుముగాక.
ఈవిషయమును గూడఁ బూర్వులే కనిపెట్టియున్నారు. దీనిని బ్రత్యక్షముగాఁ
జూపరాదని నిషేధించిరి. వర్ణింపరాదని నిషేధించిన వారెవ్వరును గానరారు.
ఆనిషేధమును బ్రధానముగాఁ జేసికొని యీవాదమునకు దిగుట యుక్తముకాదు.
అది గాక యౌచిత్యముంబట్టి సంభోగశృంగారవర్ణనావిషయమునఁ గొందఱు
పూర్వలాక్షణికులు కొన్నిరహస్యములను దెల్పియున్నారు. అందొకటి నిటఁ
జూపుచున్నారము. పార్వతీపరమేశ్వరాది విషయమును పితృమాతృవిషయ
మును మఱియుఁ దత్తుల్యవిషయకమును నగు సంభోగశృంగార మంతగా
వర్ణ్యము కాదని కొందఱు ఔచిత్యవిదులు వ్రాసియున్నారు. ఆవ్రాసినవారే
కాళిదాసాదులు వర్ణించిరనికూడ నుద్ఘాటించి కొంత చర్చించి "తథాపి" అని
యేదో పరిహారోక్తిని జూపియున్నారు. అది యిట నంతగాఁ బ్రస్తుతముకాదు.
ప్రకృతమావిషయము నెత్తికొనుటకుఁ బూర్వులు సర్వజ్ఞు లనియు, వారికి మన
కన్న నెక్కుడుశంకలే తోఁచెడివనియు, నట్టివా రెరును నిషేధింపనివిషయమును
మనము తెలిసియుఁ దెలియని జ్ఞానముతో బయటికిఁ బెట్టి పండితుల యపహాస్య
ముల కాస్పదత్వమును వహించుటయే కాక దైవవశమ్మున మనకు లభించిన
యోగ్యతనుబట్టియో మఱియొకదానింబట్టియో వారిగ్రంథములను భస్మసాత్కా
రింపఁ బ్రయత్నించుటకన్న మహాపాపము వేఱుండఁ బోదనియు, నియ్యది
"వచనాత్ప్రవృత్తిః, వచనాన్నివృత్తిః" అను శాసనమును బట్టి చేసెడు ప్రయ
త్నము కాకుండుటచే నప్రాజ్ఞుఁడగు చికిత్సకుఁడు నిర్దుష్టాంగమును దుష్టాంగ
భ్రాంతిచే ఛేదించి యంగవైకల్యము నాపాదించి పిదపఁ బశ్చాత్తప్తుఁడైనట్లు
పరిణమించెడి ననియు నొక్కి వక్కాణించుచున్నారము. వెనుక నెవఁడో
ముగ్ధుఁడు తన భార్యకు యౌవనచిహ్నములు కానరాఁగా నయ్యవి పిటకము లని
భ్రాంతిపడి శస్త్రచికిత్సకునొద్దకుం గొనిపోయి యతనిని వేఁడికొనమొదలిడి
నేఁటివఱకును నవ్వఁబడుచున్నవాఁడని కింవదంతి కలదు. ప్రకృత నవనాగరికుల
పూనికకును దానికిని మాకు భేదము కన్పట్టుటలేదు. సంభోగశృంగారవర్ణ
నమే నిషిద్ధము కానియపుడు తత్పూర్వరంగప్రాయములగు కచాదివర్ణనములు
కూడవని యేలక్షణజ్ఞుఁడును జెప్పఁజాలఁడుగాన నావిషయమై యిందుఁజర్చింపఁ

జూనుట పిష్టపేషణ మని యుపేక్షింపఁబడిరి. చక్షుఃప్రీతి, తక్కినయవస్థల కెల్ల మూలభూతము. తత్ప్రీతిస్వరూపమును దెల్పుటయె కచాదివర్ణన మని యెంచుకొనును. ఆయావర్ణనము లౌచిత్యపోషకములుగను గ్రామ్యాశ్లీలాదిదోష దూరములుగను నుండవలసినదని లాక్షణికు లుద్ఘోషించుచున్నారు. నేఁటివఱకు ప్రపంచకమునఁ గవిమండలిచే నాదరింపఁబడు కావ్యము లెవ్వియు వారి లక్షణములకు దాఁటిలేవు. ఎక్కడనేని గ్రామ్యాదిదోషములు ప్రమాదవశమునఁ బడియున్నను అంతమాత్రమున నాగ్రంథము దగ్ధము కావలసిన దని పూర్వు లభిప్రాయపడి యుండలేదు. స్వల్పాపరాధమున కురిశిక్ష విధించు ప్రాజ్ఞులుండరుకదా!

శ్లో. కవిః కరోతి కావ్యాని లాలయ త్యుత్తమో జనః,
తరుః ప్రసూతే పుష్పాణి మరు ద్వహతి సౌరభమ్.

కావ్యనిర్మాణము కష్టము. అది గుణబహుళముగానున్నచో స్వల్పదోషము లున్నను వానిని బరిగణింపరాదని లాక్షణికులె వ్రాసియున్నారు. కాళిదాసంత మహాకవి 'సఖి విశ్వస్తాభవ' అని వ్రాసియున్నాఁడు. ఇయ్యెడ, అశ్లీలము స్ఫురించుచున్నది నన్నయ్య యంత మహాకవి "మఱుఁగ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్" అని వ్రాసెను. ఇయ్యెడ గ్రామ్యదోషము స్ఫురించుచున్నది. ఈ గ్రామ్యాశ్లీలాదులు లేని పాత్రమే నేఁటివఱకుఁ గన్పట్టదు. ముందును జనింపదు. ఈవిషయమై క్షేమేంద్రాదులు విశేషించి చర్చించియున్నారు. దానింగూర్చి ప్రకృతము చర్చించుట లాభకారి కాదు. నేఁటి నాగరికుల యాక్షేపణలు వీనిం బురస్కరించుకొని పుట్టినవి కావు.

వీరికి "మన పూర్వలాక్షణికులకు హూణభాషాపరిచయము లేదు కావున నాగరికత యననేమో తెలియదు; అందుచే వారు పోయినపోకడలు హేయములు" అను నిశ్చయజ్ఞాన మొకటి కల్గినది. అది యంతరంగమున నిముడక యిన్ని విధముల బయటికి వచ్చుచున్నది. ఏదో సంశయమును దెచ్చిపెట్టికొని శృంగారగ్రంథములను రూపుమాపవలెనని ప్రయత్నించుట యనుచితము. విగ్రహారాధనమునుగూర్చియు సంధ్యావందనాదికమునుగూర్చియు వివాహాదులలోని త్యాగములనుగూర్చియు నేఁటివారిచ్చు నుపన్యాసము లెంత శోచనీయములుగ నుండునో ప్రతి పండితుఁడును నెఱిఁగినదే కావున నిట విస్తరింపఁబనిలేదు. ఏకారణమునైన నేమి స్త్రీలకు ఘోషానుగల్పించి స్త్రీలను రక్షణీయ

లుగా నేర్పఱచి గృహయాజమాన్యమును వారలయెడల నునిచి పాతివ్రత్యమను మహాపదవియందు వారల నభిషేకింప నెంచిన మన పూర్వులు తత్తత్సతీవిషయక మగు సంభోగశృంగారవర్ణన మనుచితమే యయి లోకనాశనసూచక మగు నెడల నొకరు గాకున్న నొకరేని దూషింపకుందురా! ఇఁక నొకటి, ప్రతి కావ్యము నుఁ బల్లికిఁ గూఁతునకును జెలియలికిని వినిపింపఁదగునట్లు లుండవలెననిన శక్యమా! కావ్యము మాటట్లులుంచుఁడు. వేదమును జూడుఁడు.

"ఆరోహోరుమ్" అను మంత్రము కూఁతునకు వినిపించి యర్థమును జెప్పు తెల్వితక్కువవాఁ డుండునా? నవోఢయగు తన భార్యకు భగవద్గీతలలోని విశ్వరూపాధ్యాయమును బోధించెడి ఛాందసునకును పైవానికిని భేదమేమి? పురాణములను జూడుఁడు. ద్రౌపదిని గీచకుఁడో లేక సైంధవుఁడో బలాత్కరించు భాగములోని కొన్ని మాటలను దన తోఁబుట్టువునకో తల్లికో వినిపింపఁబూను ప్రాజ్ఞుఁ డుండునా? అప్పట్టున నెట్టి వేదాంతి వ్రాసినను నవయవవర్ణనలు లేకుండఁ గవనము చెప్పఁగలుగునా! ఆ యీభాగములు స్త్రీలును జదివికొన వచ్చును. అందలినీతిని గ్రహింపనువచ్చును.అక్కడినీతి స్త్రీలను బలాత్కరించు దుర్మార్గుఁడు చెడిపోవుననిమాత్రమే తేలునుగాని కచకుచాదివర్ణనలుకావ్యాంగములగుటచేఁ జేసితీరవలయును. లేనిచో రసముపోషింపఁ బడనేరదు. అదికడువిస్తరించి పోషించుట చేదస్త మనిపించుకొనునని మాత్రము చెప్పవచ్చు. అంతియకాని విస్తరించి వర్ణించిన కావ్యమును త్యాజ్యమనికాని పఠనీయముకాదనికాని భాషకు నష్టముకల్గించునని కాని దేశోపద్రవకరమని కాని యెవ్వరును బ్రాజ్ఞులు చెప్పసాహసింపరు. రసమనగాఁ దన్మయత్వము నందించునదియే.

"క॥ ఏరసము చెప్పఁబూనిన, నారస మాలించువారి నలరింపని యా
నీరసపుఁ గావ్యశవముల, దూరమునన పరిహరింపుదురు నీతిజ్ఞుల్"

విభావానుభావాదులచేఁ బూర్తిగాఁ బోషింపంబడని రసము స్వరవిన్యాసమూర్ఛనాదులచేఁ బోషింపఁబడని రాగమువలె వికలావస్థనందును. కావున నే శృంగారరసాలంబనభూతులగు నాయికా నాయకుల విషయమునఁ బూర్తిగా వర్తించుటయనఁగా, చతుఃప్రీతి మొదలు క్రియానిర్వృతివఱకును నభ్యనుజ్ఞ నిచ్చియున్నారు. అరసికు లీకర్మముఁ నెఱుఁగక గురుశుశ్రూషలేక నిర్భయముగానేమో యాక్షేపింపఁబూనుటయె కాక వృథాప్రయత్నము లొనర్చుట శోచనీయము. ప్రతిమనుజుని జన్మమునకును ముఖ్యకారణమగు శృంగార

రసము నెంత యభ్యర్హితముగాఁ బరిగణింతుమో, దాని నెంత పోషించికొన నెంతుమో, అప్పుడే మనకు సత్సంతానప్రాప్తి కల్గి యిహపర లోకములయందు సుఖము నిర్బాధ మగునని యెఱుఁగునది. ఇదిగాక ప్రతివిద్యార్థియును బంచకావ్యపఠనానంతరము కేవలశృంగారరసపూరితములగు భాణప్రహసనాదులు చదివి సాహితీజ్ఞానమును సంపాదించికొనుచున్నాఁడు. దానిని నేఁటివఱకేగురువును నిషేధించి నట్లులేదు. తత్పఠనమువలన నేవిద్యార్థియుఁ బాడైనట్లు వినము. ఎవఁడేని యొకఁడుండిన నది యన్యథా ఘటించిననుఘటింపవచ్చును.

"నహ్యేకం లక్ష్యం యోగారంభం ప్రయోజయతి" కావున నంత మాత్రమున నది శాస్త్రమునకుఁ బ్రయోజకత్వము నాపాదింపనేరదు. శృంగారకావ్యపఠనమునకుఁ బ్రసరించినట్లు నవనవయౌవనులగు విద్యార్థుల హృదయములు భగవద్గీతా పఠనమునకుఁ బ్రయత్నింపవు. కష్టించి మన మట్లు మరలించినను లాభములేదు. ఏవో విశేషించి గ్రంథములను జదివినంగాని సాహిత్యజ్ఞానము కుదురదు. చక్కని సాహిత్యజ్ఞానము గుదిరినవానికిఁ గావ్యరసాస్వాదన మన నెట్టిదియో తెలియుట గడుసుకరమె యగును. కావున భాణప్రహసనాదులవలనఁ దెలియఁదగు నీతి విటాది ప్రవర్తనము హేయభాజనమనియుఁ సత్ప్రవర్తన మావశ్యకమనియునే కాని యన్యముకాదని విస్పష్టపడును. దానిచే వాఁడు విటుఁడుకాక విటవృత్తమును దెలిసికొనినవాఁడు కూడ నగును. దానివలన మున్నుదాహరించిన "శ్లో॥ నసశబ్దో..."అను శ్లోకమునఁ గల కొన్ని విషయము లనాయాసముగాఁ దెలిసికొనినవాఁడు గూడ నగును. ఇప్పటి నవనాగరికుల సాహసమును వర్ణించుటకు నాకు లవమును నుపాయము దోఁపకున్నయది. వీరికిఁ గుచాదివర్ణనమే దూష్యమగు నెడల దశరూపకములును, తద్గ్రంథకర్తలును, తచ్ఛాస్త్రవిధాతలునుగూడ దూష్యులే కావలసివచ్చునుగదా! ఆయా గ్రంథములెల్ల దుర్నీతినే బోధించు నెడల నిందనునుగూడ నట్టి దుర్నీతిని సమ్మతింతురా! వారెల్లరును సమస్తశాస్త్రములను నభ్యసించి ధర్మాధర్మములెఱింగి వానిని వేదపురాణాదులచే బోధించుటకన్న కావ్యరూపమున బోధించుట సుకరమని యెంచికదా యిందుఁ బ్రవర్తించి యున్నారు. కావుననే సాహిత్యకౌముదిలో ప్రభుసమ్మితమగు వేదము కతనఁ బ్రభువులు దక్కనితరులు శాసింపఁబడుదురనియు మిత్రసమ్మితములగు పురాణాదులకతనఁగూడఁ బ్రభువులు నియమముగా శాసింపఁబడుట దృశ్యాదృశ్యమనియు శంకించుకొని

కాంతాసమ్మితమగు కావ్యము చక్రవర్తినిగూడఁ గడు సుకరముగ లోఁగఁజేసి కొని సత్కార్యప్రవర్తనమునందును నసత్కార్యనివర్తనమునందును బ్రవర్తింపఁజేయునని వాక్రుచ్చియున్నాఁడు.

'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అను నిషేధముకూడ సంభోగశృంగారాదివిషయములుంటచేఁ బఠింపఁగూడదని ప్రవర్తించియుండలేదు. సంభోగశృంగారమును నిషేధించినచోఁ దదంగభూతములగు చతుఃప్రీత్యాదివర్ణనలకు సార్థక్యమే యుండదు. ప్రధానదేవతలకుఁ బూజలేని పట్టున నంగదేవతలకుఁ బూజ నంగీకరించువా రుందురా! "అంగానాం ప్రధానఫలేనైవ ఫలవత్త్వాత్" కనుకఁ బూర్తిగా శృంగారము త్యాజ్యమని తేలును. తత్త్యాగము సిద్ధమగు నేని తన్మూలకములగు రసములన్నియుఁ ద్యాజ్యములు కావలసివచ్చును. ఏవో కొన్ని రసములు మిగిలినను నయ్యవి యిట్టి యానందమును గలిగింపనేరవు. కావుననే యీరసమునకుఁ బ్రాధాన్యము నొప్పి పూర్వప్రాజ్ఞులెల్లఁ దమతమ ప్రావీణ్యమును జూపియున్నారు. ఆయా విషయములకు లక్ష్యలక్షణములు గీర్వాణభాషయందే కల్గియున్నవి. అది అంతోయింతో చవిచూడక స్వతంత్రించువారికిఁ జెప్పఁదగు ప్రత్యుత్తరమే లేదు. ఏవిషయమునేని సంస్కరించువారు శాస్త్రవ్యతిరేకమును గనఁజేసి సంస్కరించుట యుక్తము. కుజాదిమతములను శంకరాదులట్లే ఖండించి నిజమగు వేదమతమును నిల్పియున్నారు. భ్రమప్రమాదిదోషసంయుతమును బక్షపాతాదిసంవృతమును నగు మనుజుని మనము సంస్కరణస్వాతంత్ర్యమును సహించుటకుఁ దగదు. కావుననే లక్షణగ్రంథములు పుట్టియున్నవి. అందుఁ బలుమతములు గలవు. వారి మతములలో నేనికి లోఁగని పాడుపుస్తకములేవేని యున్నచో నయ్యవి సంస్కార్యములో బహిష్కార్యములో కావలసివచ్చునుగాని లక్షణజ్ఞుల పోకడలకు సంబద్ధములైన గ్రంథములను వృథాశంకలవలన నాక్షేపించి మన నాగరికతకే కాక మన పూర్వులకెల్ల నపకీర్తి నార్జించుట మనకు యుక్తముగాదు. వెనుకటి లాక్షణికులు చూపినమార్గము ననుసరించి గ్రంథములు చెప్పిన మన పూర్వులను, మనము తద్గ్రంథములను జదువక యేదోయొక యాత్మసిద్ధాంతమును బురస్కరించుకొని త్యజించి క్రొత్తచట్టములను విధించితిమే యనుకొనుఁడు. నిర్వ్యాజముగ "బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః, షడంగో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ" అను తెఱంగు వ విద్యనభ్యసించి లోకోపకారమునకుఁ దమజీవితమును వెచ్చించిన వారి పోక

డకే నింద్యమగునెడల సవ్యాజముగ విద్యనభ్యసించు మనశాసనము మాత్రమెంత కాలము నిలువనేర్చునో, ప్రాజ్ఞులు విచారించుకొందురుగాక. శృంగారవర్ణన విషయమున ధర్మశాస్త్రాది ప్రతిబంధకమునుగూడ మహాకవులు పరిగణించి నట్లులేదు కాళిదాసు, శకుంతలాదుష్యంత సమాగమమును బగటికాలమందు జరిగినట్లు వర్ణించియున్నాఁడు. ఇది ధర్మశాస్త్రవిరుద్ధము. దీనివలన గ్రహింపఁదగిన నీతి కాముకునకు శాస్త్రోల్లంఘనముగూడఁ దృణప్రాయముగ నుండును కావున కాముకుఁడు కాకుండుటకై యత్నింపవలసినది, యను నంశమేకాని వేఱొకటిగాదని కావ్యరసజ్ఞులు నిర్ణయింతురు. ఈవిషయమున నియమమును పాటించుట ఛాందసత్వమని కొందఱు తెల్పియున్నారు.

"శ్లో. సామగాయనపూతం మే, నోచ్ఛిష్ట మధరం కురు

ఉత్కంఠితాసిచే ద్భద్రే వామం కర్ణం దశ ప్రియే

"కావున నెల్లరుకా గవులు...యీగతి నుండునటం చెఱుంగునే"

(మా నానారాజసందర్శనము చూడుఁడు)

ఇది యిటులుండుఁగాక, ప్రతిలాక్షణికుఁడును దనలక్షణగ్రంథమునందు "శ్లో. నిశ్శేష చ్యుతచందనమ్........." అను శ్లోకమునెత్తికొని చర్చించి యున్నాఁడు. కచకుచాదివర్ణనమే పనికిరానివారి కాయాగ్రంథములేల పనికి వచ్చును. నాయకాదిభేదములను నిర్వచనముచేసి లక్ష్యములను జూపిన రస మంజర్యాదు లేల పనికివచ్చును? తుదకుఁ గావ్యధోరణి ధర్మశాస్త్రరీతిని జెప్పవలసినదని తేలును. దానిచేఁ గాంతాసమ్మితత్వము మూలఁబట్టును. దానితోఁ జమత్కారకారిత్వమడుగంటును. దానితోఁ గావ్యమనఁగా "తుమ్మచెట్టువిూఁదఁ గాకికూర్చున్నది, తుపాకి తేరా కొడదాము" అను నదియే కావలసివచ్చును. అంతదుస్థితి యింకను మన సంస్కృతాంధ్రములకుఁ బట్టదనితలంచెదను. ఏమందురా, మనదేశమునందేకాక జర్మనీలోనగు దేశ ములయందుఁగూడ మన మాతృభాషావిషయక పాండిత్యముకలవారు పెక్కు లుండియున్నారు. వార లీవిషయము నన్యభాషాధ్యేతలపాలుచేసి మిన్నకుందు రని తలఁపను. ఇయ్యది నిన్న మొన్న తలచూపి వృద్ధి నందుచున్న యాంధ్ర భాషపైఁ బడుటచేఁగాని సంస్కృతభాషపై వచ్చినచో నీసభకొందఱు మహా

పండితులు కాశ్యాదులనుండివచ్చి యెట్టి యుపన్యాసముల నిచ్చియుండురో తెలియవచ్చెడిని. ఆంధ్రము సర్వమును సంస్కృతలక్షణమును బురస్కరించుకొని వర్తించుచున్నది. ఆగ్రంథములను జదివికొని మనపూర్వు లాంధ్రమునఁ గవిత్వమును రచించిరేకాని అరబ్బీభాషనుగాని, వేఱొకభాషనుగాని, యధ్యయనమొనర్చి రచించినవారుకారు. కావుననే సంస్కృతసాహిత్యవేత్తలకు మనయాంధ్రగ్రంథములయందు నేఁటి నవనాగరికసోదరు లాపాదించుదోషములు కనుపట్టవు. ఇప్పటికే విస్తరింపఁబడినదిగాన మన పూర్వుల పరిశీలనాజ్ఞానము నొక్కింత వక్కాణించి విరమించుచున్నాఁడను.

"శ్లో॥ చకాశే వనసపాండ్రయోః పురీ షంశమహాద్రుమైః"

ఇందశ్లీలాదుల నాపాదించి చర్చించియున్నారు. ఇట్టివారు సంభోగశృంగారవర్ణనము నింద్యమే యగునెడల సహింతురా! గ్రామ్యాదిదోషములుకూడ నౌచిత్యముంబట్టి క్వాచిత్కముగా సమ్మతించియున్నారు.

"శ్లో॥ ఉత్తానోచ్ఛూనమండూకపాటితోదరసన్నిభే
క్లేదిని స్త్రీవ్రణే భ్రాంతి రకృమేః కస్య జాయతే"

ఇది జుగుప్సాకరమైనను శాంత్యుక్తియందు దోషముకాదని కావ్యానుశాసనాదులలో వ్రాసియున్నారు. కొన్నివిదూషకోక్తులలో దుష్టములుకావని విడదీసియున్నారు. ఆయావిషయముల నెత్తికొన్నచో నిప్పుడు తుదముట్టదు. మీవంటిప్రాజ్ఞు లెఱుఁగనివిషయము నావంటి కించిజ్జ్ఞునకు సులభసాధ్యముకాదు. "అనుక్తమన్యతో గ్రాహ్యమ్"

తేలినసారమిది. నేఁటి నవనాగరికుల శంకలు పిచ్చిశంకలు. కొందఱు లేనిపోని యేవమును గల్పించుకొని తక్రాదిపానమును మానుకొనుచున్నవారు కలరు. అట్లే వీరును నని యెఱుఁగునది. వీరిని మనము సంస్కృతవిద్యాభ్యాసమునకుఁ బురికొల్పవలసియున్నది. వారే తదనంతరమున దీని మంచిచెడ్డలు గుఱితింపఁగలుగుదురు. "గోకులాష్టమికి తురకసాహేబు నడుగుటయుక్తముకాదు."

మఱియుఁ గావ్యనాటకాది పఠనము నిర్భరమును నిరతిశయమును నిర్ద్వంద్వ్యమును నగు బ్రహ్మానందము ననుభవించుటకే పుట్టినదికాని కేవల చరిత్రమాత్ర విజ్ఞానమునకుఁ గలుగలేదు. తత్తద్వర్ణనలు మానుకొన్నచో నది కావ్యమే కానేరదు. వలసినచో గుహ్యాద్యవయవములనుగూడ వర్ణించుటకుఁ గావ్యచిత్కముగ సమ్మతించియేయున్నారు. కాని నైఘంటికపదములచే వర్ణించినచో నశ్లీలాదులతోఁ జేర్చియున్నారు. మోహనాలయాది పదములచేవాడుట తప్పుగాదని రఘువంశాదు లుద్ఘోషించుచున్నవి. వ్యంగ్యమునకు లక్షణము చెప్పుచు, ‘‘కామినీకుచకలశవ చ్చమత్కారకారిత్వమ్’’ అని లక్షణవేత్తలు నిర్వచించిరనుచో సహృదయులకు సర్వమును విస్పష్టమే యగునుగాన విస్తరింపక యింతతో ముగించుచున్నారము



# పాశుపత పీఠిక

చదువరులారా !

మా వెంకటరామకృష్ణకవులు "శతఘ్ని" యను నొక విమర్శనమును మా పాండవాశ్వమేధముపైఁ బ్రచురించుటయు, దానిపై మేము "పాశుపతమున" సద్దాని వారించుటయుఁ గృష్ణాపత్రికాముఖమునఁ జదివియేయుందురు. వెం॥ రా॥ శ్రీ విమర్శనమందుఁ మిక్కిలి చిన్నతనపుఁ బ్రసంగములను జేసియున్నారు. అందుఁ గొన్నిటిని గీరతమున మూఁడవపుటలోఁ జూపియున్నారము. మా "పాశుపతమును" గూర్చి గీరతమున నొకపర్వమే వ్రాయఁబడియున్నది కాని అందు శాస్త్రవిషయము గన్పట్టదు. ఇందది చాలవఱకుఁ జర్చింపఁబడినది. దీని ప్రకటనమునకు మమ్ముఁ బ్రోత్సాహించినవారిలోఁ మొదటివారగు బ్ర॥ శ్రీ॥ జయంతి రామయ్యపంతులువారికి మాకృతజ్ఞతను దెల్పుటకై వారి యాశయము నీక్రింద నుదాహరించుచున్నారము.

"......మీరు ప్రకటించుచున్న "పాశుపతము" చదివి మిక్కిలి యానందించుచున్నాను. పాకము రుచ్యముగా నున్నది, ప్రమాణములు సముచితములు. విమర్శనాఖండన మనఁగా నిట్లుకదా యుండవలెను. పూర్వపక్షసిద్ధాంతము లొక్క పుస్తకరూపముగా బ్రకటించినయెడల లక్షణగ్రంథముగా నుపయోగించును......

జ. రామయ్య.

అనేకులిట్లు వ్రాసియున్నారు. కొన్నిమాత్ర ముదాహరించుచున్నారము.

"......మీ 'పాశుపతము'ను జూచుచున్నాను. మహాప్రవాహము పొంగిపొరలి పిచ్చుకుంటులమీదికి ప్రవహించుచుండగా నాధాటి నాపగలవాఁ డెవ్వఁడు? మాబోటి పండితాశీఃపాత్రుల కీసంవడిలో విద్యాదానము కానిందు, కుటికరబంధనము కావించనే కావించిరి......" ఇట్లు విధేయుఁడు,

N. CHELAPATI ROW.

"...మీపాశుపతమును ఖండించుటకు పశుపతికిఁ గూడ శక్తి చాలదని గురుజాడ అప్పారావు..." పురాణం సూర్యనారాయణతీర్థులు (విజయనగరం)

“...గురజాడఅప్పారావు. అనేక నమస్కారములు ... రామకృష్ణకవులకు తమకు జరిగిన వివాదతో సంబంధించిన పేపర్లు అన్ని జాగ్రత్త చేసి వుంచితిని ............ఇదివఱకు నేను తమరిని గురించి వెల్లడిపరచిన అభిప్రాయములు నేను మనస్సా నమ్మినవిగాని అతిశయోక్తులు కావు. మీప్రతిభ ప్రాచీనకవుల ప్రతిభ వంటిది. తమపద్యముల సాపుమోపులు ఆధునికులలోఁ గానము. యుద్ధములో తాము అర్జునులే,...” సే' గు అప్పారావు.

‘రామకృష్ణకవుల ‘శతఘ్ని’కి మీపాశుపతప్రయోగమయి విశ్రమస్థానము చిక్కినది...’ సే, చెన్నాప్రగ్గడ భానుమూర్తి.

ఇట్టి వనేకములు .వెం॥ రా॥ లకు ఏదితప్పో! ఏదియొప్పో! తెలిసికొనుట తెల్విదేటలంతంత మాత్రమైనను, వారు కొందఱు పెద్దల ననుసరించి వారి సాహాయ్యమున మానాటకమును విమర్శించి నట్లీ పద్యమువలనఁ దెలిసికొననగు.

ఉ. అంకమొకింత కల్గని మహాత్ముఁడు వ్యాసమనీషియు న్నిరా
తంకుఁడు మల్లసూరియును దాతలు సేమముఁ జూచుచుండఁగా
వెంకట సూర్యరాయపృథివీరమణుం డనుకూలుఁ డేలఁగా
వెంకట రామకృష్ణ కవివీరుల గారవుబిడ్డ కైత క
ఢంకులు పల్కుపోటుకులు డాఁగక లోఁగకయుండు టెట్లగు౯ ॥(కవిత)

ఈ శాస్త్రిద్వయమునే కాక యింక నొకరి సాహాయ్యమును మాశిష్యులు తీసికొని యున్నారు గాని ఆ చర్ల నారాయణశాస్త్రిలవారికిఁ దగుమాత్రము సంస్కృతజ్ఞాన మున్నను దెల్గులోఁ బ్రవేశము పూజ్యము. ఆసంస్కృతమునం జేనిఁ బరిశీలకతాజ్ఞానమున్నట్లు తోఁచదు. బ్ర॥ శ్రీ॥ మల్లయ్య శాస్త్రిలవారిని వెం॥ రా॥ లు పేర్కొనుటచే నిందు వారుండిరని మేము తలంచుచుంటిమే కాని శ్రీశాస్త్రులవారితోఁ జెన్నపురిలో నిటీవల మేముకలిసికొనిమాటలాడినప్పుడు వారికి దీనితో సంబంధమేలేదని నొడివిరి. కాన వీరు సర్వథా యిందు చేరనుకోవలయును. మిగిలిన యిరువురలో నారాయణశాస్త్రిల వారున్నను లేక యున్నను నొకటేకదా! ఇఁక మిగిలినవారు ఆర్ట్సుకాలేజీ సీనియర్ పండితులగు బ్ర॥ శ్రీ॥ అకుండి వ్యాసమూర్తి శాస్త్రిలవారు, మా నాటకము 1911 వ సం॥ బి. యే. పరీక్షకుఁ బఠనీయ మగుటచే వీరుదీనిని బాఠము చెప్పవలసి వచ్చినది. అత్తఱిని

వారిబుద్ధికిఁ దప్పులుగాఁ దోఁచు వానినెల్ల నూట్లు విద్యార్థులకుఁ జెప్పుచు వచ్చిరఁట! బందరు నుండి చనిన కొందఱు విద్యార్థులు మావలన వినిన రహస్యములను గూర్చి వారి నడుగుచు వచ్చిన నట్టిచోఁ గొన్ని స్థలముల శాస్త్రిఁవారు "శేషం కోపేన పూరయేత్" కావించుచువచ్చిరఁట! ఇది ప్రత్యక్షములో నెఱిఁగిన కొందఱు బి. యే. విద్యార్థుల వలన విన్నయంశము. ఇది యిటులుండుఁగాక, చాలవఱకు వెం|| రా|| ల శతఘ్నిలోని సంశయము లీ శాస్త్రులవారి వనుకొనక తప్పదు. ఇంక వెం|| రా|| లు చేసిన పరిశ్రమమో, శబ్దరత్నాకరమును దగ్గఱఁ బెట్టుకొని అర్ధానుస్వార శకటరేఫ వ్యత్యాసములును అక్షర వ్యత్యాసములును గష్టపడి గుదిగూర్చుటయు లేనిపోని నీచపు ప్రల్లదములను వెళ్ళఁగ్రక్కుటయుఁ దప్ప వేఱొకటి కనుపట్టదు. శ్రీవ్యాసమూర్తి శాస్త్రిల వారి కెంతటి యనుభవము గలదో మాపాశుపతమే తెల్పును గాన నిందది పేర్కొనుట యనవసరము. పీఠికలో "అచ్చుతప్పులను ఆయా యంకముల చిగురున వివరించితిమి కాని మఱికొన్ని స్వల్పములు లేక పోలేదు" అని వెనుకటి ముద్రణమున వ్రాసియుంటిమి. ఆ స్వల్పముల నెత్తి చూపిన మా వెం|| రా|| లు మా కృతజ్ఞత కర్హులు కాకపోరు.

తుదకుఁ దేలిన సారమేమనఁగా, మేము ప్రత్యుత్తర మొసఁగఁ దగు శంకలన్నియును శ్రీ వ్యాసమూర్తి శాస్త్రిలవారివియు మాప్రూఫుకీడరు ప్రత్యుత్తర మీఁదగుశంకలు వెం|| రా|| లవియు నని తేలినది. ఇది యిటులుండుఁగాక, ఎవరి కవిత్వమునేని విమర్శించునప్పు డప్పటికి వారు రచించిన గ్రంథములన్నియుఁ బరికించి విమర్శించుట యుక్తము వీరట్లు చేయలేదు సరికదా, తుదకీ యశ్వమేధమునేని జక్కఁగాఁ బరిశీలింపలేదు. ఇందుల కొక యుదాహరణము, వెనుకటి ముద్రణమున నొకచో "విఘాత్మకత్వముల్" అనియున్నది. దానింజూచి వెం|| రా|| లు మాకాశబ్ద వ్యుత్పత్తిని దెల్పుచుఁ దెగవెక్కిరించిరి. ఆశబ్దము తరువాత పుటలలో సరిగాఁ బ్రయోగింపఁబడియున్నది. అది వీరు చూడనేలేదు; రెండుమూఁడుచోటుల లెక్కయేమి, పెక్కుచోట్ల శుద్ధముగానుండియొకటిరెండుచోటులఁ బొరపడినదియే వీరు వెక్కిరించిరి. ఇట్టి ప్రమాదములు వీరికిందుఁ గుప్పతెప్పలు. అవి యక్కడక్కడఁ దెల్పియేయుంటిమి గాన నిందు విస్తరింపఁ బనిలేదు. ఈ వెం|| రా|| ల పూని

కను బలువురు నిరసించి మమ్మభినందించి యున్నారు. అందుఁ గొన్నిమాత్ర
ముదాహరించుచున్నారము.

"అయ్యా, భవద్విరచితమగు పాండవాశ్వమేధ నాటకమును రామకృ
ష్ణులు విమర్శనచేసిరి; కృష్ణాపత్రికలో ప్రచురింపబడినది. తమ రింతవరకును
ఖండన వ్రాయకపోవుటకు కారణం బగోచర మయ్యెడి. పూర్తి విమర్శనమైన
వెనుక వ్రాయవలచిరని యెంచితిమి....తలను వంచునట్లు ఖండనము ప్రచురించె
దరని తలచెదను. తప్పు లెన్నుటకు ఇపుడు మేలుకాంచినందులకు పరమసంతో
షమాచున్నయది. ఇన్ని దినములనుండి యెయ్యెడ నుండిరో తెలియదు....."

కో॥ వెం॥ కృష్ణారావు,
KUMAR ZAMINDAR OF GAMPALAGUDEM

"వెంకటరామకృష్ణకవులు రచియించిన శతఘ్నియందు తమ పాండవాశ్వ
మేధము సలక్షణమైన గ్రంథముకాదని తెలుపుచున్నారు. కూపకూర్మములవలె
లోనం దాగి వెయ్యి ప్రగల్భములు పలుకవచ్చునుగాని తమవలె సకలనృపాల
సభాస్థలములయం దమిత యశమ్మును బొంది రసవంతములగు సద్గ్రంథము లనేక
ములు రచియించి పండితాహ్లాదం బొనర్చుట యరుదు. తమ గీరతము చదివిన
కొలది తృప్తి నొందకున్నది. కొరివి వెంకటరత్నం, Chicacole.

"సీ. తిరుపతి వేంకటేశ్వరుల గ్రంథములలోఁ గలవు తప్పులటన్న ఘనమటంచు
వారిమూలమ్మునఁ బేరు వెల్వడునంచు శాస్త్రశిక్ష యొకింత సాఁగునంచు
పాండవవిజయాది బహుకృతిరత్నముల్ చదివిన వాక్శుద్ధి పొదలునంచు
అలశనిగ్రహమున కబ్బిన చీవాటు లతిరుచ్యములు దినసగు నటంచు

తే. గీ. పెద్దపేరుల గ్రంథముల్ విక్రయించి
కాసురూకలతోఁ బొట్టపోసికొనఁగ
దలఁచి రీ రామకృష్ణు లుదారమతులు
తోడివారలు నవ్వఁగా వాఁడు నేఁడు.

ఇట్లు విన్నవించు,
దూపాటి తిరుమల వెంకట రమణాచార్యులు,
గుంటూరు.

"......... తిరుపతి వేంకటేశ్వరులకుఁ దగిన సాధనసంపత్తి కలదు. వారి యొద్ద శతఘ్నులకును బగులని గట్టిరాళ్లగని యున్నది. ఆగనియందుఁ గోరిన రాళ్లును రత్నములును సకృత్స్నముగ దొరకును"(1912సం॥ అక్టోబరు 1వ తేది సుదర్శనీ పత్రికనుండి.)

"శ్రీరామకృష్ణకవులు శతఘ్ని నొకదానిని (ఫిరంగిని) బారుచేసి భజేలు మనిపించిరి. అది వమ్మై పోవునట్లు తిరుపతి వేంకటేశ్వరులు పాశుపతాస్త్ర ప్రయోగముం గావించి శతఘ్నిని ఢమ్మునఁ బగులఁ గొట్టిరి" (అవధాన దర్పణము 8 పేజీ.)

(ఒకశిష్యుఁడు వ్రాసిన యుత్తరమునుండి)

"......పాశుపతము చూచు నప్పటికి నిజమయిన మీ స్వరూపము అర్జునునకు కృష్ణునిరూపువోలెఁ గాన్పించినది. చెంపపెట్లు కొట్టిన ట్లుదాహరణములు దొరికినవి. ...... క॥ టంకులయి గర్వపడు టక, టొంకు బుధుల బీరమెల్ల డొంకించెడు నిశ్శంకప్రభావుఁ దిరుపతి వెంకటపతిఁ జేతు లెత్తి వినుతి యొనర్తున్ ॥౧॥ క॥ కొంకిరి బింకిరి వంకర, టింకర నడవళ్ల నిక్కు టెక్కులు పెక్కుల్, కంకెడు పెంకెల మతులి, జ్జింకుల నింకించు వేంకటేశు భజింతున్ ॥౨॥ ఉ॥ వేంకట రామకృష్ణకవి వీరులు మీఱి దురాగ్రహార్తులై, కంకిన దుర్వ్యసనప్రగ్రంథమునం గల యెల్ల తప్పులన్, వంకలు తీర్చి నేర్పుటకె వంచు యతించు? గురుండొ శిష్యుఁడో, వెంకటశాస్త్రి పండితకవిప్రవరుం డొకరుండు తక్కినన్ ॥౩॥ ఉ॥ అంక మొకింత కల్గని మహాత్ముఁడొకం డటమీఁది నా నరా, టంకుఁడు, సెందఱో మఱియు డంకలు వెన్కను లేవనెత్తఁగా వెంకట రామకృష్ణ కవివీరులు బీరము మీఱి యీగతిన్, జంకలు దట్టుచుండిరని చాటు జగమ్మది యెంతసత్యమో ॥౪॥ ఉ॥ ఒండొక కోపవేగమున నొప్పులుఁ దప్పులెఱుంగ లేకనై, తండికపృత్తి నొత్తిలి శతఘ్నియటం చొకదుష్ప్రయత్నపుం, గండరువున్ గురుంగుఱిచి కైకొన నయ్యది యంతలంతలై, పిండిలివంటులై తుతకుఁ బ్రేలెగదే! తమకై మహోద్ధతుల్ ॥౫॥ క॥ టాటోటులతోఁ దాటా, తూటమ్ములతోడ లేనిదోసము లెన్నౌ, చాటించి గెల్పుగొన నిటు టాటాలాడుదురె వెంకటకవీంద్రుకడన్ ॥౬॥ క. అరసున్నలు నెఱసున్నలు, అరలున్ ముద్రణమునన్ దఱచు దబ్బిబ్బై దొరలినవితప్పుఁ దప్పని, నిరూపణము

జేసి మీరు నిల్చినదేదీ! ॥౭॥ ఉ॥ దొంగరికంపుఁ బన్నుగడతోఁ దమయారను వంటయుంటి యాఁ, డంగులచైదముల్ సలిపి డాబుగ "వెంకటశాస్త్రిగారికిన్, శృంగముభంగమయ్యె" నని చిందులు ద్రొక్కుచు దారితప్పియు, బ్బొంగెదరేల! చాలునిఁక బోరగిలంబడ కూరకుండుఁడీ ॥౮॥ మ॥ గురుధిక్కారము సేసి రెన్నియొ దురుక్తుల్ పల్కిరబ్బబ్బ! యో, గురువర్యా! యెటువచ్చె నోటి కటు లెగ్గుల్ వచ్చెనే యండొగిన్, బరి మార్చన్ వలెఁ గాక సైఁపఁదగునే! ప్రాదుర్భవద్గర్వము, వక్రత, న్నిషక్రియమకుషక్రదుష్కృత విమర్శగ్రంథసంధానముల్" "సీ॥ కొప్పరపుకవీంద్రకుంజరహర్యక్ష! రామకృష్ణకవీంద్రరాక్షసహరి, కృష్ణకవిమన్యకీర్తి చంద్రాతప! ఘనశివరామాఖ్య కవిశరణ్య, తిర్పతిజలరుడహా కృతి సుకవిందర్శి కువలయశుభ్రాంశు! కుకవిలోక, యాత్రాగ్రతారక! యను పమామలషష్టిపరిమితకావ్యసంపద్విలాస॥ తే॥ గీ॥ పాశుపతజిత పరదూషణాశయావ, శీవికాసితశుభకీర్తి! భావితాంధ్ర, సంస్కృతచతుర్విధ కవిత్వశతవధానచణ! గురూత్తమ! వేంకటశాస్త్రివర్య ॥౧॥ కుకవిజనమస్తకోపరి, ప్రకటిత సవ్యాంఘ్రిపద్మ! పండితకవిరా, జ్ఞికరనుత శతవధానప్రకరా! వేంకటకవిగురువర్య! నమస్తే ॥౨॥ క॥ మంగళగిరికులజాతుఁడ, రంగని భక్తుండ బావరక్తుండను స, న్మంగళ! ద్వైపాయనుఁడ శు, భాంగా! దయతోడ జాబు నంపఁగవలయున్ 3 ......"

"......పూర్వము పండితరాయలు రసగంగాధరమను గ్రంథమ్మున నుడివిన కీతిని అనగా "శ్లో॥ నిర్మాయ...కస్తూరి కాజననశక్తి భృతా మృగేణ" అను వాక్యానుసారంబుగా ననేక దుష్కర గ్రంథంబులు కల్పించి మించిన— ఉ॥ వేంకటవత్కవి! తమకవిత్వమునందు వృథా యసూయచే, వెంకటరామకృష్ణులు ప్రవీణత యంచొకకొన్ని తప్పులన్, బొంకముగా లిఖించి యిటఁ బుచ్చిరి పేరు 'శతఘ్ని, యంచు, మీ కింకవిరాజమత్తగజ కేసరినామము కుత్తెలుంగమిన్. అద్దానిపై నెద్దియేనియు విమర్శనంబు సలుపుఁడని యిదివఱకే పత్రిక నంపియుంటిని." గాడిపల్లి వీరరాఘవయ్య (భారతుల నృసింహశాస్త్రి జామంతేవాసి) (ఇట్టివనేకములు)

శబ్దబ్రహ్మమును దెలిసికొనుట సామాన్యము గాదు. యావజ్జన్మమును బని చేసినను శబ్దవిషయము దురవగాహముగనే యుండును. అయీవిషయములు దేవీ

భాగవత పాణిగృహీతాది గ్రంథపీఠికలలో దిఙ్మాత్ర ముదాహరించి యుంటిమి.
"శ్లో॥ వశబ్ద బ్రహ్మోత్థం పరిమళమనాఘ్రాయచజనః, కవీనాం గంభీరే వచసి గుణ దోషౌ రచయతు." (మురారి)

ఇట్లు ప్రాజ్ఞులెల్లరను మొఱపెట్టుచున్నను అర్భకులకుఁ గల యవివేకములు తొలఁగనే తొలఁగవు చూడుఁడు, ఎంతయవివేకమును లేకయున్న నిట్లు వ్రాయుదురా! 'వేయేల మేము చూపిన దోషములలో నొక్కటియైనఁ ద్రిప్పశక్యము కాదు' (శతఘ్ని 31వ పుట) ఇట్టి ప్రల్లదము లనేకములు. వానికేమి, 'చిన్ని చిన్ని వ్యాకరణపుఁబొత్తముల్ చదివి కయ్యము పెంచకుఁడయ్య వాగ్మిదుల్' అను మా 'పాణీగృహీత'లోని మాటను జదివికొనికూడ గోతిలోఁ బడువారి నెవ రుద్ధరింపఁగలరు! లక్షణము సమగ్రముగా నిప్పటివఱకును బయలుదేరని హేతువున నీ యాంధ్రభాషకు లక్ష్యజ్ఞానమే విశేషించి యుండవలెను. ఈయంశము చిన్నయ్యసూరియు నొప్పికొన్నదియే "తుదకు లక్ష్యపరిజ్ఞానము చాలని లక్షణపరిజ్ఞానమంత శ్లాఘ్యముకాదు, కాని తుదముట్టసర్వలక్షణపరిజ్ఞానముచేతనే సాధించుట మిక్కిలి దుష్కరము" (బాలవ్యా-పీఠిక) దుష్కరమైనను మాకు మొదలనుండియు లక్ష్యజ్ఞానమునందే యెక్కువ యభినివేశము.

క॥ పదరత్నంబచే మూర్ఖుల, రొదలడఁగుట విందు మని విరోధిహృదయదు
ర్మదము మొదలంటఁ ద్రెదులఁగ, గుదులుగుదులుగాఁగ వానిగుప్పెద మెందున్.

ఉ॥ వెంకటరామ కృష్ణుల వివేక విహీనపు వెక్కిరింపు, ల
య్యంక మొకింతకల్గని మహాత్ములు తంపులతెంపులున్, నిరా
తంకుల పెంపులున్ 'చరలతజ్ఞుఁడు' నారపగారి మంపులున్
బొంకమడక్కి పాసపతముం గని డొంకలఁబట్టి డేఁకుతన్,

చ॥ మునుపు పతివ్రతన్ ద్రుపదపుత్రిని జెల్లెలివావిమానినిన్
జెనఁకిన వానికై నరునిచే నొక పాశుపతంబు గ్రన్నఁగై
కొనఁబడె, నేఁడు నట్లె గురుఁ గొంటెతనమ్మున దూఱులాడు దు
స్స్వనులకునై కొనంబడెఁ బ్రశస్తము పాశుపతాఖ్య మస్త్రమున్.

క. సుప్రథితుల కేమి యనా, ధర్మేతల దుర్విదగ్ధతల్ మాన్పుటకే
యీప్రయతన మిది వారిపు, డప్రియముగ నభినయించి యఱతురో! యేమో!

ఉ. భారతనాటకమ్ము పయిఁ బడ్డదియంట ! శతఘ్ని ! సత్కవుల్
వారక యెవ్వరేనియు నుపానహపుంగల స్వస్తిఁ జెప్పఁ ద
త్సారము తేలుఁ గాని, యటు సల్పెడి వారరుదౌటఁ జేసి యీ
గోరున దీరనట్టిపని గొడ్డటఁ దీర్చితి మోవిచక్షణుల్ !

వీరి కీదుర్విదగ్ధతయుఁ బ్రల్లదములును గలుగుట చేతనే కదా ! మేమింత పరిశ్రమ జేయవలసివచ్చినది. ఇది మాశిష్యులకేకాక గేహళీదత్తదీపన్యాయమున నితరులకుఁ గూడ నుపకరించెడిని. ఇట్లు గాకున్న మఱియొక తెఱఁగున నేని మాశిష్యుల యజ్ఞానమును మేము వారించుకొనక తప్పదు. ఆ వారించుట కును దీనికిని నంతభేదము లేకపోలేదు. ఇందులోనే వారికి సౌలభ్యమెక్కుడు గన్పట్టెడిని. 'మూడు జన్మముల శత్రులరై వచ్చెదరా ? ఏడుజన్మముల మిత్రులరై వచ్చెదరా ?' యన శత్రులమయియే వచ్చెద మని రనుట యెవ్వరెఱుంగనిది ! అదిగాక, యింత శ్రద్ధ మఱియొక శిష్యులవిషయమున మాకుఁ గలుగను గలుగదేమో. ఎట్లేనియు గురుశిష్యభావ మనునది పోగొట్టికొందమన్నను పోనిది; కావుననే

క. మును శిష్యుఁడనై చదివితి. వనయము ద్వేష్యుఁడనగుచు నభ్యాసం బీ
తనికడ నిప్పుడు చేయుదు, చను మన కీపొత్తు జన్మజన్మమ్ములకున్.

అని మున్ను పాశుపత పత్రికటనమున వ్రాసియుంటిమి. మా పరిశ్రమము మా శిష్యులకన్నను సహృదయు లెక్కుడు పరిశీలింపఁదగినవారు. ఈ యంశో మును మునుపే ప్రకటించుకొని యుంటిమి.

క. తెలిసీ తెలియని పలుకులు పలుకుచు గడు గేలిగొట్టు పరమాప్తుల మి
మ్ముల నేమియన్న శేముషిఁ గలరుగదా! పండితులు జగమ్మున నెందుః.

కావుననే కాళిదాసంతమహాకవి "ఆపరితోషా ద్విదుషాం నసాధుమన్యే ప్రయోగవిజ్ఞానం" అని వ్రాసికొనిరి. మాశిష్యుల కీవిషయమున నిదివఱకే పలును విఱిగిన దను నంశము వారి పరాస్తపాశుపతములోని యీక్రింది పంక్తులనఁ దెలిసికొందురు గాక.

"ఆచా॥ ... వెంకటశాస్త్రిగారు పాశుపతములో నెన్ని భారతప్రయోగముల నుదాహరించిరో కనుఁగొంటివా ? కవి॥... ఆప్రయోగములు భారత

మంతయుఁ బారజదివి వ్రాసిన వనుకొన్నారా! అవియన్నియుఁ బ్రౌఢవ్యాకర
ణములోఁ బ్రదర్శింపఁ బడినవే (26 వ జనవరి 1912 సం॥ కృష్ణాపత్రిక.)

ఈ వెలితి ప్రసంగమును మాత్రము వ్రాసి శాస్త్రవిషయములను ఖండించు
టకుఁ బూనక విరమించుటవలన నేమి, అనివార్యమగు పాశుపతమునకు "పరా
స్త్రపాశుపత" మను తెల్వితక్కువ పేరితో వ్రాఁతకు దిగుటచేత నేమి, సరుకు
పూర్తిగాఁ బయలఁబడినదని మేము వ్రాయక పూర్వమే లోకము గుఱుతించి
యుండును. మఱియు దీనివలన నేకాక యిటీవల మాపాశుపతమును కృష్ణలోఁ
జదివియు "కొయ్యతోఁటకూర" సామెతగా వచ్చువేయు శతఘ్నిలోని "తెలి
విడి" అను శీర్షికక్రింది పంక్తులుకూడ నీయంశమునే స్ఫుటపఱచుచున్నవి.
"వెరసి నూఱు దుష్టములు మాత్రము తప్పక పరికింతురు గాక" అని నూఱంకె
లను వేసి వ్రాసియున్నారు. ఈ 'తెలివిడి' వ్రాయునప్పటికి వారిందొక్క
టియు నిల్వదను నంశమును మాపాశుపతమువలన నెఱిఁగియు, అచ్చుపొరపాటు
లేని నిల్వకపోవునా! వానిచేత నేని నూఱుదోషములను జూపితిమని సంతసింప
వచ్చునని యనుకొనియుందురు. కాని వీరి విమర్శనమునకుఁ బూర్వ మచ్చయిన
మా యితర గ్రంథములలో వ్యాఖ్యానములుకూడ సవరింపఁబడియుంటచే వీరి
కా ముద్దుముచ్చటలును దీరవు "సున్నకు సున్న హళ్ళికి హళ్ళి" ఈ యంశ
మును మేము మొట్టమొదటనే అనఁగా వీరి శతఘ్ని కొంచెము కృష్ణలో వెలువ
డినవెంటనే తెల్పియున్నారము. అది యిప్పుడ నుదాహరించెదముగాక.

నన్ను బందరు హైస్కూలు తెలుఁగు టీచరుగా మాత్రమేని యెఱింగి
నాకు "తిరుపతయ్య" యను సహాధ్యాయి కలఁడని కలలోనేని యెఱుఁగని
మావారు మా దుస్థితికి (లక్షణవిరుద్ధకవనమునకు) చిరకాలమునుండి వగచుచు
సౌమ్య సం॥ లో శ్రీ పిఠాపురపుఁగోటలో శ్రీవారవధాన మొనర్చునప్పుడు
గూడ నెట్లో తీరిక చేసికొని కొంచెమునే పీవిచారమునే పద్యముఖమున వెలిపుచ్చి
(68 పుట 30 వ పద్యము వేం॥ కృ॥ గ్రంథమాల) పిదప ననేక ప్రయత్నములు
ప్రత్యక్షముగను అన్యాపదేశముఖముగను బ్రయోగించి,యెన్నఁటికిని మాదుస్థితి
తొలఁగమిట్టుకుండుటకు జాలిపడి నేఁటికి ఈకృతఘ్నిని, కాదుకాదు శతఘ్నిని-
(ఫిరంగిని) ప్రయోగించి యున్నారు. ఈఫిరంగిని శ్రీవారు కీలక సం॥ ఫాల్గున
ములోనే తయారుచేయించి మెల్లమెల్లఁగా నందు మందు లోనగునవి (మీస

ములు నుద్ఘాటించి చెప్పిన పద్యము, మొదలైనవి నానారాజసందర్శనముకూడఁ జూడుఁడు) నించి దట్టించి "ఈశ్వరవేరు" నాఁబడు జానకిత్రాటితో నంటింప నుంకించి పొరపాటున నాత్రాడు ఫిరంగిచెవికి నంటింపక తిరుపతయ్యగారి చెవికి సోకించిరి. అతఁడు రిజష్టరుమూలముగ నొక విజ్ఞాపనము నంపికొని మాజోలికి రావలదని వీరైనంత మృదుమధురగరిమను బతిమాలుకొనుటయో మందలించుటయో కావించెను. పదపడి శ్రీవారి ఫిరంగి విధి విరామము లేక చాలఁ జాలఁగా రగిలి రగిలి తుదకు నేఁటికిఁ బెద్దధ్వని చేసినది. లోకములోని ఫిరంగివంటిది కాక యియ్యది మాబాగును గోరుచున్నదనుట విస్పష్టము. మిక్కిలి విలువగల్గుటయేకాక నిత్యమును బరోపకారకార్యములయందే వినియోగించు శ్రీవారికాలమును నంత మాకై వమ్మొనర్చుచున్న మా యుభయశాస్త్రపరీక్షులు మా అత్యద్భుతశతావధానులు మా శతవిధానులు మా ప్రాథమికులు మాకు నమ్ముల్లు కారనుట కెవ్వరికి నోరాడును! మా సత్యభాషాహరిశ్చంద్రులు మా యందుఁ గన జేసిన నిర్నిమిత్త కారుణ్యము నెఱుకపఱచుకొంటిమి గాన నిఁక మా వారు చూపిన తప్పులను దిద్దికొనఁబోవుచుఁ బ్రాజ్ఞలోకము దీని కంగీకరింతురో లేదో యని సంశయించి ముఖ్యముగా శ్రీ కాకరపర్తి విద్వద్బృందమును సమ్మతిప్రదానముకై యభ్యర్థించుచున్నాఁడను. అయ్యా! మనవారు చూపిన దోసఁగులలో రేఫశకటరేఫాద్యపభ్రంశములును అత్వేత్వాదివినిమయములును మే మెప్పుడేని దిద్దికొనితీరవలసినవే యని నేఁటికిఁ జిరకాలముక్రింద నచ్చయిన మా యితరగ్రంథములలో నాపని కావించుకొని స్వస్థచిత్తులమై యున్నట్లు మా చదువరు లెఱిఁగియేయుంటచే నందులకు మనవారి తోడుపాటు వమ్మైనదని యనుకొనకమానరు. మేము దిద్దికొనిన విధానము కడుఁగూఢముగా నుండుటచే వారిశ్రమ పడవలసివచ్చినందుల కెంతయుఁ జింతించుచు నిఁక నేని వృథాగా మాకై శ్రమపడకుండుటకై శ్రీవారి ఘనతను మిక్కిలి కొనియాడుచున్నాఁడను. కొన్ని మీబోఁటి విద్వాంసులుకూడ నడుగఁదగినవియు నుత్తరింపఁదగినవియు లేకపోలేదు. వేయేల, తుద కిందుఁగాని యితరత్రగాని నేఁటికి వీరు మాగ్రంథములలోఁ జూపిన దోసం గొకటిగాని యరకాని పాతిక కాని తుదకుఁ బరమాణువు గాని నిలువదని నాకు ధైర్యము కలదు. ఇఁక ముందుఁ జూపువానింగుఱించి యిప్పుడు మనవి చేసికొని నేరమును మన్నింప వేఁడికొనుచు నిందులకు వీరు నాలో నేకీభవింతురో మనవారి

యభిప్రాయమం దేకీభవింతురో తెలుపఁ బ్రార్థించుచున్నాఁడను. ఇఁక లోకులతోఁ గొండొక మనవిచేసికొని విరమించుచున్నాఁడను. కాన నాకనుజ్ఞ యొసంగుదురుగాక. అయ్యా, లోకులు! మిమ్మెల్లర విడిచి కాకరపర్తివిద్వన్మండలినే ప్రార్థించితి నని యన్యథాగాఁ దలఁపక తామకూడ నిం దేదోసమేని నిల్చునని తోఁచినచోఁ దెలుపఁ బ్రార్థితులు. వారు మీవలె విద్వాంసు లగుటయే కాక మాశ్రీవారికిని నాకును ముఖ్యబంధువులు; శ్రీవారికి గురుపరంపరలో వారుకూడఁ గొంతయుండుటయే కాక శ్రీవారిలో నొకరి కాగ్రామము నివాసముకూడ నైయున్నది. మీబోధకన్న మాయుభయులకు వారిబోధ యత్యావశ్యకమని తాము దలంచితీరుదు రని నా నమ్మకము. (అప్రస్తుతప్రశంసలో చూడుఁడు) వారుగాని మీరుగాని యేకారణమున మిన్నకుండినను మా అశ్వమేధము నిర్దుష్టమే కాఁబోలు నని మేముబ్బి తబ్బిబ్బగుట తటస్థించునుగాన దొసఁగున్నచో నుదాసీనులు కాకుండుటకై మీరు సారెసారెకుఁ బ్రార్థింపఁబడుచున్నారు. వ్యాకరణవిషయమునఁగాని నాటక సంప్రదాయములయెడలఁగాని పరస్పరవిరుద్ధములయెడలఁగాని యశ్లీలాదిదోషములయెడలఁగాని అది యిది యన నేల, యెందునఁగాని మావారు చూపిన విషయములలో మీకు నచ్చిన దేది యున్నను నిస్సంశయముగాఁ దాము చూపుటయే తడవుగాని మాసమాధానమున కాలస్యముండదు. వారి వెక్కిరింపులు మాకు సత్కారింపులకన్న నెన్నిరెట్లో సంతోషదాయకములు. వానికి మేముత్తరింపఁగల సమర్థత గలవారముకాము. కాన నావిషయ మొకటి త్యజించి తక్కిన దేది యడిగినను నుత్తరమునకు సంసిద్ధులమై యున్నారము. చ॥ "బ్రదుకదు బట్టకట్ట దిట బంధుసముద్రములు చూపినట్టి త। ప్పిదమొకండె" యంటివిది వీథీస్థికగాఁ దలపోతురే మొ నా। మదికిటు దోఁచె వ్రాసితిని, మందియొ చెడ్డయొ, ప్రాజ్ఞులిందు కొప్పెదరొ తిరస్కరించెదరొ, క్షేమ నన్నుర్వినెసంగ వేఁడితిన్॥ క॥ అది యిది యన నేటికి, మీ। కెది తప్పని తోఁచెనొకటి దేనరయేనిన్, మది డాఁపక తెల్పుఁ డదే। పదివేలని యెంచి వ్రాయఁ బ్రారంభింతున్॥ క॥ "మే మడుగ నేల? యడిగిన। ధీమంతులు రామకృష్ణధీరులుగల" రం। చేమియు నోడుచుకుఁ డెందుకో। నామది కిటు దోఁచెఁ గరుణ నన్ఁ గనుఁడు బుధుల్॥

ఇట్లు, శ్రీవేంకటరామకృష్ణకవివర్యుల శతఘ్నికెదురు నిలిచియున్న మీ విధేయుఁడు, బందరు హైస్కూలు తెలుఁగుటీచరు. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

(ఏప్రియల్ 14 వ తేది 1911 సం॥ కృష్ణ)

11

వీరికున్న తెల్వితేట లెంతటివో కనుఁగొనుట కొకచిన్న యుదాహరణ మిచ్చుచున్నారము. అప్రస్తుతప్రశంసలో వీరు "ఆర్యులారా! ఇది యప్రస్తుతప్రశంసయేనా!" అని యొకచో వ్రాసికొని అది తప్పని సంశయించి శుద్ధపత్రికలో "ప్రశంసయేయా" అని దిద్దికొనిరి దీనిచే వీరి తెల్వితేటలు తెలిసికొనవచ్చును. దిద్దినప్రయోగ మెంత యసహ్యముగా నున్నదో సహృదయు లెఱుంగుదురు ఈదిద్దుబాటు శ్రీవ్యాసమూర్తిశాస్త్రులవారు తెల్పినమీఁద జరిగినదనుకొన్నను దప్పులేదు. ఇంతకు మొదటిది తప్పగునా కాదా, అనునది విచార్యము. ప్రశంస + ఏ + ఆ, అని యుండఁగా మధ్య నకార మెట్లు వచ్చు నని సామాన్యులు శంకింతురు. విశేషజ్ఞులు భాషాస్వభావముచే మధ్య "ను" అను సముచ్చయము చేరుననియుఁ గావుననే ఇందుమతీపరిణయములో ౧ఆ॥ మునఁ గుమారధూర్జటి, "ఉ॥...నాల్గుకోటులే, నా! మఱియుఁ ఘనంబుగ ధనం బొనఁగూర్చెద" అని యతిస్థానమునఁ బ్రయోగించియున్నాఁ డనియు నుత్తరము చెప్పుదురు. ఇట్లు వాక్యాలంకారముగా 'ను' చేరుచోట్లు కొన్నిగలవు. ఈయంశ మిందే కొంత తెల్పియుంటిమి. చెవి కింపు గలిగి యేమాత్రమేని సమర్థింప వలనైనదానిని వదలఁగూడదనియుఁ, జెవి కింపు లేక శాస్త్రసిద్ధమైనను దానిని వాడుట అంత హృదయంగమము గాదనియుఁ బూర్వకవుల యాశయము. 'యద్యపి శుద్ధం లోకవిరుద్ధం నాకలనీయం నాచరణీయం' ఇది ధర్మశాస్త్రవిషయమైనను బ్రకృతవిషయమునఁగూడ ననుకరింపఁ దగిన దని మా యాశయము. ఈయంశము మాకబ్బములలోఁ బలుచోట్లఁ దెల్లమగును. పైఁ జూపినయంశము, వెం॥ రా॥ లకుఁ గల జ్ఞానమును దెల్పుటకే కాని వారిని దప్పుపట్టవలయు నను తలఁపు గాదు మే మిందు ముఖ్యమైన యంశములకే కాక సామాన్యపు సంగతులకుఁగూడ నుత్తరము లిచ్చియున్నారము. అర్థానుస్వారశకటరేఫాదు లచ్చటచ్చట వ్యత్యస్తము లగుట మాపొరపాటే అనుకొను ధీరులుందురు; ఉన్నచో వెం॥ రా॥ లుమాత్రమే యుందురు. వారి కుత్తర మతి సులభము. వారిందు శకటరేఫములనుగూర్చి చూపిన దొసఁగులు వారి పుస్తకములయందే కనుపట్టుట కేమి హేతువు? వారికిఁ దెలియ దనుకొందమా, అయినచో నితరుల కెట్లు బోధింపఁగలరు! కావున వారి కింతమాత్రము తెలియు నని యొప్పి తీరవలయును; అప్పు డది ప్రూఫురీడరు తప్పని తేలును. ఆయీతప్పు

లకు వెం॥ రా॥ గ్రంథమాల చూడుఁడు. వీరిలెక్కయేమి, శ్రీ వ్యాసమూర్తి శాస్త్రులవారి మురారిలో మథించు, వేదురులు, ఆడుది, తత్తరపడు, తాఁటక, నెరవెఱ్ఱు, చిరునగవు, నోచు, పోలుసుమ్మి, లోనగు నపభ్రంశము లనక్కరదా వృత్తిగా నున్నవి.

మఱియు నర్ధానుస్వారములను గూర్చియు శకటరేఫములను గూర్చియు నెప్పుడేని నిఘంటువుమాత్రమే శరణమగుటచే నెంతశ్రద్ధగా బరిశీలించినను వ్యత్యాసములు రావచ్చును. అవి ప్రాజ్ఞులు తప్పులలోఁ జేర్చికొనరు. ‘రాముఁడు’ అని వ్రాయుటకు ‘రాముడు’ అని పొరపాటున వ్రాసినచో దానిని దప్పుగా వ్రాసిన బుద్ధిమంతులకు వందనములు; మాకృతజ్ఞు లెంతో కష్టపడి ‘శతఘ్ని’ యని వ్రాసి మాకింత పనికల్పించియును, నిక్కముగాఁ దప్పున్నచోటును గనుఁగొన నేరేము. వీరేకాదు, బ్ర॥ శ్రీ॥ కల్లూరి వెంకటరామశాస్త్రులవారుకూడ దీనిని గుఱితింపనేలేదు. శ్రీశాస్త్రులవారు బి. యే. విద్యార్థులకుఁ బశ్నలనిచ్చుచుఁ గొన్నిచోట్లఁ బొరఁబడియున్నారు. వారడుగునది ప్రశ్నకాన సమయము వచ్చుచో మాకది తప్పుగాదని తెలియుననియు శిష్యబుద్ధివైశద్యమునకై యట్లు ప్రశ్నించితి మనియుఁ దప్పించుకొందురని తలఁచెదము. ఆశిష్యబుద్ధి వైశద్యమునకేని నిజమగు తప్పుగల చోటును వారు గుఱితించినఁ గొంతయు క్షేమముకదా! అది. “వీరార్చిత...” అను గీతపద్యములోఁ గలదు. ఈముద్రణమున దిద్దితిమి కాని మునుపు “వీర ! చిత్రాంగద విచిత్రవీర్యులకు వివాహమొనరించితివి” అని యున్నది. భీష్ముఁడు వారిరువురకును వివాహము సేయలేదు గాన నది తప్పు' దానిని గనిపెట్టి శిష్యులకు బోధించుట యుపాధ్యాయత్వమునకు వన్నె గలిగించును. తప్పులుగానివి తప్పులని బోధించినఁ బ్రయోజనమేమి ? ఇంతకును శాస్త్రులవారు తప్పించుకొనుత్రోవ చూచికొనియున్నారు. గాన వారిచ్చిన ప్రశ్నలలోని యసంగతత్వ మిట విస్తరింపఁబడదయ్యె. మఱియుఁ నర్ధానుస్వారములనుగూర్చి కూడఁ గొన్ని చిక్కులున్నవి. ‘ఏగు’ ధాతువులో నర్ధానుస్వారమును నిన్నమొన్నటినుండి వేయ మొదలిడిరి. అంతకు మున్నెవరును వేయలేదు. అంతకు మున్నున్న ప్రతులలోఁ గానవచ్చుచున్నది. శబ్దరత్నాకరములో నిర్బిందుకముగనే యున్నది. కేవలము దీనినే పట్టుటయుం

జగవుకాదు. దీనిం బట్టిన మాకృతజ్ఞులగతి యీపాశుపతమే తెల్పును గదా! 'కోర్కె' అను ఎకారఘటిత రూపము శబ్దరత్నాకరములో లేదు. "తే॥గీ॥ గీము లలరించుకొనిరి కోర్కెలు చెలంగ" నీలాసుందరీపరిణయము 3 ఆ, (అని) యతిస్థానమునఁ బ్రయోగము గన్పట్టుచున్నది. ఇది మహాసముద్రము. దీనిని గవిమాతుర్లు తరింపజాలరు; ఋషులుగూడఁ దరించుట దుర్ఘటమని "యద్ఘోత్రం మునీనాం పాణ్ణిమాణ్యం" అనునది చెప్పుచున్నది. కావున నేదియును దొందరపడి తప్పనక పెద్దలను గనుఁగొని మరలఁ గనుఁగొని మరలం గనుఁగొనుచుండవలయును. ఆపెద్దలలో లక్షణజ్ఞులు గొందఱు, ఉభయజ్ఞులు గొందఱు, తప్పులున్నను వానిపై బుద్ధిపోనివారు కొందఱు; వానిమీద మాత్రమే బుద్ధి ప్రసరించువారు కొందఱు, ఇట్లనేకవిధములుగా నుందురు. అట్టిచో నీమహావిషయమున నిన్న మొన్న తలయెత్తుచున్న మాకృతజ్ఞుల పరిశ్రమ వమ్మగుట యొక యక్కజముకాదు. వమ్మేలకావలెను, సార్థకమ్మె యగుఁగాక. ఈపాశుపతమువలన లోకమునకేమాత్రమేని యుపకారమున్నచో దానివలని సుకృతము మాకృతజ్ఞులే కైకొని ఆయురారోగ్యైశ్వర్యములు గల్గి చిన్నతనమువలని యజ్ఞతను విడిచి బాగుపడుదురుగాక! ఓం శాంతిః,



# పాశుపతము

చదువరులారా! "పాండవాశ్వమేధము" పై మాకృతజ్ఞులు మిడిమిడి జ్ఞానముతోఁ బ్రయోగించిన శతఘ్నిలోని తుక్కుడూగజుల నవలకుఁ ద్రోసి విజ్ఞులుగూడ సంశయించు నంశములకుత్తరముగాఁ బ్రయోగించిన మా పాశుపత మెందు సంగ్రహముగా నుదాహరింపఁ బడుచున్నది.

## —:నాందీపద్య విచారము:—

నాందిలో వీరు బొత్తిగా నిరాధారముగా నిక్కృష్టముగాఁ దూలనాడిరి. ముందు నాటకములో వచ్చెడి కథ, నాందిలో నిముడ్చుట గుణమే కాని దోషముకాదు. "మనాక్కావ్యార్థసూచనం" అనుచోఁ గొంచెమే కావలెనను విధికి బోధకపదములేదు; కొంచెమేని చాలునని తాత్పర్యము. ఇందులకుఁ బూర్వమందున్న 'అర్థత శ్శబ్దతో వాఽపి' అనునది గమకమగుచున్నది. 'అధికంతు ప్రవిష్టం నతద్ధానిః.' ఏసూచనమేని స్ఫుటముగా నున్నంతనే కవి యసమర్థుఁ డనుకొనునెడల 'ఏషరాజేవ దుష్యంత స్సారంగే ణాతిరంహసా' అను శాకుంతలములోని సూచనముంబట్టి కాళిదా ససమర్థుఁడు కావలసివచ్చును; మఱియు నెందఱో కవులును నసమర్థులు కావలసివచ్చును; కావున నట్లనుట యున్మత్తప్రలాప మనకతప్పదు. సూచనయొక్క స్ఫుటత్వాస్ఫుటత్వములు కవియొక్క యిచ్ఛ ననుసరించి యుండును. "శ్లో. దినకరకిరణోత్కరః... మధుకరకర్షణ విదగ్ధః" అని యనర్ఘరాఘవకర్త కాళిదాసుకన్న గూఢముగా సూచించియున్నాఁడు. ఇంతమాత్రమున నితఁ డతనికన్న మిన్నయయ్యెనా!

శ్లో. శంభోః కోదండ భంగా దవిదితవిభవ శ్చక్రసూనోర్వినాశా
దజ్ఞాత స్సేతుబంధాదపి నపరిచితః కైకసీనందనేన
సంవాదా దంగదస్యా ప్యనధిగతగతిః కారణా న్మర్త్యమూర్తే
ర్మాయయా దుర్భ్రాత్యే జనానాం జగతి రఘుపతే ర్వైష్ణవః కోఽపిభావః.
(మహానాటకము) విస్తర మాయాయీ ప్రౌఢకవుల నాటకములం జూడదగు.

మఱియు, నాందీపద్యమునందే "ఉత్తరాదారకు సేమమారసి" అనుచోఁ,

‘ఉత్తరాదారకు’ అనుశబ్ద ముత్తర మగనిని బుత్రునిగూడఁ జెప్పుచుంటచే నశ్లీలము. అనునొక ‘తల్లికి మగఁడు’ శంకను దెచ్చిపెట్టిరి. ‘ఉత్తరా దారా యస్య సః అను విగ్రహమునందుఁ గాని పరీక్షిత్తుత్తరకు మగఁడు కాఁడు. ఉత్తరాయాః దారకః, అనుషష్ఠీతత్పురుషము చెప్పునప్పుడు పరీక్షిత్తుత్తరకుఁ గొమరుఁడేయగును; ఈ రెండు సమాసములలో నేది శీఘ్రోపస్థితకమో విజ్ఞులెఱుఁగనిది కాదు; కావున నీవృథాప్రలాపమునకుఁ గూడ నుత్తర మనావశ్యకము. ఇందులకు ‘యశోదాదారకం భజే’ లోనగు ప్రయోగము లనేకములు మఱియు నీస్థలమందే. “ఉత్తర కృష్ణుని భార్య” అని యొక యపార్థము ఝడితి స్ఫురించుచున్న దని నోరు జాఱవిడిచిరి. వీరనుకొన్న కృష్ణుఁడు భారతకృష్ణుఁడో! వేఱొక కృష్ణుఁడో! భారతకృష్ణుఁడే యయినచో నతని కుత్తర యను భార్య యున్నట్లు ప్రతీతి లేదే! లేనిచో స్ఫురణ మెట్లు? ఇట్టిఁడే యొకఁడు “పాండుమహిషి” అని భారతములోఁ జూచి ‘పాండురాజుగారి బఱ్ఱె’ అని యర్థము చెప్పి ‘ఏమట్లు చెప్పెద’ వనిన ఝడితి స్ఫూర్తి యట్లయినదనియు నిదిగూడ యుక్తమే యనియుఁ బాండురాజు గారి కొక గేదయే లేదా యనియు వాదింప మొదలిడినాఁడఁట! ఈయాబ్రవీత్పురాణ పక్తుల ప్రలాపముల కుత్తరము వ్రాయుట లజ్జాకరముగదా! పాండురాజుగారి కొక గేదె యుండినను నక్కడ నాయర్థము సమంజసమా, కాదా యను తెల్వి యుండవలదా? ప్రకృతమో, అట్లుకూడఁ గాదు; కృష్ణుని కుత్తర యను భార్యయే లేదు, లేనిచో స్ఫూర్తి యెక్కడనుండి కలిగెడిని. శ్లో॥ దయితోఽపే యశోదాయా దాయాదోఽయం దయామయే, అను నీభాగవత చంపూ ప్రబంధశ్లోకమునకుఁ గూడ వీరి తెల్వితక్కువను వినియోగించిచూతము. యశోదాయాః, మే దయితః (మగఁడు) అని యూరక శుష్కార్థమును జెప్ప మొదలిడువాఁడు గూడ నుండునా? పూర్వోత్తర సందర్భ మక్కఱలేదా? ఇట్టి యన్వయ మొనర్చి పండితుఁడు వైద్యుఁడై యంతఃపురస్త్రీలకుఁ బశువుల కేర్పడిన రక్షావిధిని జెప్పెనని వింటిము. ఇది యిటు లుండఁగాక; ఇట్లే నాల్గవచరణములో “భృశమ్ము యశమ్మనిశమ్ము శమిమ్మిడుఙ్” అనుపది యెత్తికొని, ఈమాటలు తూనికరాళ్లవలె నున్నవనియు, విశేషార్థము లేదనియు, దీనివలనఁ బద్యము క్షేత్రికులు వేసిన తోఁటకూరచెట్టు వలె నున్నదనియు వావిడిచిరి. చిత్తగించితిరా సహృదయులు, ఇట్టిపట్టుల వీరి నేమన్న ఋణముతీఱును! విశేషార్థము

లేదఁట! భృశమ్మ అత్యంతము, యశమ్మ కీర్తి, శమ్మ సుఖము, ఇదుణ్ణి
ఇచ్చును. పైఁగా నింకొక శంక, ముందు ముందెక్కడను జూపని యీ నై
చిత్రి యిందేల చూపవలయునో. అఁట! ఇదికూడ నొకపరిష్వ్యాంశమగు
నా కో! కృత్యాదిపద్యములోనున్న విశేషములన్నియు గ్రంధమెల్లెడ నుండ
వలయును గాఁబోలు! ఓకవిత్వమా! నీకెట్టిపరిశీలకులు దొరకుచున్నారు! శాం
తం పాపం.

—• సూత్రధార మారిష సంభాషణనుగూర్చి •—

నాందిలోఁ గలయర్థములవలననే నాఁడు ప్రదర్శింపఁబడు నాటకము
"ఫలానా" అని తెలియుచుండఁగా. "ఈనాఁడు మనము ప్రదర్శింపఁ బడు
నాటక మెయ్యది" అని ప్రశ్నించు సూత్రధారుఁ డొక బుద్ధిమంతుండా!
అని కృతజ్ఞులు శంకింపఁ దొడఁగిరి. కాని వీరికి, అప్రశ్నకుఁ బూర్వమందున్న
"ఓహో! ఈప్రశంసలోఁ బ్రకృతము మఱచితినే" అను వాక్యము గోచర
మయినట్లు లేదు. అప్రశంస గురుద్రోహియగు మారిషుని దిలవాచునట్లు
దివాట్లు పెట్టుటయు దానిపై నతఁడేదో సమర్పింపఁ జూచుటయు దానిపైఁ
మూర్తిగాఁ గోపమువచ్చి 'ఛీ! ఛీ!' యనికూడ నవలించుటయుఁ గదా?
ఎంతకోపమో రానిచో 'ఛీ! ఛీ!' యనుట తటస్థించునా? తటస్థించదు; అట్టి
కోపములోఁ దానంతకు మున్నెఱిఁగిన దానిని మఱచుట తప్పా? కాదు; కావున
పూర్వపక్షులు పూర్వోత్తర సందర్భ మెఱుఁగక వదరిరొచ్చి రనుట ఒప్ప
స్థము మఱియు, మారిషుఁడు 'పాండవాశ్వమేధ' మని జ్ఞప్తికిఁ దెచ్చినపిమ్మట
"చక్కఁగాఁ బోల్చితివి" అను మాటచే సూత్రధారుఁడు సంతసించెనని
యభిప్రాయపడి కొంద ఱవవసరపుఁ జర్చ చర్చించిరి. అవియును వెల్వితక్కు
వనే తెల్పుచున్నవి. సూత్రధారుని సంతసము నిజమైనది కాదు. అది యొక
యక్కఱమునకే యని యెఱుఁగఁ దగు. అది యొకయక్కఱమువ కను నంశము
"చక్కఁగాఁ బోల్చితివి" అను మాటకుఁ బిమ్మట గల యక్కఱముతే స్పష్ట
పడుచును. తుట్టతుదకుఁ దేలినసార మిది; ఇందు సూత్రధారుఁ డెఱుఁగని
దేదియునులేదు, మారిషుఁ డొనర్చిన గురుద్రోహరూపమగు మహాపాతకమునకుఁ
గొంకి కొండొక మందలించియు నంతం దనివిసనక మఱియుఁ గొండొక మం
దలింపఁ దలంచి ఆమందలింపును బ్రకృతముగా మార్పఁ దలఁచి యీమాటను

బ్రశ్నించెను, దానిపైఁ దా నెఱిఁగిన యర్థమును మారిషుఁడు తెల్పెను. దానిపై సంతసించి నట్లభినయించి 'ఈ గ్రహింపువలననే' అనువాక్యముచేఁ గొంత మండలించెను. ఇట్లు తెలిసికొన వలసి యుండఁగా సూత్రధారుఁడు బుద్ధిహీనుండని వ్రాయుట యెట్టిదియో విజ్ఞులే చర్చింతురుగాక, ఇట్టి చొప్పు దంటు శంకలకుఁ గూడ నుత్తరించుటచే నింతగ్రంథము పెరిఁగినది. ఇంతటితో ముగించుచుఁ గొన్ని యపూర్వప్రయోగము లీక్రింద నుదాహరించు చున్నారము. ఇందుఁ గొన్ని ప్రకృతమున కుపయోగించును, మఱికొన్ని ప్రయోగ విశేషబోధ కొఱకు మాత్రమే యుపయోగించెడిని.

(భారతారణ్య పర్వమునుండి.)

(1) క॥ మాయయ్య యొవ్వ (రె) క్కుడఁబోయిరి సెప్పుమని, (2) ఉగ్రాహివగుమని (యు) శాపమొగిన యిచ్చె, (4) లోకంబులు విలయంబున నెట్టిక్రం (రి) యగు, (5) సమయము (తోడఁ) గురియు వర్షములు, (6) కానను (బ్రోవను) బ్రభుండు, (7) నిన్నెఱుంగఁజాల (నయ్యెద), (8) అశ్వమేధమునకు (నర్చితం) బైన యీ యశ్వరా (జు) నిట్టు లపహరించి, (9) సగరసుతు లందఱు (భస్మం) బైన, (10) బాలకులయు నధిక శ్రీదర్పితులయుం లుబ్ధులయు లఘుజనంబును (దోడ) మంత్రంబు సేయనలదు. (మఱియు నిట్టి వెన్నియో విశేషములు గలవు)

ప్రవేశనిష్క్రమణలనుగూర్చి :— అంకమధ్యమందు రంగము శూన్యము కాఁగూడదని నాటకలక్షణజ్ఞులు వ్రాసి యున్నారు. దానిం బట్టి ప్రకృత మట్టిది లేటస్థించినదని మాశిష్యులు శంకించిరి. కాని వీరి కీరహస్యము తెలియదు. నిష్క్రమించు పాత్రలచేఁ బాత్రాంతరప్రవేశము సూచితమై వెంటనే పాత్రాంతరము ప్రవేశించుచోఁ దప్పు లే దని మహాకవియగు శూద్రకుఁడు తన మృచ్ఛకటికలో సూచించియున్నాఁడు. 6వ అంకమున, ఆర్యకప్రవేశఘట్టమునఁ జూడఁదగు. అంతవఱ కక్కఱ లేదు. ప్రస్తావనానంతరమునఁ బాత్రప్రవేశ మెట్టిగుచున్నదో విచారించుచోఁ దేలఁగలదు. ఇట్లే 13, 25 పుటలలో ప్రవేశ నిష్క్రమణములు కూడఁ దెలియఁదగు. లక్ష్యజ్ఞానము లేని లక్షణము వృథా.

—: ఇదుగో :—

ఇదిగో అనుదాని రూపాంతరము- (శబ్దార్థచంద్రిక)

—: గురు వెవ్వరు :—

అని బహువచనము కూడ నుండవచ్చును. చ॥ నరునకు ... చుట్టిమె౹ వ్వరు, అరణ్యపర్వము, ౬ వ అశ్వాసము, భారతము, ప్రౌఢ వ్యాకరణము ౨౨ పుట ౩౭ వ సూత్రముకూడఁజూడుడు.

—: యోజించి :—

సాధువు. 'క॥ యోజింపుమంచు జెప్పిన, హాజారంబునకు...' రామాభ్యుదయము ౨ ఆశ్వా. 'యోచించి' అనుట కేయాధారమును లేదు. ఇప్పట్ల శబ్దరత్నాకరము పొరఁబడినది.

ఇతఁడు లక్ష్యమా :— అనుట భారతసమ్మతమే. "క॥ అమృతమయా... వా, చ్యమయి పురుషోత్తము...' మఱియుం బెక్కులు, పెక్కులు, పెక్కులు.

యజమాని :— ఇట పుంయోగమున జీషువచ్చును, ఇది ప్రమాణ్యయే. నహి తద్ధితాంత మాఖ్యాభవతి (మహాభాష్యము) యజమాన్యాభర్తుః అనువచనము శాబ్దికజీవులకు ముఖ్యముగఁ దెలియవలసినదియే!

ఆఁడువాండ్లు :— 'వాండ్రు' అనుదానికి, వాండ్లు, వాళ్ళు, అను రూపములు గ్రామ్యములు. అయినను గొన్నిచోట్ల ననఁగా నిరాదరత్వాదికము వివక్షితమైనప్పు డీ గ్రామ్యరూపములను వాడవలసియుండును. ఇయ్యెడ స్త్రీయందలి యవ్యక్తత వివక్షితమై తీరవలెను. కాన గ్రామ్యరూపము వాడఁబడియె. నానారాజసందర్శనములో "గాండ్రు" అనుటకు బదులు "గాండ్లు" అని ప్రయోగించితిమి. గ్రామ్యమును వాడుటను గూర్చి నానారాజసందర్శనపీఠిక జదివిన మాయుద్దేశము విస్పష్టమగును.

గ్రహింపు :— కొంతమంది పండితులు సమ్మతించిరి. "శ్లో॥ క్వచిదిం ప్వంతతాం కేచి దూచిరే..." (అహోబలపండితీయము 375 పుట) సర్వపథీనాః కవయః.

పఱచు, పఱుచు :— రెండును గలవు (శబ్దరత్నాకరము)

జరగినవట్టు :— ఇట "జరగినంతవట్టు" అని యుండవలె నని కృతజ్ఞుల యాక్షేపణము. 'అంత' కు లోపము రావచ్చును. 'కలంతకాలము' భార-

ఉద్యో ౪ ఆ॥ 'కలకాలము' అనునదియే అంతకన్న సుప్రసిద్ధము. 'సాధ్యమైనపట్టు' లోనగునవి యిట్టే అని యెఱుఁగఁదగు. ఈ 'అంత' కే కాదు; 'అది' కిఁగూడ నిట్టిచోట్ల లోపము సుప్రసిద్ధమే; 'పుట్టినకోలెను' భార-విరా-౧ ఆ. (ఇట్టివి పెక్కులు) "ఉ॥ తాళి విభుండు గట్టినమొదల్" పాండురం-౪-ఆ॥ 'పట్టు' అనునది 'మితి' అను నర్థమునిచ్చు 'మట్టు' నకు రూపాంతరము. భారతాదులలో 'పట్టు' నకే విశేషించి ప్రయోగము కన్పట్టు. దీనిని శబ్దరత్నాకరకారకుఁడు వ్రాయనేలేదు. "క॥...వసుమతి మీఁదఁ గలయంతపట్టు" అని హరివంశము పూర్వభా- 3 ఆశ్వాసమున యతిస్థానమందుఁ గలదని యెఱుఁగునది.

శేషముమిగుల్చు :— 'శన్' అనుదానికి లోపము ప్రౌఢవ్యా ౭౭ పుట ౨౨ సూ. శేషముగ మిగుల్చువాఁడు అని యన్వయము, పునరుక్తియును లేదు. అహోబలపండితీయము 511వ పుట కూడఁ జూడుఁడు.

చంపీచంపని :— సోమయాజికి సమ్మతము. "నమ్మమి మృత్యువు...నరపతి నమ్మి నమ్మక" భాగ-శాంతి-౨ఆ.

నికృష్టంపుం జంపుఁ జంపి కెడపితి:— "అనుచితంపుఁ జంపుఁ జంపితిఁ" భార ద్రోణ ౪, ఆశా. "జమిలిచంపులు చంపిరి." రామాభ్యుదయము ౭ ఆ. కెడపు (పడఁజేయు) శబ్దరత్నాకరముఁ జూడుఁడు.

రక్తమది :— ఇందలి 'అది' 'యతిభిక్షుకుఁ గాఁబోలు' అని వెక్కిరించిరి. 'ఉ॥ ... ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె న, త్యాయతశక్తితో దనకు హస్తిపురంబది రాజధానిగన్" భార-ఆది-౫ ఆ. ఈయెడ యతిస్థానమున నన్నయ్యభట్టు వాడలేదుగదా, దీనిఁబట్టి యీ 'అది' సహృదయైకవేద్యము, కావుననే తిక్కనాదులెల్లరును గుప్పతెప్పలుగాఁ బ్రయోగించి కొనిరని యెఱుఁగునది. ఇదికడుఁ జక్కని ప్రయోగము.

నిగుడ్చి :— నిగుడించి. గుఱుతించి, ఇత్యాది సజాతీయ ప్రయోగములయందెల్ల, బాలవ్యా - క్రియాపరి - 85 వ సూత్రముచే, ఇత్వము విధిగా రావలయునని వీరభిప్రాయ పడి కాఁబోలును గీట్లు పెట్టిరి, ఇందులకుఁ గొన్ని వేలు పరిశుద్ధప్రతుల యందు నుదాహరణములు దొరకినవి కాని యవి గ్రంథకర్తలు స్వయముగా ముద్రించునవి కాకుంటచే ముద్రాప్రమాదములని బొంక నవకాశము కలుగవచ్చును, కావునఁ జిన్నయ్యసూరి స్వయముగా నచ్చొత్తించి

కొన్న నీతి చంద్రిక నుండియు స్వయముగాఁ బరిష్కరించి యచ్చొత్తించిన నీలాసుందరీ పరిణయము నుండియు లక్ష్యములు చూపఁ బడుచున్నవి. 'నిగుడించి' (నీతిచంద్రిక) 61-74-88-113- పుటలు, "వినుపించెను" నీతిచంద్రిక 24-40-78-80-82-87 పుటలు. "అనుపించి" నీతిచంద్రిక 107 పుట, "వినుపించిన" (నీలాసుం) 16-27-34- పుటలు. మఱియునింకే 'ఎఱుఁగించి పిలుపించి, లోనగు సజాతీయములు కుప్ప తిప్పలుగా నున్నవి. చిన్నయ్యసూరి తాను వ్రాసిన సూత్రమున కన్యథాగాఁ బ్రవర్తించుటచే నది యనిత్యమని విస్పష్టమగుచున్నది. కావుననే "అంక మొకింత" శాస్త్రులవారు, వినుపించెద అని ప్రయోగించిరి. (మురారి 8 పుట) నీతిచంద్రిక వ్రాఁత వ్రాఁతప్రతులు కూడఁ జూడుఁడు. నిగిడ్చి అనియే యుండవలెనుగాని ఉకారసహిత ముండఁ గూడదని పూర్వపక్షము. రెండును నుండవచ్చును ఇటీవల, ఎఱ్ఱన్న హరివంశమున, యతిస్థానమందే దొరకినది. సీ॥ ఆలోనగడ పూన్చి యభ్రమాతంగంబు కుంభపీఠంబు (పగుల్చి) యసుర - పూర్వభా - ౪ ఆ. పరిశీలింపవలెఁగాని ప్రయోగములకుఁ గఱ వుండదు,

శస్త్రాస్త్రములు:— ఇట్లుండవచ్చును. అనర్ఘరాఘవ పీఠిక 5 వ పుట 21 పంక్తి చూడుఁడు. భారతమందున్న యీప్రయోగములకు మితియేలేదు.

—: తాపసి :—

ఇది తాపసశబ్దభవము. "తే॥గీ॥ అనుడు వేలుపుఁదాపసి యానుశీల" పాండురంగమహాత్మ్యము, ౫ ఆ, పుంవాచకములగు రక్కసి, రాకాసి, అను శబ్దములును మానుషశబ్దభవమగు మానిసి లోనైనవియు, ఇకారాంతము లెటులైనవో యిదియును నట్లే.

—: ఊరకొను :—

అనునది గ్రామ్యమని మేమే వ్రాసియుంటిమి. 1909 వ సం॥ అచ్చైన శ్రవణానందము 29 వ పుటచూ, దానిని జూచియే వీరిందు మమ్మాక్షేపించిరి. భవతు, గ్రామ్యమైనను మహాకవి సమ్మతింజేసి ప్రయోగింపవచ్చును. సీ॥ గొంతుకూర్చొని రసికుల" శ్రీనాథునివీధిచూ, ఇవిరెండును నొకవిధమైన గ్రామ్యములే, ఈత్రోవ "అంక మొకింత కల్గనివారికిని సమ్మతమే" (1) చ॥...పగులఁ

వడిఁ గొట్టుక” (2) తే॥గీ॥ కోకిలా! నోరుమూసిక” పండితరాజ శతకము ౧౦, ౨౦ పుటలుచూ, ఈప్రయోగము లెల్ల గ్రామ్యములే, పూర్వకవి సమ్మతింజేసి ప్రయోగార్హములయ్యె, ఆడక్, ఈడక్, ఇత్యాదులు భారతమందు సయితముకలవు. అవియును గ్రామ్యములే, అహోబల, 514 వ పుటచూ, పలకలు పుస్తకమ్ములను బాణిసరోజములక్ ధరించిపం, క్రుబుగొని దారుపాళిపయిఁ (గూర్చుని) వ్రాయుచు, చెన్నపురీవిలాసము ౭౩ వ పుటచూ, ఏతద్గ్రంథకర్త శ్రీమన్మతుకుమల్లి నృసింహ విద్వన్మణి, ఈయనపాండిత్యమును గూర్చి వేఱుగ వ్రాయనక్కఱలేదు. సుప్రసిద్ధము.

అనుంగతిని :— ఇది ప్రామాణికులంగీకరించిన సుప్రయోగము “మ॥... అయ్యంతి చెక్కుఁలఁబోలుందెలనాకులు” పాండురం-౧-ఆ. “శా... చెల్వారుక్ రాముఁడు ప్రోచుఁగాత”. (కవుల షష్ఠము) కవిసంశయ విచ్ఛేదము ప్రథమ తరంగముఁ జూడుఁడు.

నించె :— అస్త్రవిషయమున నించు (నిండించు) ధాతువునకుఁ బ్రయోగము కూడదని పూర్వపక్షులవాదము. ఈయస్త్రము నింపఁ (నిండింపఁ) దగినదియే. సృగ్ధర “ఏదిక్కుం దానయై పెల్లెసఁగుచు భువనంబెల్ల భస్మంబుగా నా, పాదింపక్” భార- సౌప్తి-౨ ఆ, విస్తరమాచోటనే చూడఁదగు. అస్త్రము లన్నియు ననేకరూపములతో భువనములు నిండెడివియే. వ॥...బ్రహ్మాస్త్రమ్ము ప్రయోగించిన. క॥ ఆదివ్యాస్త్రజ్వలనము, భూదిగ్గగనములు నిండిపొదివి” భార- అర- ౪ ఆ, నారాయణాస్త్ర ప్రయోగఘట్టమున ద్రోణ ౫ ఆ, కూడఁ జూడుఁడు. వ॥...అతనిమేన నానాస్త్రమ్ములు నించిన, భార, భీష్మ ౩ ఆ. “క॥ తనువులఁ బటుబాణమ్ములు నినిచి” భార- కర్ణ- ౨ ఆ, ఆయాస్థానములయందెల్ల ‘నించు’ ధాతువునకుఁ బ్రయోగించు అను నర్థము చెప్పుటయేయుక్తము. శబ్దరత్నాకరము వ్రాయలేదని సంశయింపఁగూడదు. అతఁ డిట్టివెన్నియో మానియున్నాఁడు. పోనిండు; ప్రకృత మంతవఱకుఁ బోనక్కఱలేదు. బ్రహ్మశిరంబు భువనమెల్లను నిండునట్లుచేసెను, అని చెప్పికోవచ్చును ‘మూర్ఖం ఛందానురోధేన, మ॥...శస్త్రాస్త్రముల్ నించి’ శా॥...ఆగ్నేయాస్త్ర రౌద్రాస్త్రపం, దోహమ్ముల్ శశిమీఁద నించుటకు నుద్యోగించినక్’ ఈరెండు ప్రయోగములును ఉత్తరరా- ౪ ఆ- లోనివి, మఱియు వేనవేలు.

గుప్పిరె :— కర్మవాచకము బహువచనముగా నున్నప్పుడుగాని గుప్పు ధాతువు ప్రయోగింపఁ దగ దని కృతజ్ఞులవాదము. బ్రహ్మశిరోనామకము బహురూపమై జగమెల్ల నిండునదియే కావునఁ బూర్వపక్షు లీక నోరు మెద పరు; వాస్తవమునకో, "క॥...ఎవ్వని నాభీసరోజ మునను విధాతకా" భార- శాంతి- ౪ ఆ, శబ్దరత్నాకరములో, 'ఈను' ధాతువునుగూర్చి సర్వానుభవసిద్ధ మగు పశ్వాదిప్రసవపరముగా వ్రాయఁ బడియున్నది. దానిం బట్టి శంకించి నచో బ్రహ్మ పశువు కావలసి వచ్చును; కావున నిట్టిస్థలములయం దౌపచారి కత్వము సర్వకవిసమ్మత మని యెఱుఁగఁదగు. ప్రయోగము లింగులకు ననేకములు.

బీతులకా :— 'బీతుల వెత లుడుప' విక్రమార్కచరిత్రి పూర్వభాగము "పలుకకు బీతునట్లు' భార- విరా- ౫ ఆ, భీతశబ్దభవమని యెఱుఁగఁదగు.

ప్రజ్జ్వలింప :— ఇక్కడ, జకారద్విత్వ మజాగళస్తన మని వెక్కి రించిరి. 'అనచిచ' అను సూత్రముచే వచ్చు ద్విత్వము వికల్పముగానఁ జేయ వక్కఱ లే దని శంక, ఈశంక యుక్తముకాదు, 'పర్జన్యవ ల్లక్షణప్రవృత్తిః, యథా స్థలేఽపి జలేఽపిచ వర్షతి"

—: విదురునియింట విందనుచుఁ జెట్టితి సంధిచెడంగకా.: —

ఇట వాక్యము భ్రష్టమైన దని వృథాగ వెక్కిరించిరి. సంధి చెడంగకా అను పదద్వయము వెనుక కన్వయించుట కూడదని మా వివేకుల హృదయము. ఇందులకు భారతమంతయు నుదాహరణమే; స్వల్పముగాఁ జూపెదము. "చ॥ శీలముకా వదలి నభూజనమ్ములకు వచ్చినె యిమ్మెయి వేఁక్కసల్పఁగకా" భార-అర-౭ ఆ. దీనితో పాటుగా "ఏమును బోయెద మిచ్చకచ్చుగకా" అను పదికూడఁ జూచికోఁదగు 'అంక మెంకింత కల్గని' వారికినమెల్ల నిట్లేయుండును.

దుర్ణయుఁడు:— ణత్వముకూడ నుండవచ్చును. వాచస్పత్యముచూడుఁడు. "ఆ॥ వె॥ దుర్ణయుల్ శకునియుఁ గర్ణదుశ్శాసనుల్" భార - ఆది - ౩ఆ - "ఉ॥ నిర్ణయ- దుర్ణయవృత్తికికా -" నైషధ - ౨ - "ఉత్సాహ॥ వర్ణనీయ... దుర్ణయారిమానహారి" - మనుచ - 3 - ఆ - ఇవియన్నియుఁ బ్రాసస్థానములు. ణత్వమున కాధారములు కొన్ని చూపఁ బడినవి. అవి యనివార్యములు. అవి యటులుండుఁగాక, సంస్కృతభాషకు మహాభాష్యకర్త యెట్టివాఁడో తెల్గుకా

షకు నన్నయ్య భట్టిట్టివాఁడు. శేఖరకారకుఁ డన్యథా వ్రాసినను నతనిప్రయోగ
ము తిరుగదు. అదిగాక యితనికన్న శేఖరకారుఁ డతినవీనుఁడు, అట్టిచో నితని
కతనిశాసన మనుసరణీయ మెట్లగును. మనకు శేఖర మనుసరణీయ మైనను దెలుఁ
గుకవిత్వము విషయమున నన్నయ్యయే విశేషించి యనుసరింపఁ దగినవాఁడు. వ్యా
ఖ్యాత లొక్కొక్క రొక్కొక్క తెఱఁగున వ్రాయుచునే యుందురు. ఎవరిననీ
యనుసరింపఁ గలము! ఇయ్యెడ నెట్లో శేఖరము ననుసరించి వాగనుశాసను
ప్రయోగము త్రోసివేసితిమే యనుకొనుఁడు; తనమయము, తమమయము, మెద
డు ప్రోవులమయము లోనగు తిక్కనశంభుదాసుల ప్రయోగముల నేశేఖరము
సాధించెడిని ? (త్రిలింగలక్షణ శేషము౧౧౧వ సూత్రము) కావున భారతమును
వదలఁగూడదు. అది వదలి వేఱొకని నాశ్రయించుట నేల విడిచిన సాముపం
టిది. అదియునుంగాక దానిని వాచస్పత్యాదు లొప్పిరి కాని త్రోసివేయలేదు
మహాకవులగు శ్రీనాథ పెద్దనాదు లాత్రోవనే ప్రయోగించి యున్నారు. నన్న
య్యభట్టున కపూర్వప్రయోగములయందుఁ గడుఁ గుతూహల మనుటకు ననేక
నిదర్శనములు గలవు. అందులోఁ బ్రకృతపు ణత్వమొకటి. "క॥ - - ముష్
ట్టాముష్టిరణోత్థితచ్ఛటాశబ్దంబుల్" భార - ఆర-౩అ॥ ఈ ముష్టాముష్టిగూడ
దుర్ణయశబ్దమువలెనే చర్చింప వలసినదే. పండితంమన్యులు దిద్ది పాడుచేయుదు
రని కాఁబోలు యీ విశేషరూపములను దిద్దరానిచోట్లనే యమ్మహానుభావుఁడు
వాడుచుండును.

— దుర్యోధనుని తొడలు విఱుగఁగొట్టిన యాలములో నశ్వత్థామ లేఁడు —
ముమ్మాటికిని లేఁడు. భారతము శల్యపర్వము చూడఁదగు.

—: ఇతఁడు కోలుమసంగెను సైన్య మెల్లఁ. :—

సైన్యమెల్లక్, సైన్యమునందంతటను (సప్తమ్యర్థమునఁ బ్రథమ) ఇతఁడు
అశ్వత్థామ, కోలు మిక్కిలి, మసంగెను విజృంభించెను. ద్రోణమరణానంతర
మెక్కుడు చేవచూపెనని తా॥

—: ఒకరా, యిద్దఱా :—

ఒక్కరు, ఈబహువచనముఁగూర్చి పలుచోట్లవెక్కిరించిరి, ఇందుకుం
బ్రయోగములు- "వ్యాకరణంబునకు నింకను నొకరిద్దఱు వ్యాఖ్యానంబుంబొన
రింప నుద్యమించిరి" గూఢార్థప్రకాశికా పీఠిక "ఒకరుకారిద్దఱుకారు" నీతి.

ణం - సంధి, 30 వ పు, ‘‘క॥ ఒకరిరువురుగాకందఱునకటా’’ పంచతం - 3-ఆ
ఆపిమ్మట నొకరిద్దఱు కొన్ని దినమ్ములుండి యా వ్రాఁతపని చూచిపోయిరి
శబ్దరత్నాకరపీఠిక, 6 పుట ‘‘మీలోపల నొకరయిన ముందువచ్చి’’ నీతిచం-
(చిన్నయ్యసూరికృతము) ‘‘క॥ తా నిది గెలిచితి ననియెను, నేను గెలిచియుండ
నెట్లఁ డిది యేటికి మీ, రెనెఱిగి నిజము సెప్పుఁడా, నా (నొకరును) బలుక నైరి
సమితానను లై’’ హరివం - ఉత్తరభా - 3 ఆ. మఱియుం బెక్కులు, బాలవ్యా
కరణమునందే, ఒకరులోనగు బహువచనోదాహరణములు పెక్కులుగలవు.
అందే అమహదర్థకము నిత్యైకవచనాంతమనియుం జెప్పఁబడియున్నది. దాని
వ్యాఖ్యానమగు గూఢార్థప్రకాశికలోఁ గూడ నీయంశము కలదు. 129 వ పుట
చూడుడు. సంఖ్య, యననేమో, సంఖ్యేయమననేమో యెఱుఁగక పోవుటయే
కాక భాషాస్వభావమునుగూడ బొత్తిగా నెఱుఁగనివృద్ధుల ప్రేరణముచే నీబా
లురిటుఁ దప్పుపట్టిరని యెఱుఁగునది.

తా:— ఏమియుం దోఁచకున్నప్పుడు వీరి కీ ‘తా’ ప్రత్యక్షమగుచుండును
అని మావారు తూలిరి. మాకే కా దీరీతిని భారతకవులకును బ్రత్యక్ష మగు
చుండును. ‘‘చ॥ తనయు మహేంద్రతుల్యవిభుఁ డా మహనీయుని గాంతునం
చు’’ ‘‘ఉ॥ వసుదేవుఁడు దేవకుకూఁతు లందఱిన్, దా వరుసన్ వివాహ మయి’’
‘‘క॥ దేవరదర్శించుటకై । తా వచ్చుచున్నవాఁడు తపనుం డిదె’’ వ॥-కృతవ
స్త్ర నడుగం బోయిన నతం డియ్యకొనక-విరోధమ్మునకుఁ దానొర్వమిఁ దెలియఁ
బలికె’’ వ॥ తానొక్కరుండ హేతునై॥ వ॥- గోవర్ధనధరుండు... తే॥ గీ॥ విబుధ
కన్య లందఱును... దాను వరియించినాఁడు॥ ఉత్తరభా-రఆ॥ ‘‘శా॥ ఏమీ పౌం
డ్రుఁడు తా నుజుట్టములునై యేతెంచెనే’’ ఉత్తరభా-౬ఆ మ ... దివిషత్సా
ంద్రు నాభీలతా। త్రివపం తా వశరణ్యుఁగా నినుమదిం దానమ్మియుండుకె’’
ఉత్తరభా-౭ఆ॥ ‘‘ఉ॥-తానొకచేఁతకున్ సనుపధానము లేక మురారి ధీరతన్’’
ఉత్తరభా-౭, ఆ,, ఈ ‘తా’ ప్రయోగము లన్నియు నెఱ్ఱాప్రగ్గడ హరివంశము
లోనివి. ఇవి యెన్నేని వెదకి యుంచితిమిగాని వెఱ్ఱిగాఁ దలపోతు రని యెంచి
యింతతో విరమించితిమి. వచనములలోనివి కూడ నిందుఁగొన్ని కలవు. కావున
సూత్ర్యాదులకై పుట్టిన వనుటకు వలనుపడదు. అఱవమునకును దెలుఁగునకును గల
సంబంధమును దెలిసినచో నీ రహస్యము సుగమము.

అట్లనె, ఇట్లనే :— "చ॥...లలితకరాబ్జరాగ మిటులన్ బ్రసరించి" రుక్మిణీపరిణయము, 3 ఆ॥ "ఉ॥...రామునిమ్రోలనాలుకలు రానటులన్ బ్రతికూలవయ్యె" రామాభ్యు- 6 ఆ॥ "మ॥ ఎప్పట, ట్లనె యేమనుండక పట్టితే నధిప్రేలా వేడితిన్॥ రామాభ్యు- 5 ఆశ్వా. యతిస్థానమున నొకటియుఁ బ్రాసస్థానమున నొకటియుఁ బ్రామాణిక ప్రయోగములేఁ బడియె; కొన్నివందలిందులకుఁ బ్రయోగములు కల వని యెఱుఁగునది.

ఇవ్వారిన్ :— ఇది తప్పఁట, దీనిఁగూర్చి దోషసహస్రమున నేమో తెల్పుదురఁట! దాని ఖండమునందు దానికి బుద్ధిచెప్పుదుము. "క॥ దోషసహస్రవిధాతల। వేషమ్ములనడఁచుపాంపె వేంకటపతి సం। తోషమున నెదురుచూచెడి, భాషావేత్తృత్వమదియుఁ బైపైఁగలదే"

—: వంశపుంగురువగుద్రోణుకన్న :—

ఇట శంకకు లవమేని యవకాశముండినచోఁ దెల్పుటకు సహృదయులు ప్రార్థింపఁబడుచున్నారు. ద్రోణుఁ డతని కాలముననున్న కురువంశజుల కెల్ల గురువు కాఁడా? ఒకవేళ ధృతరాష్ట్రాదుల కతఁడు గురువు కాఁడన్నచో ఛత్రిన్యాయము దానికి నివర్తకముగాదా! కానిచో భారతమున సర్వత్ర 'గురు' పదముచేఁ గవిత్రయ మేల వాడె? వ్యాసుఁ డేల వాడె? మఱియు నిందు విపరీతార్థప్రదమును విరామశయ్యామాత్రబోధకమునగు వాక్యముకలదఁట! చిత్తగింపుఁడు

కడుపు లొక్కటన్ :— ఇట "భల్ల మొక్కట నాతని విల్లు దునిమి" విరా-3 ఆ॥ లోనగు ప్రయోగపరంపరాసారస్య మెఱిఁగినవారికి శంకయే లేదు. బహువచనము భిన్నోదరత్వద్యోతకము, "లింగసంఖ్యావిభేదేఽపి" అను న్యాయమున విశేష్యవిశేషణభావము ఔపచారికప్రయోగము "శ్లో॥ యత్ర భ్రాతా సహోదరః" రామాయ-యుద్ధ-102 సర్గము. "శా॥ వచ్చెం గుంతీసుత మధ్యముండు" భార-విరా-4 ఆ. ఇవియన్నియు నౌపచారికములే. రామలక్ష్మణులు కౌసల్యాపుత్రు లయినంగాని రామాయణము కుదురదు; నకులసహదేవులు కూడఁ గుంతీపుత్రులయినంగాని భారతము కుదురదు. కానిచో మధ్యముఁడు భీముఁడగునుకాని యర్జునుఁడు కానేరఁడు, విస్తరము సహృదయులవలన నెఱుఁగఁదగు. "జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం న రంజయతి, ప్రకృతమున నొక కడుపుననే కాక యొకతండ్రికిఁగూడ జనింపనివార లయ్యు సామరస్యమున్నచో

నిట్లు తమలోఁ దాము కొట్టికొనిచావక యేకోదరులవలె మెలఁగఁదగువారని తాత్పర్యము.

ఎందఱికిం దనుజాండవో :— సంధివశమునవచ్చిన దకారము తనుజాని దనుజానిగాఁ జేసిన దనునది దేవయ్యాల శంక "తే॥ గీ॥ నీ స్తవమువలనఁ దుష్ట హృదయుండనైతి" కవికర్ణ-౧ ఆ॥ ఇట్టివి వేనవేలు. - వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిః."

కులానఁ గళంకు:— 'చ॥...తోమగలంకడఁగెణ్' ఆముక్తమాల్యద ౪ ఆ॥ మఱియుం జెక్కులు. కవిసంశయవిచ్ఛేదము తృతీయతరంగము కూడఁ జూడుఁడు.

ముదితొక్కులు:--అనునది వ్యాకరణముచే దుష్టముకాదు. ఇఁక నెందులకు దేవయ్యాలు శంకింతురు? శబ్దరత్నాకరములో దీనికి ముసలివాండ్రను నర్థములే దను హేతువున. "సిద్ధిర్లోకాద్ద్రుశ్యా" ముసలితొక్కులు అనునది లోకప్రసిద్ధము -ఆమె తొంబదియేండ్ల తొక్కువలె- గ్రీకుపురాణము 291 వ పుట. ఇది లోకమున వాడుకయున్నదా, లేదా యను సందియముం దొలగించుటకుమాత్ర మీఁబడినది. శబ్దసత్తకు శబ్దరత్నాకరము చూడుఁడు.

పఠింపుటకు :— పకారాదేశము లాక్షణికసమ్మతమే. -క॥ కావింపుట కావించుట భావింపుట మఱియు దీని భావించు టనం, గా వెలయుఁ గృతుల- సర్వలక్షణసార సంగ్రహము ౭౨ పుట.

చేతుడు, కోతురు :— అసాధువులు కావు, మున్మాటికి సాధువులు. -మ ...సంక్షోభింపఁగాఁ జేతుఁ గట్టులుకణ్- భార- విరా- ౪ ఆ. -చ॥... దోస్తులము డాఁపక పోరెడు నేమిసేతు- భీష్మ- ౨ ఆ. -తే॥గీ॥...చేరి చుంబించి మోహింపఁ జేతురనిన- శృంగారనైష- ౨ ఆ. -మ॥ తనరారన్నతి సేతు సేతుహిమవత్- రసికజనమనోభి- ౧ ఆ. కొన్నివంద లిట్టి ప్రామాణిక ప్రయోగములు కలవు. చిన్నయ్యసూరి తప్పన్నంతనే పోదు. అహోబలపండితుఁడు తిక్కనాదుల సుప్రయోగము లనేకములు త్రోసివేసినాఁడు; అది యతని యసమర్థతను తెల్పునుగాని ప్రయోగములకుఁ గళంకు గల్గింపనేరదు. చిన్నయ్యసూరికన్నఁ బ్రాచీనుఁడగు గణపవరపు వెంకటకవి తన ద్విరూపకోశములో

-...చేతుమ జేయుదును నాఁగఁ జెలువొప్పు హరీ- అని రూపాంతరముగాఁ జూపియున్నాఁడు. పరిసక్తివచ్చినది కాన "కోతురు" కూడ సాధువనుటకుఁ బ్రయోగమీఁబడుచున్నది "చ॥ ఒకని కవిత్వమం దెనయు నొప్పులు తప్పులు నాకవిత్వ మం। దొకనికిఁ దప్పుపట్టఁ బనియుండదు; కాదని తప్పుపట్టినన్, మెకమటు క్రిందుగాఁ దిగిచి ముక్కలువోయెడి యున్నకత్తితో, సిక మొదలంటఁ గోతు, మఱి చెప్పునఁ గొట్టుదు, మోము దన్నుదున్ (రామలింగకవి చాటువు) చిన్నయ్యసూరి వ్రాఁత ననుసరించి బహుగ్రంథదర్శులు కాని కొందఱు భారతమును దిద్ది పాడుచేసిరి, చేయుచున్నారు, చేయఁగలరు. ఆదిద్దుబాట్లు విజ్ఞు లొప్పికోఁదగినవికావు.

తల నెరసినంతనే :— తల నిండినంతనే, పలితత్వముచే నని యధ్యాహారము భాషాస్వభావముచే సుగమము. -నరయు- ధాతువుకన్న నీ యర్థమున -నెరయు- ధాతువునకే లోకమునఁ బ్రచారము విశేషించి యుండుటచేతను, నయ్యది వ్యాకరణాదిదుష్టము కాకుంటచేతను, దీని నీ యుక్తితాకాంక్షామూలకాధ్యాహారవశమున సులభముగా సమర్థింపవచ్చును. దిఙ్మాత్రప్రదర్శకమయి నిన్న మొన్న నుదయించిన నిఘంటువులవలనఁ జిరకాలరూఢమై నిర్దుష్టమై వ్యవహరింపఁబడు పదము పోవలసినదేయగునా! మిడిమిడి జ్ఞానమున మిట్టిమిట్టిపడు వారిచేఁ దప్పని నిరసింపఁబడు శబ్దము లనేకములు నిర్దుష్టములు కలవను నంశమిందే యనేకస్థలముల మీకుఁ దెల్లమగుఁగాన విస్తర మనవసరము. శాస్త్రవిరోధము వచ్చువఱకు లోకమును వదలఁగూడదు. కావుననే -సిద్ధిర్లోకాద్వ్యా- పంచాంగములో లిఖింపకున్నను నక్షత్రములు పోవు.

అదే పాలికలను, దగ్గఱకు వచ్చినారము :— పాలికేను వేఱు, దగ్గఱకు వేఱు, దాని నిటఁ బరిహసించుట బుద్ధిపొరపాటు. సమస్తపదము కాకున్నచో నిత్వ మెట్లు వచ్చును? రాదు.

అంపు, అంపించు :— ఈరెండును సమానార్థకములు. ఇట్లే గుప్పు-గుప్పించు. -క॥...శరనికరములు గుప్పించుచు ధర్మజుఁడు కవిసె- భార- శల్య- ౨ ఆ. ఈయర్థమునందే - ఉ॥ నూఱుతూపులన్ గుప్పితి వీవు- ఉ- రా- ౬ ఆ. గుప్పు గుప్పించులకు శబ్దరత్నాకరము కూడఁ జూడుఁడు. -హరి నీ వంపలేదె- అనుటకన్న -అంపింపలేదే- అనుటలో నొకవిధమైన సారస్యమున్నది. అయ్యది సహృదయైకగోచరము. స్వహస్తపాకులకుఁ దెలియదు.

చెఱుపన్నేను :— ఇట -ఏను- అని ఛేదము చేయవచ్చును. అయిన చో యతి యెట్లు చెడును! సంప్రదాయ మెఱుఁగక శంకించిన వాండ్ర మతి చెడియుండవలెను. ప్రౌఢవ్యాకరణము ౫ పుట 3 సూత్రము చూచి పిమ్మట నీ క్రింద నుదాహరించు నహోబలపండితీయమును జదివికొనఁదగు "...నోవా ద్విత్వం క్వచిచ్ఛిష్టం, పరప్రాణేన సంగతేః, ద్రుతాద్ద్రుతః క్వచి చ్చాత్రోప్య శ్యతే కవిభాషితే, ఏత దాచార్యస్యాపి (నన్నయ్యభట్టారక స్యాపి సమ్మతం -దీని నెటులు గ్రమ్మతింతు మదీయభాషణ మెన్నఁడు, న్నేని మోఘము. గాదు- -అతనిధైర్య శక్తికిన్నరుదుగ మెచ్చి -ఇత్యాది తత్ప్రయోగాత్...- విస్తర మందే 299 పుటలోఁ జూడుఁడు.

ఏఁడోయి :— ఏడ + ఓయి అని ఛేదము. సప్తమ్యర్థమునఁ బ్రథమ -తే॥ గీ॥ ఇచ్చిపోయిరి క్రమ్మఱ నెక్కడేని- భార ఉద్యో 4 ఆ. మఱియు నందేమి యితరత్ర యేమి పెక్కులు ప్రయోగములు కలవు, కాని యిది పరి శైన త్రోవకాదు. ఈప్రయోగమిట్టు సాధించినను, ఇదే ప్రశ్న శ్రీని గూర్చి చేయునెడల నిసేతోర్వి నవలంబించినచో భాషాస్వభావము చెడును. -భీమన్న యేడోయి- అనికదా యననలెను. ఇది చెవి కెంత కంటకముగా నుండునో సహృదయు లెఱుఁగుదురు. కావున నిట -ఏడ- శబ్దమునకొని శంకిం పఁగూడదు. వీఁడి + ఓయి అని యెఱుఁగఁదగు. శ్రీనిగూర్చిన ప్రశ్నమందు ఏది + ఓయి అని యుండును. సంధివశమున .ఏఁడోయి అనియు ఏదోయి యనియు నగును; కావుననే త్రిలింగలక్షణ శేషము 33 పుట 35 సూత్రము లో -ఏఁదేరదేవి శబ్దంబు లర్థవిశేషమ్మునం దీకారాంతములగు... హ్రస్వాం తములునగు. వాఁడేఁడ (అర్థవిశేషము) ఎక్కడ, ఎక్కడ నున్నాఁడు ఇత్యాది, విస్తరమందే చూడుఁడు. వెనుకటికూర్పులో నర్థబిందువు లేమి ప్రమాదము. ఆప్రమాదముకూడ నడిగిన వాండ్ర తెల్వినిబట్టి సమర్థింపనే వచ్చునని చూపితిమి. ప్రాజ్ఞులు విశ్వసించు త్రోవ తుట్టతుదను దెల్పితిమి. భాషాస్వభావ మెఱుఁగని కవి కవిగాఁడు, కాఁడు, కాఁడు. సప్తమ్యర్థమునఁ బ్రథమ -సీ॥ ఎటయేని వెడలి, శాంతి-4ఆ- శా॥ బాలుం డెక్కడ బండియె క్కడ నభోభాగంబుపైఁ జేద్పడం గాలందన్నుట యెక్కడేలపడుచుణ్, భాగవ-౧౦ స్కం, పెక్కులు, -ఉ, ఎక్కడి కెక్కడయ్యా!- సమీరకుమార

విజయము- ౨ వ ఆ. ఇక్కడక్కడ, నిర్వ- ఉత్తరరామా- ౪ ఆ. (మఱి కొన్ని హరి వంశములో నిటీవల దొరకినవి) -చ— అం, దళమును నొక్కటై కలసి దవ్వుగఁ బాఱుద మెవ్వరెక్కడే నొఱగిన--పూర్వభా- 3 ఆ. -క॥ కరిణీసంగమ మెక్కడ? యిరవగుయోగదశ (యెక్కడె య్యారికి) నే. తెరువు పూర్వభా- 3 - ఆ, మఱియుం బెక్కులు,

ఒక్కటైనను:— ఒక్కటి + ఐనను; ఇది ఏమ్యాదులలో జేర్పరానిది కాదు. తత్సమపదములకే లాక్షణికు లభ్యనుజ్ఞ యిచ్చుచుండఁగా నచ్చ తెలుఁగున నభ్యంతరమేమి? -అనల జ్యోతుండె వీఁడుండఁగా నిత్యాదీనా మేతద్గణత్వేనైన సాధుత్వ మవగంతవ్యం" అహోబలపండితీయము 194 పుట. "క... వచ్చునే యొకటైనన్" కళాపూ-3 ఆ. "సీ॥—మినుకొక్కటిచ్చిన పాండురం-౪ ఆ. మఱియుం బెక్కులు 'ఒక్కఁడు' అని దిద్దుట తెల్పితక్కువ వారి పని. వందలకొలంది యున్నప్పుడు దిద్దుటెట్లు!

బలవములు :— బలవశబ్దబహువచనము, తత్సమము, గ్రామ్య మనుకొనుట పురాకృతదోషము, పరవశబ్దమువంటిది.

పరామృశింపఁగా :— ఇది సంస్కృతిరూపము, చిన్నయ్యసూరి కీరూపమే కాదు. "ఉ॥... ఒ, క్కమ్మడి సుత్సృజించు" (కాశీఖం-5 ఆ) అను రూపమును గుదురదు. మాకు నన్నయ్యకన్నఁ జిన్నయ్య యెక్కుడనాఁ డను నమ్మకము లేదు. నన్నయ్య మతమున పైనుదాహరించినదియు మాదియు నిర్దుష్టములు. ఈ ధాతు విషయములలోఁ జిన్నయ్యసూరి పోకడ దుర్బలమని యుతఁడు గుణము నొకదానిని గల్పించి దానిని వారించుకొనుట కొనర్చిన ద్రావిడ ప్రాణాయామములవలననే కాక శ్రీనాథప్రయోగము వలనఁ గూడఁ దెలిసికొనుఁడు. సూరి 'సృజికి' నిర్మితిని గుణమ్ము తే దనికదా చెప్పినాఁడు; అన్యత్ర కూడ నేల లేకపోవలెనో బాలవ్యా- ౧౦౪ పుట ౬౪ సూ. మొదలు ౬౯ సూ. వఱకును బరికించి యిందుఁ జూపిన శ్రీనాథప్రయోగమును జూచికొన్నచో సూరిగారి ప్రమాదము విశేషజ్ఞులకు స్ఫుటమగును. 'ప్రమాదో ధీమతామపి.

గ్రుడ్డివానిఁ గా :— వాఁడుగా, అని దిద్దుకొమ్మనుట తప్పు. ప్రథమకన్న నిర్యోడ ద్వితీయకే ప్రాచుర్యము; ప్రయోగములు కుప్పతెప్పలు, "క॥... అవమానితుఁగాఁ బతిఁ జేయు నతివ" మార్కం-౨ ఆ॥

ప్రౌఢవ్యా-౨౧ పుట ౨౮ సూ. దీనికి భారతమున నేమి యితరత్రయేమి ప్రతి పుట యందును ప్రయోగములే "ఉ॥ ... దేవునింగా... బరమాత్మునిగా దలచుచున్" పాండురం-3 ఆ.

పృథ్వీభరం బొక్కటా:— ఇట "బొక్క" అని విడఁదీసి దోషము నిరూపించుట లాక్షణికులమతమే గాని, యుంచీ -బొక్క- పదమున కేమి, -పాలు- -ద్రొబ్బు- లోనగువాని కేమి. గ్రంథకర్తల మతమున దురర్థమున్నట్లుతోఁచదు. కావుననే, -బొక్కనీరు- (మార్కం - 3 ఆ) అని మారన్న ప్రయోగించినాఁడు. పాలు ద్రొబ్బులకు సర్వత్ర చూడుఁడు. దురర్థము వచ్చినను నంగీకరించి సంధిస్థలముల నిట్లు భారతాదికము నిరాఘాటముగాఁ బ్రవర్తించుచున్నది. -చ॥ హరితా, జయ మొడఁగూర్పకున్న -భార- ఉద్యో-2 ఆ; ఇట్టివి పెక్కులు. శృంగార రసమున నించుక పరిశీలింపవలసియుండును గాని యందును బ్రాచీనులు గణింపరైరి॥ -సీ॥...గుద్దంటఁ ద్రవ్వితివ్వి- కళాపూ-4 ఆ.

మొక్కఁ దగున్:— -క॥ ...దగదున్. బటువగు నొకపదుగు వచ్చె- పాండురం - 4 - ఆ

అన్నవ:— (సొగసు) మన కొక్క శబ్దరత్నాకరమేనా గతి! భారతాదు లింకను జూడవలసియుండును. -ఉ॥ ... అ॥ య్యన్నవబ్రహ్మచారి మొగ మంబురుహంబు సమంబు- భార-అర- 3ఆ॥ ఇట, అల్పపు బ్రహ్మచారి యని సహృదయుఁ డర్థము చెప్పఁడు. -తపిన యన్నవ నల్లనైన దీర్ఘపుఁ దనువు -భార- ఆది-4 ఆ॥ అన్నవకల్పార్థకత్వము చెప్పినచో నిర్యోప దీర్ఘ పదము బాధించును.

దయచూంచుము:— -ఒడిపంచుము- పండిత రాజశతకము, 4 వ పుట చూడుడు. -అంక మొకింత గల్గని మహాత్ముఁడు వ్యాసమనీషిగారి ప్రయోగమునకుఁ గూడ నడ్డుగలదా! దీని కెనిమిది పుటలు శుద్ధపత్రికకూడఁ గలదు. శుద్ధప్రయోగము కాన వారందు దిద్దరైరి. మఱియు ప్రౌఢవ్యా 76 వ పుట 16 వ సూ. కూడఁ జూడుఁడు

పరాత్పరా:— ఇది దుష్టముకాదు. సంస్కృతజ్ఞానహీనులు దుష్టమందురు. శ్రీతారానాథతర్కవాచస్పతికృతవాచస్పత్యము చూచి అలుక్సమాస మని తెలిసికొని ఆయనకును మన -అంక మొకింత గల్గని-వారికిని గల తారతమ్యమునుగూర్చి చర్చింపుఁడు. చూచుకొను తెల్వి లేకగాని శబ్దరత్నా. లోనే

సమస్త పదముగా వ్రాయఁబడియున్నది. -స్ఫురచ్ఛరా పరాత్పరా -రుక్మిణీ పరిణ. 2 ఆ॥ -పరమాత్మా పరాత్పరః- (రామసహస్రనామములు.)

బ్రితిమాలు, - బతిమాలు:— రెండును సాధువులు శిష్టవ్యవహారసిద్ధములు, వ్యాకరణావిరుద్ధములు. తోలు, త్రోలు. పుచ్చు. ప్రుచ్చు లోనైనవానికన్న దీని తక్కువ యేమి! -సిద్ధిశ్లోకాద్వ్యాా- "బ్రితిమాలినను బయల్పడనీని" కవిరాజమనోరంజనము 5 ఆ, శబ్దరత్నాకరములో లేనంతన పోదు.

శతమునొక్కొమొగిన్:— సుతులయొక్క శతమని తాత్పర్యము. "క॥ దుర్యోధనాదియగు శతము జగ, ద్ద్రోహము఼ జంపెద" భార - సభా - ౨ ఆ" క॥... ఏకశత మ్ముదయించిరి సుతులు॥ భార - ఆది- 5 ఆ"

మున్కురమున:— తెలుఁగులో నిట్టిభావప్రధాన నిర్దేశములు కవిత్రయసమ్మతములే "సరసమాడి"- భార - శల్య - ౧ ఆ॥ త్రిలింగలక్షణశేషము ౧౨ పుట - ౧౨ సూ-రామలింగని, శ్రీనాథుని జూడుఁడు.

కోటి, పటలి:— ఈ రెండును నుండవచ్చును. "క॥ తురంగములమొత్తము... అంచపిండున్ బోలెన్॥ తే॥ గీ॥ అంశుజాలంబులు... కిరణతతులఁ జెలఁగి॥" భార - శల్య - ౧ ఆ॥

కురుకోటికురుటప్పటలిన్:— 'కురుట్' అను పదము ప్రకృతరసమున కుచితమని యెఱుఁగఁదగు. ప్రతాపరుద్రీయము ౨౨౨ పుట చూడుఁడు. యమకపోషకముగూడ నగుచున్నది. అప్రసిద్ధమును గాదు. "సీ॥ జూటీభవత్కురుటోకటీసమాశ్లిష్టధాటీవిహారంబు" యామినీపూర్ణతిలకా విలాసము - 3 ఆ॥

లేని సంతోషముతో:— హృదయమున లేని సంతోష మని తాత్పర్యము "లయగ్రా॥...తోఁచున్ । లేని కొమరుచందనము । లేని చెలువంబు నన్ ॥" కళాపూ - ౪ ఆ॥ ఇట స్వతస్సిద్ధముగా లేని దని తాత్పర్యము. ఇట్లప్రయత్నసిద్ధముగా నధ్యాహారము రాఁదగు .ప్రయోగముల సొబగు స్వహస్తపాకులవలనఁ జెఱియఁ బడదు. "సంతోషము నభినయించి" అని దిద్దినచోఁ 'లేని సంతోష' మను నర్థము రానేరదు. నాటకపాత్రముల కన్నియు నభినేయములే గాని స్వతస్సిద్ధములుగావు గదా! ఆయభినయించుటలో నియ్యెడ లేని సంతోషమును దెచ్చి పెట్టికొని నట్లుండవలె నని తాత్పర్యము. -లేనిమచ్చిక- పాండు- 3 ఆ॥

చాపకళాశ్వతమ్ము, గా నిలుచువార లంచు జగానఁగలరె:— ఇక్కడ

"అంచు చేర్చుటచే వచ్చుసొగసు మూర్ఖులకుఁ దెలియదు. 'అను' ధాతువు లేకున్నను గురుతుచుండఁగా నీప్రయోగములలో నెంతులకు వాడితో విజ్ఞులు తిలకింతురుగాక. "సీ॥ జలచరంబవనెద్ది, నీడ్రమాకననెద్ది, దాపననెద్ది తే॥గీ॥ ఇందుచరుఁడవ హరియన నేననంగఁ బ్రోపుగంటిమి" పాండురం- 5 ఆ. "తే॥గీ॥...కళాపూర్ణుడనఁగ నెవ్వఁడు" కళాపూ 1 ఆ. ఎన్నని చూపుదుము! లక్షోపలక్షలు. ఈస్థలముల సర్వత్ర 'అను' ధాతువు దీసివేసినను నన్వయమునకు భంగములేదు, కాని యున్నచో సొగ సెక్కు డని యెఱుఁగఁదగు.

ఎగిరిమీఁదఁబడి శపించును:—ఈవాక్యము కోపాతిశయమును దెల్పును.

కొంపతీత :—ఇది గొప్ప హానిని దెల్పు లోకోక్తి; ఇట్లే 'పుట్టిమునుక. లోనగునవియు నని యెఱుఁగునది. ఇంవలి మాటలు "పరిహాసపుమాట"లను వాఁడు పరమమూర్ఖుఁ డని విజ్ఞులు నిర్ణయింపఁగలరు.

వచ్చినవాఁడను రానేవచ్చినాను :— ఇట పిచ్చిశంక; 'రానేవచ్చెన్' 'పోనేపోను' "ఇత్యాదిరూపాణ్యపి సాధూని" అహోబల- 505 పుట.

మున్నరికంపు :— నిఘంటువులో వ్రాసినది 'మున్నరక'; దానికి ధైర్య మర్థము; లోకమున "పొగరు" అను నర్థమున వాడఁబడుచున్నది. మున్నరికము ధైర్యార్థకమైనచో నియ్యెడ సరిపడదు. గురుపదవాచ్యుఁడగు నన్నను పొగరుఁబోతు మాటలాడితి నని భీముఁడు పశ్చాత్తాపపడుచున్నాఁడు. ఇఁక కంపునుగూర్చి—ఈపద మర్థవత్తుగాఁ బ్రయోగించినప్పుడే గ్రంథకర్తల మతమున నర్థమున్నట్లు లేదు. అట్టిచో నిట నశ్లీల మెట్లు? రత్నాకరము చూ "ఆ॥ వె॥ కంపురూపు తెలుపుగలిగి ... పుష్పముల ... కై కొందురి నిర్జరులు" భార- అను- 4 ఆ 'ఉ॥ ...పువ్వువం గలుగు తోరపుఁగంపులు' పాండురం- 4 ఆ. మఱియుం జెక్కులు. అవి యటులుండుఁగాక. దుర్గంధ మను నర్థము భాసించినను బ్రకృత ముపయోగమే; నీచపుమాటలఁ దనయన్నయగు కర్ణుని దూషించితిఁగదా యని భీముఁ డుత్తముఁడు గానఁ బశ్చాత్తాపపడుచున్నాఁ డని స్వారస్యము తీయవచ్చును. గ్రుడ్డెద్దు చేన్నఁ బడినట్లు గీట్లుపెట్టుటయే కాని మూర్ఖుల కేస్వారస్యమును తెలియదు.

జెడిపోతి :— 'సీ॥ బొడ్డుపల్లెను గొడ్డేలి మోసపోతి' శ్రీనాథుఁడు. 'శా॥ శుంభద్వస్తువులెల్లఁ జూతునని పోచున్' కళాపూ- 4 ఆ. 'శా॥ కొంచుఁ

జోచున్నవాఁడో- కళాపూ 3 ఆ. సటీకాన్ధ్రశబ్దచింతామణి 98 పు 48 సూ.

మాయన్న యజాతశత్రుఁగనిన :— ద్వితీయకుఁ బ్రథమ విశేషణము కావచ్చును. -కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకును బ్రథమ చూపట్టెడి. ప్రౌఢవ్యా 50 పు 22 సూ. -చ॥ అహీనబలసారఘనుల్ మనుకైటభాది దైత్యపతులనెల్లఁ ద్రుళ్లడఁచె- నిర్వ 5 ఆ. విస్తరమందే చూడుఁడు.

ఎకసక్కెపుమాటల గేలిసేయ :— ఎకసక్కెము వేళు, గేలివేళు. శబ్దరత్నాకరములో ఎకసక్కెమున కర్థములు వ్రాసివ్రాసి -దీనికి దీని రూపాంతరములకును పరిహాసమర్థ మని కొందరు చెప్పుచున్నారు గాని కవుల ప్రయోగసరణినిబట్టి అది నిర్ధారణ చేయఁగూడలేదు- అని కంఠోక్తిగఁ దెల్పె.

నారదుఁ డొనరించె నను చు :— ఇయ్యెడ -లోకులనుకొనియెడినింద- అను వాక్య మధ్యాహార్య మగును. -గమ్యమానత్వా దప్రయోగః-

పాంచాలీపరిణయము :— సంస్కృతభారతమున -సమేత్య- అని యున్నది. అనఁగా -మీ సోదరులెల్ల- అని యర్థము వచ్చును. కుంతిహృదయమున దన కొలుగురు కొమరులు గలరనియే యుండును గాని యయిదుగురని యుండ నేరదు ముందు ముందుఁ గర్ణుఁడు పాండవులలోఁ జేరినను విప్రతిపత్తి లేకుండునట్లే యాపతివ్రత నోటినుండి యామాట వెలువడినది. కావుననే సర్వజ్ఞుఁడగు శ్రీకృష్ణుఁడు, -క॥ పాంచాలరాజపుత్రియు నంచితముగ నిన్నుఁ బొందు నాఱవ వరుసగ్- (భార- ఉద్యో- 4 ఆ) అని కర్ణునితోఁ జెప్ప సాహసించెను. కుంతీవాక్యము పంచపాండవులకే సమన్వయింపఁదగిన దైనచో శ్రీకృష్ణవాక్యము వ్యర్థముకాదా! ఇదిగాక నాటకములలో బాధలేనిపట్టున యథేచ్ఛగా మార్చికొనవచ్చును.

ముక్కు తెగబారెఁడు చేసితి :— ఈమాట కోపాతిశయమును సూచించెడి లోకోక్తి, -ముక్కు మూరెఁడు, కళ్ళు చేరెఁడును జేసినాఁడు-అను లోకవ్యవహార మెఱుఁగనివాండ్రకిది పల్లెటూళ్ళ పట్టుదలమాటయే -పండ్లు పటపటఁ గొఱుకుట, కన్నుల నిప్పులు రాల్చుట-లోనైనవి కోపసూచకము లని లోకజ్ఞు లెఱుఁగుదురు. లోకజ్ఞుఁడు కానివాఁడు కవిగాఁ దగఁ డనియేకదా నన్నయ్యభట్టు -లోకజ్ఞ- అని తనకు విశేషణము వేసికొనియె. -చ॥ కనలున నమ్మహోశ్వరుఁడు కన్నుల నిప్పులు రాలుచుండఁగ్- శాంతి 2 ఆ. వ॥ ...నీవు

రక మక్కూరి వగచుచున్నవాఁడవు- ఉద్యో ౨ ఆ. ఇది విచారమును దెల్పు లోకోక్తి. -క॥... ఆగతమునకును నోరుదెఱచి కడుఁగొరక- శాంతి 3 ఆ. ఇది దైన్యమును దెల్పు లోకోక్తి. -ఆ॥ వె॥... అనుచు నొయ్యఁ బలుకుచును జూపెఁ బ్రియు నొక్క, ముగుద కేల నోరు మూసికొనుచు- కళాపూ ౭ ఆ. ఇది వినయవిశిష్టమగు భయము నభినయించుటను దెల్పు లోకోక్తి. లోకమును విడిచినవాఁడు సర్వమును విడిచినవాఁడే, వాఁడు కవికాఁ డనుటకన్న మనుజుఁడే కాఁ డనుట యుక్తమని మా తాత్పర్యము.

అరణ్యమునకుఁ బదండు :— పదము పదఁడు 'ఏవం దేశ్యక్రియాను వర్ణాగమవైచిత్ర్య మగణేయం' అహోబల- 513 పుట 'చ॥ పదఁడని యిద్దఱుఁజా దొరిసి భద్ర' విజయవిలాసము- ౧ ఆ. 'మ॥ పదమా షట్పదమాలికా పరిలసత్సాక్షోఘనీ' భీమఖం ౪ ఆ. పెక్కులు కలవు. 'క॥ పదపదఁడంచు' నిర్వ-ఉ-రా, ౬ ఆ.

చిగురు :— ఈపదమునకు లోకవ్యవహారమువలన 'తుద' యను నర్థము సుగమము; లోకమున నీపదమున కీయర్థమున నేప్రాంతమునను వాడుకయే లేనిచో మాకుమాత్ర మెక్కడనుండి వచ్చెడిని! 'చివర' అని వ్రాయలేక 'చిగు' రనలేదు. 'కంగుల్ దీర్చిన పైతిణీరయిక' వలెనే యిది లోకమువలనఁ దెలియఁదగినది. 'చిగురు, 'చివర, అను నర్థ మొసఁగదేని. "కఠినము" అను నది -కష్టము- అను నర్థమును -లేఁత- అనునది -అల్పుఁడు- అను నర్థమును నీయఁగలవా? -తే॥ గీ॥ అతని కాహార మొనరఁ జేసికొనుట కఠినమై చెల్లుచుండ- భార. అశ్వమేధ. 4 ఆ. -చ॥... నమఁ గనలేని లేఁతలకు- పాండురంగ 4 ఆ. -లేఁతలు- అల్పులు, అని వ్యాఖ్యాత వ్రాసెను. ఈ లేఁతపద మెట శక్తమో, ఎట లాక్షణికమో విజ్ఞులకుఁగాని గోచరింపదు అట్లే -చిగురు- పల్లవమునందు శక్తము; -చివర- అనుచో లాక్షణికము. ఇంత వఱకెందుకు, -దిక్కు- అను పదమునకు, -శరణము- అని శబ్దరత్నాకరములో వ్రాసెను. దీనికి సంస్కృతమున నీయర్థము కలదా! అతని వ్రాఁత లోకవ్యవహారమును బట్టియే బ్రతుకఁదగినది. శక్తిగ్రహోపకరణములలో దేశభాషల విషయమున నన్నిటికన్నను లోకవ్యవహారము ముఖ్యమని యెఱుఁగఁ దగు. లోకములో వాడుక లేనిచో లక్షణ చెప్పుట యయుక్తముగాని, యున్న

దానికిఁ జెప్పుట యయుక్తముగాదు. విస్తరము ప్రాజ్ఞులవలనఁ దెలియఁదగు.

అడరు :— (సంకటము) -తే॥ గీ॥ ... అట్టి, యడరువ జయింతుమని కదా యద్దినాళి- ఆముక్తమాల్యద- 5 ఆ. అట్టియడరున- అట్టి సంకటమున- అని వ్యాఖ్యాత వ్రాసెను. భారతమున శాంతి పర్వమునఁ గలదుగాని యితరేచల నిన్న మొన్న కాఁబోలు దెలిసియుఁ దెలియనివారు శబ్దరత్నాకరములో లేదను హేతువున దిద్దిరి. లక్ష్మీనారాయణీయము చూడుఁడు. ఇందునకుఁ గవిత్రియములో నొకఁడగు నెఱ్ఱాప్రగ్గడ హరివంశము ౭ వ ఆ.- మున నిటవేల యతిస్థానమున దొరకిన ప్రయోగము తే॥ గీ॥ -ముప్పునకు నోమదయ్యెనె ముగ్ధ యీయ, శోద నందగోపున కుగ్రశోక జలధి, యీఁదఁ గొలఁది గాదయ్యెనే యిట్టిదైన, (యడరు) పెట్టెనె పెన్నిధియనుఁగు బిడ్డ-

కానీ:— ఇందలి -ఈ- స్వరయతికిఁ బనికివచ్చెడిని. -మ॥ ఎనయంగల్గిన కూర్మిభృంగిరిటిఁగా నీ, తండుఁ గానీ నికుంభునిఁగానీ- భీమ ఖం ౧ ఆ॥

వగచి కార్యము లేదు:— వగచి, అనఁగా వగచుటచేత అని యర్థము. -ఒక్కొకచో భూతార్థకాసమాపకక్రియ హేత్వర్థకంబును నగు, ప్రౌఢవ్యా- ౨౫ పుట ౧౫ సూ. -ఉ॥ రాహుకంఠము దెగి దేహము ధరణిఁబడియె- భార ఆది-౨ ఆ॥ తెగి - తెగుటచే అని అర్థము. ప్రయోగములు వేనవేలు.

దాపరించి:— (ప్రాప్తించి) శబ్దరత్నాకరము తిరిగియుఁ గనులు బాగుగఁ దెఱచి చూడఁదగు. నిఘంటువునేనిఁ దిన్నఁగాఁజూచు తెల్వితేటలు లేని దేవయ్యల కింత శిరోభారమెందులకో చదువరులే పరిశీలింతురుగాక.

పినాసి:— ఇట ననుకరణము కలదు. లేకపోవుఁగాక. ఇది లుబ్ధునింగుఱించి వాడెడి దేశ్యపదము; అపశబ్దమనుటకుఁ దగినయాధారము లవమును లేదు, లేదు. దేశ్యము లన్నియు నపశబ్దములైనచో నిది యపశబ్దమగునని యొప్పుఁగునది.

అమ్మయ్యా:— ఇది అనాకరమని, శబ్దర- వలనఁ దెలినందేలుఁగాక. -లోకోక్తీనాం భవేద్యోగో యది స్యాచ్ఛ్రుతిరంజనం అయోలక్క- ఇత్యాద్యా లోకోక్తయః-అహోబలపం - 362 పుట. శబ్దరత్నాకరమే సర్వమునకు దిక్కగునేని మన వేసులవారి -అబ్బ- ప్రయోగపరంపర యెట్లు బ్రదుకును. అనర్ఘరాఘవము- ౯౮ పుటయు మఱికొన్ని పుటలును జూడఁదగు.

ఆదిగా:— ఆదిగా, అని అర్థము. శా॥...విపంచి నిన్న మొదలు నీన్న

వంబమింజేసి- మనుచ ౩ - ఆ॥- శా॥ ఓ లీలావతులార నేఁడు మొదలే యొ
య్యారి- ఉత్తరరామాయణ - ౧ - ఆ- పెక్కులు కలవు. క॥.............
చనుదెంచె నయోధ్యనుండి సరి నిందులకున్, భార- అర ౨ ఆ- సరిన్
- సరిగన్ - అని యర్థము. మఱియు నన్నయ్య విట్టివి పెక్కులు.

లేసేలేఁడు:— ఆశ లేసేలేదు (ప్రతాపరుద్రీయము. ౨ వ అంకము)

పిల్చినావు:— -క॥ బన్నమువడి నొచ్చినారు- భార - అర- ౫ ఆ॥
చ॥ జననమునొందినారరు - అరణ్య - ౪ - ఆ॥ -మెత్తినాఁడు - లోనైనవి.
మనుచ, ౪. ఆ॥ వీని నిటు లుంతము, -గెలిచినాము, చేరినాము- లోనగు -అంక
మొకింత గల్గిన మహాత్ముల- యనర్ఘ రాఘవములోని ప్రయోగములనేనిఁజూడక
-నిక్క-నాముజాతి- యని వదరినందులకుఁ గోటిఫలీగోదావరీస్నాన మొనర్చుట
తక్క నిష్కృతిలేదు.

భూమిపశ్రిజలంవఱున్ :— భూమి- ప్రిజలు ఈ రెండును నుండుట
భారతసమ్మతమే. -చ॥... సమస్త ధారుణీప్రజఁ బ్రోచుచున్॥ భార-ఆది-
౭ ఆ॥ భారతమునిండ నివియే. ఇఁక -అందఱునున్- అనుచో సముచ్చయ
ద్వయ మనుకొనుట బుద్ధిపొరపాటు. బాలవ్యా-సంధి ౨౧ సూ. చూడుఁడు
అవియునుంగాక -దివంబునుంబోలె- లోనగు నుదాహరణములు పెక్కులు.

విశాంపతులు :— ఇది అలుక్సమాసము (1) వాచస్పత్యము, (2) మా
హేశ్వరీయము, (3) సుధ లోనగు నుద్గ్రంథములును శ్రీమాన్ మాడభూషి
వెంకటాచార్యులవారు అల్లమరాజ సుబ్రహ్మణ్య కవిగారి యాక్షేపణ కొసఁ
గిన ప్రత్యుత్తరమునుజూచి, ఈ క్రింది ప్రయోగములు చూడఁదగు. -ఉ॥...
అపాంనిధిఁ గన్గొనిరి- రసికజన మనోభిరాము ౬ ఆ॥ -క॥... మూడునాళ్ల
వాంపతి వేఁడెన్.- ఉత్తరరా- ౧ -ఆ॥ -క॥ ... వారాన్నిధు లేను దాఁటి
పొండురం ౧ ఆ. -క॥ ... తలఁతున్ మధ్వాంశాచార్యున్ దిరుమల శ్రియః
పతి గురునిన్ -పంచతంత్రము ౧ ఆ॥ -తత్పురుషేకృతి- అనుసూత్రమున
నున్న బహుళగ్రహణ మాయాప్రయోగముల కుజ్జీవకమని సుభోధినీకారకుఁడు
స్పష్టపఱచె -విశాంపతిర్విష్టరభాజమారాత్- అను కాళిదాసప్రయోగముకూడ
నలుక్కనియే వాచస్పత్యాదులసరణి తెల్పుచున్నది. తిట్టఁదలంచుకొన్నచో
దప్ప -విట్పతి- యని రాజునుగూర్చి యెవ్వఁడును వాడఁ డని యెఱుఁ

గఁదగు. మఱియు - ఇది చేమకూర వెంకన్న శిరసావహించు ప్రయోగము- అని తూలనాడియున్నారు. అది సాధువు కాదా! ఈపంక్తులు చదివికొనుఁడు. -అతయేవ రామాభ్యుదయే, -ఉ॥అప్పుల నీవ నేర్తువరయంగ- నిత్యాదిపద్యే, కర్తు మకర్తు మన్యథాకర్తు ముదారశక్తి మిత్యుక్తం, అహోబల 169 పుట. మఱియు, ప్రౌఢవ్యా 5 పుట, 15 సూ. చూడుఁడు. ఓట్టికొంచెము గూఁత ఘనమును గాఁదగదు.

మీరలుండిరి:— ఇది భవచ్ఛబ్దార్థకము, కావునఁ బ్రథమపురుషయోగము తప్పులేదు. గౌరవద్యోతకము, బహువచనమునకు ఫలాంతరముండుటచే తావన్మాత్రముచేఁ దృప్తిచాలక ప్రథమపురుషము వివక్షచేయఁబడినది. -అనుక్తమన్యతో గ్రాహ్యం- పాణినీయము చూడుఁడు. తఱుచు పాణిన్యనుసరణ మాంధ్రవ్యాకరణమునకుఁ గలదని విజ్ఞులెఱుఁగుదురు. -నీవు- అనుచో నీవిధి చెల్లదు. దానియందు గౌరవద్యోతకత్వ మప్రసిద్ధమని యెఱుఁగునది.

మానిసులు :— ఇది తద్భవము, ఇమపోత్తమసూత్రము దేశ్యములయందుఁ దఱచు ప్రవర్తించును. అందలి యుదాహరణము లాయీ సూత్రాంశము లను బోధించెడిని. అహోబల 419 పుట చూడుఁడు. ఈసూత్రప్రవృత్తి ప్రాయికము. ఇందుకు కవిజనాంజనము చూడుఁడు. ఇది సూరియును సూచించినదే. ఏమైనను నిప్పట్ల సూరిగారి మతము సుంత చింత్యము. మీరు ఇమపోత్తమసూత్రము నెత్తితిరి గానఁ దన్మూలముననే సూత్రిపాయమగు ప్రత్యుత్తరమీఁబడియె. సూరిగారిమత మేల చింత్యమో దెల్పుట అంత ప్రస్తుతము గానిశాఖాచంక్రమణమునకు దిగలేదు. "ఉ...కలరుగా మఱి మానిసిబోలు మానిసుల్" విజయవి- 3- ఆ, ప్రాచీన ప్రతులు చూడుఁడు. ఇటీవలివా రిదియేకాకయనేక స్థలముల "మానుసులు" అని దిద్దఁజొచ్చిరి. అవి సూరిగారి వికృతిపదవ్యాఖ్యానుసారములని యెఱుఁగఁదగు. ప్రాజ్ఞులకొఱ కింతవఱకు వ్రాసితిమి కానిమాకు "అంక మొకింతకల్గనివారి" మురారి 129 వ పుట లోని 'పోణిములకు' అనునదియే చాలును. ఈప్రయోగము సర్వమతదూష్యమగుటచేఁ దప్పు. ఈ తప్పుచే నొప్పును సమర్థించుట మాకెందులకు. ఈ "పోఁడిమి" అహోబలపతిచేఁ బరిగణితమని యెఱిఁగి విస్తరము కావలసినచోఁ బ్రశ్నింతురుగాక.

కొదువ:— ఇది ఉకారమధ్యముగా శబ్దరత్నాకరమున లేదని తప్పనుట

యుక్తముకాదు. 'కు॥...నీకుఁ బాదుషా। గామి యదంతగాఁ గొదువగాదు.
“ఆ॥ వె॥...కూర్చువాఁడొకండె కొదువగాని” ప్రతాపరుద్రీయము 7 అంకము.
ఇట్లు వీరు పలుచోట్ల నుకారమన్యముగా న గ్రామ్యపాత్రోక్తులలో వాడియు
న్నారు. శుద్ధపత్రికలో దిద్దకుంటకూడ వీరి కిది సమ్మతమని తెల్పుచున్నది.
మఱియుఁ గళాపూర్ణోదయాదులలో నెల్ల నిట్లే యున్నది. ప్రాచీనప్రతులు
చూడఁదగు.

మరల నడుగుచున్నాడను:— అనుచో నర్ధబిందువు నెకటి ముద్రణ
మునఁ బొరపడినది దానిం బుచ్చుకొని “వాఁడు అనుచోఁ బక్క నిట్టి భాష
భేదముల నర సున్నయుండు నని కవి యెఱుంగఁడు” అని చెడవెక్కిరించిరి.
అరసున్నలుకలవి, 2-3 పుటలలో 4 ను, తక్కిన యావన్నాటకమునందును
వెదకిన 88 యును వెరసి 92 ఉన్నవి ఇట్టుండ నట్లేల వెక్కిరించిరో పరికిం
పుఁడు ఇట్లే అనర్ఘరాఘవపండితరాజశతకములను విమర్శించిన వానిగతి యేమ
గునో యోజింపుఁడు. 4 “వాక” లలో నర సున్నలు వేయలేదు. పైచు, తేడు
కోతి, మునిగి, తలపు, ఆమెడలంతే, తోలిజాలెడిన్, చక్కదనము, ఇంకను
మఱికొన్నియును నరసున్నలు లేనివి కలవు. ఇదుకొనెఁడు అలరఁవినంగ, నోర్లఁ
నెఱ,సంస్కృతపుఁబాగు, కృష్ణుఁగిత, నన్నఁగేలి, తొలఁకాడెఁడు, లోనగు
పెక్కుచోట్ల ననవసరముగా నరసున్నలు పడినవి. 'ఆచార్యాల్ ప్రియంబంపి'
లోనగుచోట్ల వృథాగా సరళాదేశమున్నది. 7 ప్రయోగములకన్న నధికముగ
-వృథా- యని చతుర్థవర్ణమును వాడిరి ఇట్టి వింకను ననేకములు కలవు. ఇవి
యన్నియును నంక మొకింత కల్గిని (వ్యాసుల) వారివే యనుకొను చెల్లు
నుందురా!

హుళక్కి:— హుళిక్కికి రూపాంతరము. (శబ్దార్థచంద్రిక)

నరుఁ డీతని వధియింపఁగ, హరశిష్యుండైన జామదగ్న్యునికన్నన్:—
అప్రాజ్ఞులిట యతిపోయిన దందురు. ఆ॥ వె॥ ... జమ, దగ్ని తనయ రాఘవాదు
లైన” శాంతి - ౬ ఆ.

విష్ణుపాదోద్భవి :— శ్లో॥ -విష్ణుపాదోద్భవీం గంగాం- సంప్రదాయ
సిద్ధమగు వైదికపాఠ మిట్లున్నది, విష్ణుపదీశబ్దమునకు బలె జీషు నులభము
గౌరాదిరాకృతిగణః. సర్వజ్ఞా సర్వజ్ఞీ అను చోటం బలెనిట, ఆ ఈ ప్రత్య

యములు రెండును సాధువులు. -శ్లో॥ సర్వార్థమాగధీం సర్వభాషాను పరి ణామినీం సర్వదాం సర్వతోవాచం సర్వజ్ఞీం ప్రణిదధ్మహే- కావ్యాను శాసనము ౨ పుట. ఇట -సర్వజ్ఞస్య, భార్యా, అని చెప్పి -పుంయోగాత్, అని జీషు చేసినచో సర్వజ్ఞత్వము పతియందు సంక్రమింప వలసివచ్చును గాన -గౌరాది, జీషు చెప్పి తీరవలె నని యెఱుంగునది. ఇంతకన్న విష్ణుపాదోద్భవి, కడు సుగమము. -విష్ణుపది- యును, వైదిక పాఠమును దానికి మార్గప్రదర్శకములు; విష్ణోః, పదం స్థానం, యస్యాః, అని సుధాకారకుఁడు విగ్రహము వ్రాసి -గౌరాది, జీషు చెప్పెనని యెఱుంగునది. ప్రకృతము, ఉద్భవత్యస్మాదితి ఉద్భవః, విష్ణుపాదః ఉద్భవః యస్యాస్సా.

విదురుని జన్మము :— వ్యాసుఁడు విదుర వృత్తాంతమును జెప్పుటకు బీజమిది. పై విదురవాక్యముచేతఁ గొంతయు, గంగావాక్యముచేతఁ గొంతయు విదురజన్మ వృత్తాంతము సూచితమైనది. అందు విదురవాక్యములోఁ దనజన్మమును గూర్చి విదురుఁ డేవగించుకొనుట ధ్వనితమగుచున్నది; దానిచే నందులకుఁ గారణమగు వ్యాసుఁడు—ఆలోపము నాదిగాదనియు, నిందులకిట్టి యితిహాసము కలదనియు, నీవు దాసీపుత్రుండవైనను బరమోత్తముఁగుడ యమునియంశముచే జనించిన వాఁడవనియు—సూత్రప్రాయముగాఁ జెప్పి యతని నోదార్చెనని యెఱుఁగునది, ఈమాత్రము పూర్వోత్తర సందర్భము తెలుఁగని నాటకులకు విమర్శనము లెందుకో! శాంతం పాపం.

చతుర్థాంకాంతమున శ్రీకృష్ణవాక్య మసందర్భముగా నున్నదఁట :— ఆహా ! మూర్ఖత ! శ్రీకృష్ణాదులు భాగీరథికి స్నానార్థ మరుగుచుండఁగాఁ ద్రోవలో స్త్రీరూపధారిణియగు గంగ కన్పట్టెను; గంగ వచ్చుటచే ధర్మరాజాదుల ప్రయాణమునకు నంత విఘ్నము కల్గినది; కొంతసేపచ్చటనే నిల్చిపోయిరి; పదపడి గంగ పుత్రుని గడసారి చూచుటకని వెళ్ళిపోయెను; పిమ్మట శ్రీకృష్ణుఁడు ప్రకృతవాక్యమును బల్కెను. ఇటఁ బ్రాజ్ఞులకు శంకయే లేదు; జైనయ్యలకో, బ్రతుకెల్ల శంకయేకదా ! వీరి తాత్పర్య మిది. గంగ యిక్కడనే యుండఁగా వీరు గంగకడకేగి స్నాన మెచ్చటఁ జేసెదరని. ఈయంశము గంగాశంతనుసమాగమఘట్టము చదివికొన్నచోఁ దీరును. స్త్రీరూపధారిణియై గంగ చిరకాలము శంతనునింటఁ గాపుర మొనర్చి యతని కెనమంద్రు.

బిడ్డలను గనియెను. అంతకాలమును జలరూపిణి యగు గంగ లేదనియే భావించు మూర్ఖులును గలరా! ఇట్లే రామునికి సముద్రుఁడు, ఆంజనేయునికి మైనాకుఁడు మనుష్యరూపమునఁ బ్రత్యక్షమైనట్లు రామాయణమునఁ గలదు; ఆయాస్థలముల నెల్ల నిట్టి పిచ్చి కుచ్చితపు శంకల నొనర్పఁదలసిన దేయగునా! విస్తరమందం ముఁ జూడఁదగు.

మరుత్తు, మరుత్తుఁ (డు) :— ఉభయమునుగలదు. -వృద్ధాదిరాక్షతి గణః- కావుననే -నారాయణభట్టు- భార- ౧ ఆ. లోనైన ప్రయోగములు సిద్ధించెడిని. -మరుత్తు- కు బురాణనామచంద్రికకూడఁ జూడుఁడు.

మరుద్వృధాపాలుఁడు :— మరు + ద్వృధాపాలుఁడు, అనుకొని దేవయ్యలు వెక్కిరించిరి. మరుద్వృధా + పాలుఁడు, అని తెలిసికొందురుగాక. అనఁగా దేవభూమియగు ముంజవత్పర్వతమును పాలించెడి సాంబమూర్తియని యర్థము. -వ॥ హిమవంతంబు నుత్తరభాగమ్మున ముంజవంతంబను పర్వతము గలదు; అందు శివుండు శివాసహాయుఁడై సురసిద్ధగరుడగంధర్వాది సమస్తజాతులును సేవింప విహరించుచుండు. భార- అశ్వ-౧ ఆ. ఆభాగమంతయుఁ జక్కఁగాఁ బరికించికొన్నచో నాద్రవ్యమునకు మొదటిస్వామి శంకరుఁ డనియుఁ, రెండటిస్వామి మరుత్తుఁ డనియుఁ, గడపటిస్వాములు ఋత్విక్కు లనియుఁ దేలును. శివుని మరుద్వృధాపాలశబ్దముచే వ్యవహరించుట సాభిప్రాయమని యప్పు డెఱుకపడును.

అవుల :— దీనిని, అవల, అను నర్థమున భారతాది గ్రంథములందు వాడి యున్నారు. వ్రాఁత పొరపాటుకాని అచ్చుపొరపాటుకాని కాదు. నిన్న మొన్న నచ్చైన ప్రతులయందును గానవచ్చుచున్నవి. -సత్యాదులవుల, శాంతి ౫ ఆ -అవులఁబడి- అవతలబడి- 1912 సం॥ 8 ఫారము నోట్సు. శబ్దరత్నాకరములో వ్రాయలేదని దేవయ్యలు వెక్కిరించిరి. పాపము! దాని పీఠికలోఁ బ్రయోగమున్న దని యెఱుఁగరు. -వ్యవహారమాత్రోపయుక్తంబులైయుండి యవులఁ గ్రమక్రమంబున వృద్ధిబొంది- viiiవ పుట.

బందులు, బందువులు :— ఈ రెండును బంధుశబ్దతద్భవరూపములు, వుగాగమము బహుళమగుటచే రూపద్వయసిద్ధి సుగమ మని యెఱుఁగునది. బాలవ్యా- తత్సమపరి- ౪౬ సూ. చూచి, దాని వ్యాఖ్యానముకూడఁ జూడుఁడు.

బాలకుఁడవయ్యు మెచ్చంగవచ్చు నిన్ను :— నీవు బాలకుఁడవు అయ్యుఁ బినను, నిన్ను మెచ్చంగవచ్చుఁ, అని అన్వయము; అసందర్భ మనుట తెలివితక్కువ. -క॥ నీయడిగిన యర్థాభి, ప్రాయములకు నుత్తరంబు పరువడిఁ జెప్పఁ, ధీయుత! బ్రాహ్మణులకుఁ గా, కాయతమతులయ్యు, నొరుఁ కవి విషయములే, అయ్యుఁ - ఐనను, అనియర్థము. ఇట్టివి పెక్కులు.

బాలకుఁడ నంచునన్నేల గేలిచేసె :— నేను బాలకుఁడను, అంచుఁ (నీమదిలో నూహించి) అని సమన్వయించు కొనఁదగు, ప్రౌఢకవిత్వమార్గ మెఱుఁగని వాండ్ర కేయన్వయమును దెలియదు. తే॥ గీ॥ అతివ యీగర్భ మెవ్వరికైతి చెప్రుమ॥ కాశీఖం—౪ ఆ॥ ఇయ్యెడ, 'ఎవ్వరికయ్యెఁ' అని యున్నంగాని మీకుం గుదురదు. క... ప్రొద్దుజామెక్కుటయుఁ, భార- కృతఘ్నోపాఖ్యానము. ఇటఁ బ్రొద్దేమిటి, జామేమిటి, ఎక్కుటేమిటి, అని శంకింతురు కాఁబోలు! క॥ ... అయ్యిర్గురు నొక్కొక భూమిపతులగుదు రుజ్జ్వలులై॥ ఉత్తర రా- ౯ ఆ॥ ఇట, ఆఱుగు రొక్కొక భూమిపతు లేమిటి అందురు కాఁబోలు! ఆ॥ వె॥- నిన్ను నధముండగుట మును తపః ప్రభావమున నెఱింగియు, ఉత్తరరా- ౫ ఆ॥ ఇట నిన్ననకు నీవుండవలెనని యందురు కాఁబోలును! ప్రయోగవైచిత్ర్యము తెలుఁగుట పైపైని లేదు.

తాత తండ్రులు :— ఇట 'దండ్రులు' అని యుండవలెనని కృతఘ్నుల యాశయము; అజ్ఞానము తప్పు. చూడుఁడు, "తే॥గీ॥ తాతముత్తాత తండ్రుల తరతరంబు- పాండురంగ- ౩ ఆ॥ దిద్దుదురు కాఁబోలును! కొన్నియెడల ద్వంద్వంబునం బదంబు మీఁది చతపలకు సదవలుగానంబడవు. 'అప్పచెల్లెం డ్రు' నిర్వ- ౩ ఆ॥ "కండతుండెములు" రామా- ౧ ఆ॥ రాక పోకలు, భాగ- ౧౦ స్కం. ప్రౌఢవ్యా- ౭ పుట ౬ సూ. చూడుఁడు.

అవిగో, అదుగో, అడుగో, అరుగో, ఇగో, ఇదిగో, ఇదుగో, ఇడుగో, ఇరుగో :— ఇత్యాదులు దేశ్యములు, కళలు, ప్రతిపదోక్తావ్యయములు. ఈ యంశమునకు అహోబల. 496 పుటయు సంగ్రహవ్యా- 38 పుటయుఁ జూడుఁడు. ఉత్వఘటిత రూపసత్తకు శబ్దార్థచంద్రిక చూడుఁడు. అడుగో, ఇడుగో లకు వాఁడుగో, వీఁడుగో, అని పిల్లలమఱ్ఱి వీరభద్రుఁడు వాడెనుగాని, ఆ ప్రయోగములు కర్ణకఠోరములగుటయేకాక బాగుగవిచారించినచో శాస్త్రీయ

ములుగూడఁ గాఁజాలవు. ‘గో’ అనునది ద్రుతాంతావ్యయమనియు -గో- అనునది దాని రూపాంతరమనియు, శ-ర-లో వ్రాసెను; అది అహోబలుని మతమునకు విరుద్ధము. పైఁగా -రాముఁడుగో- -కృష్ణుఁడుగో- ఇత్యాది ప్రయోగములను గూడఁ దెచ్చిపెట్టిన భాషకు వైరూప్యము నాపాదించును గాన నంతకన్న ప్రతిపవోక్త పక్షమేమంచిది. బంగారులో -గారు- గౌరవార్థక మనుకొన్నట్లే, ఇందు సర్వనామశబ్ద మున్నదనుకొనుట విచార దూరము. -ఇగో- అను దానికి దేశ్యత్వ మొప్పిన శబ్దరత్నాకర కారకుఁడు తక్కినవాని కొప్పకుండుట యక్కజము. -ప్రవాహినీ దేశ్యా- ఇవి యే పియు భారతకాలమునకు గ్రంథస్థములుగాఁ గన్పట్టవు. క్రమముగాఁ జేర మొదలిడినవి. ద్రుతప్రకృతికములు గానిచోఁ గళా పూర్ణోదయ ప్రయోగము కుకుర దని యొక వాదము రావచ్చును. అది ద్రుతోపజీవిత్వమువలనఁ గుదు రును. ఈయంశమునకు అహోబల, 358 పుట చూడఁదగు. శ్రుతిరంజకతం బట్టి ద్రుతము చేరును, లేనిచో మానును; ఇది సంగ్రహముగా వ్రాసిన ప్రత్యు త్తరము. ఈరహస్యమును నెఱుఁగని వారు దీనిని ద్రుతాంతమని భ్రమపడు దురు. అయినచో -మిక్కిలి- -అప్పుడు- లోనైనవి కూడ వారికి ద్రుతాం తములే కావలసివచ్చును. ఈద్రుతోపజీవిత్వముకూడ దీనికి హ్రస్వరూపస్థితిలో లేదు. ఆ యీ యంశములు దీర్ఘదర్శిత్వము కలవారు విచారింతురుగాక.

ఇయ్యది వినోదముగా నొకరిశక్తి యొకరు పరీక్షించుకొనుట కేర్పడినది:— ఇయ్యెడ స్వప్నములో నంతస్స్వప్నమువలె దేవయ్యల తెల్వితక్కువ వ్యాకరణ పాండిత్యములో మఱియొక తెల్వితక్కువ వచ్చి ప్రవేశించినది. ఈ వాక్యము నందు సంఖ్యావాచకము కాదుగదా సంఖ్యేయవాచకమగు -ఒకరు- గూడ లేదు. అన్యోన్యశక్తి పరీక్షణ మొనర్చుకొనుచున్నారని వాక్యార్థము. -సీ॥ ఒకరితో నొకరు దెల్పక యథాయథలయి- ఉత్తరరా - 4 ఆ॥ -ఏకేముఖ్యాన్యకేవలాః- -ఈజరుగుచున్నయదియో, అన్నగారి కొకరికి సరిదురము- అంక మొక్కింతకల్గ నివారి అనర్ఘరాఘవ నాటకము 91 పుట, 5, 6 పంక్తులు చూడుఁడు.

ఇక్కడికిన్, అక్కడికిన్:— ఇత్యఘటిత రూపములును సాధువులే. -సీ॥ నీవెక్కడి కేగె దనుడు- -ఉ॥ ఎక్కడినుండి వచ్చె- మార్కండేయ-౧,౩౫ ఆ॥, గ్రంథవిస్తర భీతిచే -అంక మొకింతకల్గనివారు సంస్కరించిన పాత్రము

నుండి మాత్రముదాహరించితిమి. మఱియు నీప్రయోగములకుఁ జిన్నయ్యసూరి స్వయముగా సంస్కరించి ముద్రింపించిన నీతిచం - 10, 18, 23, 25, 31, 34, 41, 45, 47, 106, 114 పుటలును, నీలాసుందరి పరిణయము 40 పుటయుఁ జూడుఁడు. ఇతరత్ర కల ప్రయోగములకు మితియేలేదు. -ఎక్కడికిఁబోయెదరు- శుకసప్తతిసారము, 12 పుట. ఇది నిరాతంక శాస్త్రిలవారిది.

ఇద్దఱితోఁడను :— ఈరూపమునందలి యిత్వమేమి. అందఱికిఁ, కొందఱికిఁ, ఎందఱికిఁ, లోనగు స్థలములయందలి యిత్వమేమి మాబాలురకుఁ దప్పని కొందఱు వృద్ధులు బోధించిరి. ఆవృద్ధులకు నుంకర రంగయ్యగారి గూఢార్థప్రకాశిక ప్రేరకము. ఆరంగయ్యగారికిఁ జిన్నయ్యసూరిగారి ప్రయోగమాధారము. ఈయంశము గూఢార్థప్రకాశిక 124 పుట చూచిన విస్పష్టమగును. -వజ్రం వజ్రేణ భిద్యతే- కనుక సూరిగారి ప్రవృత్తిచేతనే దానిని ఖండింపవలెను. నీలాసుందరీపరిణయము 34, 54 పుటలలో నాలుగేసియు 53 లో నొకటియు వెరసి 9 ప్రయోగము లున్నవి. పొరపాట్లందమా ! ముఖపత్రమందిటు లున్నది. -ప, చిన్నయ్యసూరిచే వ్రాఁత తప్పులవలనఁ దొలఁగింపఁబడి- ౧౮౬౨సం॥ ఏప్రిల్ ౨౪వ తేదీని నచ్చైన పుస్తకము చూడుఁడు. ఆదినములయందే అచ్చే అచ్చయిన చిన్నయ్యసూరి నీతిచం, 18 పుట లోనయినవి కూడఁ జూడుఁడు. మఱియు నీయిత్వము ప్రౌఢవ్యాకరణకర్తకును సమ్మతమే త్రిలింగలక్షణశే 33 పు, 90 సూ లో, నీయంశము ధ్వనితము కావుననే యితఁడు శబ్దరత్నాకరము 393 పుటలో -అంపఱికి, అని వ్రాసెను. ప్రాచీనములైన భారతాదులలోనున్న యీప్రయోగములకు మితియేలేదు. 1901 సం॥ అచ్చైన భారతమునఁ గూడఁ గానవచ్చుచునేయున్నది. -క॥...అందఱిలో నొక్కనిఁ గోరుము- మహాప్రస్థానికపర్వము. ఇది కం, వీ; రా, న, శా; గార్లు దిద్దినది, -ఉ॥ అందఱిలోనఁ బెంపును- ఉత్తరరా ర ఆ -ఇది 1910 సం॥- వేదలువాడ సుందరరామశాస్త్రిలవారు దిద్దిప్రచురించినది. దిఙ్మాత్రముదాహరింపఁబడియె. నిరాధారపువ్రాఁతయు నిన్నమొన్నటి సామాన్యపు వ్రాతయు నిండఱి కజ్ఞత నాపాదింపనేరదు గాన దానిం ద్యజించితీరవలయును.

ఏడ్గురఁట :— ఇట, వెనుకటి ముద్రణమున -ఏడ్గురు- అనుటకు బదులు -ఏగురు- అని డకారవిహీనముగాఁ బడినది; దానిపై వసువు లెవమందుప్రి

అనియు, ఏగురు అను శబ్దమునకు ఏడుగురు అను నర్థము రాదనియు బోధించిరి. ఈయంశము మేము వీరివలననే తెలిసికొనుట నిక్కమైనను లోకము విశ్వసింపదు. పైఁగా నింతకుమున్నె చెప్పిన మా గ్రంథములొప్పవు. - తే॥గీ॥ అష్టవసువులుగూడ భార్యాసమేతులగుచు- మా దేవీభాగవతము 2 స్కం. ఇంకను మాశిష్యులు వాడింపఁ గలరు. -అష్టశబ్దమునకు, తి॥ వెం॥ కవుల కర్థము తెలియదు ఊరక సంస్కృతపదమును మక్కికి మక్కిగా మార్చి- రన మొదలిడుదురు. వాంధ్ర కేమి సాగదా! చీవాట్లిడువారు లేరుగదా! -లజ్జా మేకాం పరిత్యజ్య త్రిలోకీవిజయీభవేత్.

క్షమాపణ:— ఇది నింద్యగ్రామ్యమఁట! ఔరా తెలివి! శ్లో॥ క్షమాపయసి చే న్మాంత్వం కురు మే వచనం నృప- దేవీభా ౬ స్కం ౧౯ శ్లోకము చూచి బుద్ధిగల్గి మసలునది.

సహాయము :— ఇది ధర్మపరముగాఁ బ్రయోగించినది యని గీటు పెట్టినారు. అట్లు ప్రయోగించినను దప్పు లేదు. నిజమున కిట ధర్మివాచకమే కాని ధర్మవాచకము కాదు. సహాయము తోడు, అని అర్థము. గీటువెట్టుట తెల్వితక్కువ. -వాలిసహాయమునకు- అవర్ష 2 అం. ఇది ధర్మపరమే యని తెలియఁదగు. -క॥నినుఁ జెప్పగాఁగఁ గైకొని, మనోరథపయోధి యేను మానిని గడవన్, గని చరితార్థత నొందుదు, ననితలఁచెద నీ(సహాయ) మల్పమె యెందున్ - హరివం- ఉత్తరభా-7ఆ. ఇట సహాయము ధర్మపరముగాకతప్పదు.

పుత్రా దిచ్ఛే త్పరాజయమ్ :— ఇట ననుకరణము లే దని వెక్కిరించిరి; అభియుక్తప్రయోగరహస్యము లెఱుఁగమింజేసి వీరు పలుచోట్ల నిట్లు పొరఁబడిరి. -ఒకానొకచో ననుకరణ విరహితంబుగ సంస్కృతవాక్యంబు గానంబడెడి -అంటిబి నమశ్శివాయ. పాపాత్ము రాలి- జై 4ఆ. ప్రౌఢవ్యా 5వ ప్ర, 15 వ సూ. చూడుఁడు

పంచమాంకమునఁ బ్రధాననాయకుఁడగు ధర్మరాజుప్రవేశము లేదు, దానింగూర్చి దేవయ్యలువెక్కిరించిరి. ఈసంశయమునుగూర్చి, మురారి మహాకవికృత మగు ననర్ఘరాఘవమున 6వ అంకమును జదివికొందురు గాక, పాపము! ఆనాటకమును ప్రత్యక్షరమును దెలిఁగించిన -అంక మొకింతకల్లనివారికిఁగూడ నీస్వల్పవిషయము తెలియకుండుట విచార్యము. తెలిగించుటలు వేఱు, తెలివితేటలు వేఱు-

పాశుపతము సమాప్తము.

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః.

# పురశ్చరణము

చదువరులారా! యిందు మాపాశుపతమున మున్ను చర్చించినవిషయములే మరలఁ బ్రసక్తి కలుగుటంజేసి పిష్టపేషణ మొనర్పవలసివచ్చినది. ఆప్రసక్తి మాశిష్యులుచేపిన -పరాస్తపాశుపత- నామకమగు నవకతవక పరిసంగమే. -పాశుపత- ఖండన మెట్టులున్నను ముందు దానికి ననుగుణమైన పేరేని మా -దైవవంచితులకు- స్ఫురించినదికాదు. ఈ ముగ్ధులకు స్ఫురింపకున్నను వీరి -సేమమును జూచు తాతల- కేని స్ఫురింపకుండుట శోచనీయము. సిద్ధములు గూడ దైవవంచితులకు సమయమునందుఁ బొడకట్టవనుటకు మనకు గురుశాప దగ్ధుఁడగు కర్ణుని చరిత్రమే బోధకము. అది యటులుండె. పాశుపతముపైఁ బ్రసరింపఁదగిన పేరెయ్యదియో తెలుపవలసియున్నది. అది బ్రహ్మదండము.

శ్లో॥ తస్యాఽస్త్రం గాధిపుత్రస్య ఘోరమాగ్నేయ ముద్యతమ్, బ్రహ్మదండేన తచ్ఛాంత మగ్నే ర్వేగఇవాఽంభసా, వారుణం... పాశుపతం తథా వసిష్ఠో గ్రసతే సర్వం బ్రహ్మదండేన రాఘవ॥ (వాల్మీకిరామా-బాల)

పై ప్రమాణముం బట్టి పాశుపతముపైఁ బని చేయునది బ్రహ్మదండమని విస్పష్టమ. మాముగ్ధులకింత పరిశీలనాజ్ఞానమే యున్నచో నొప్పులు తప్పు లని వదరి తెగవెక్కిరించి దానిచే శీర్ష మూధారచక్రగత మగుటయు, దానినట నుండి యుద్ధరించుకొనుటకై మరల నేవో వెట్టిప్రయత్నము లొనర్చి -భక్షితేఽపి లశునే న రోగశాంతిః- అను లోకోక్తికిఁ బ్రథమలక్ష్యము లగుటయు నెట్లు ఘటించెడిని! నామకరణవిచారమింతతో ముగించి యిఁక నిందలి విషయములనుగూర్చి ముచ్చటింతము. ఇది సర్వవిధముల నీ వెం॥ రా॥ ల శిష్యుఁడ నని యొకదేవయ్య ప్రచురించిన "పాణిగృహీతాశ్రవణానంద శృంఖల" మపాధ్యాయప్రాయముగ

మన్న దని మాచదువరు లెఱుంగుదురు కాక. అట్లుండుటంజేసి దానికిఁ బట్టించిన గతియే దీనికిఁగూడఁ బట్టించుట యుక్తము గాన దానివలెనే యీ వరాహస్తపాకు జతనామకపుఁ జొప్పబెండు గూడఁ దృణీకరింపఁబడుచున్నది. "సహృదయాః ప్రమాణమ్॥"

యజమాని:—ఇట పుంయోగమున జీషు రాదని చెప్పుటకాధారమున్న. దీక్షితులు వ్రాసిన యక్షరములు 'టిడ్ఢాణఞ్' 'ఉగితశ్చ' అను సూత్రములవలన వచ్చెడిజీప్ప్రత్యయమునే వారించెడినిగాని యన్యమును లేశమును వారింప నేరవు. ఆయక్షరము లుదాహరింతము. సూ. టిడ్ఢాణఞ్... "వక్ష్యమాణేత్యత్ర ఉక్త్వా దుగిత్వాచ్చజీప్ ప్రాప్తః యాసుటో జిత్త్వేన లాశ్రయ మనుబన్ధకార్యం నాఽఽదేశానా మితిజ్ఞాపనా న్నభవతి, శ్నశ్యానచ శిత్త్వేన క్వచి దనుబన్ధ కార్యేఽప్యనల్విధా వితి నిషేధా ద్వా" ఈ యక్షరముల యర్థము మామగ్గుల మాటట్లుండ, తద్రక్షకులకుఁగూడఁ జక్కఁగాఁ దెలియ దని వా రిచట వాదించు వాదముంబట్టియే నిర్ణయింపవచ్చును. ఇంతమాత్రపుఁ దెలివితో నీ "వైవవంచితులు" వైదికులనెట్లు తూల నాడుచున్నారో చూడుఁడు. "యజమాన్యాభర్తుః" మొదలగు వైదిక శబ్దములు పాచకులకుఁ గాని శాబ్దికులకు సమ్మతములుగావు." వైదికశబ్దములట! అనఁగా వేదములోని శబ్దములు గావు. అగుచో నవి శాబ్దికులకు సమ్మతములేల కాకుండెడిని? పైఁగా నీప్రయోగము వేదములోనిదని యెవఁడనుకొనును? వైదికులు, అనఁగా యాజ్ఞికులు, సంప్రదాయ సిద్ధముగా వాడు శబ్దములఁట! ఈ నక్షత్రసూచులకఁట! సమ్మతములు గావఁట! ఆయాజ్ఞికులు శాబ్దిక జీవులుగాని శాఽఽబ్దికజీవులు కారు. కావుననే 'యజమానస్య భార్యా' యజమానీ అను నర్థమున నిర్బాధముగు జీప్ప్రత్యయమును గైకొనిరి. ఈజీషు టిత్వప్రయుక్తము గాని, ఉగిత్వ ప్రయుక్తముగాని కాదు; జీప్పు గాదు. మోజకుల కింత తెల్పినను దెలియదు. కాన నింతతో ముగించుచు 'క్షమాపణ నింద్యగ్రామ్య' మన్ననోటి కిది తప్పనుట యొక యక్కజము గాదని తెల్పుచు, దానివలనఁ గల్గిన పరాభవమున కొప్పి కొని యనుభవించుచున్నట్లే దీనింగూడ ననుభవింపవలసినదని కోరుచున్నారము. "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాఽశుభం"

ధౌమ్యులు ప్రవేశించును, వ్యాసులు ప్రవేశించును :— ఇందులకు మను

చరిత్ర వ్యాఖ్యానమునుండి మాచూపిన— "కృష్ణరాయలు......జయించెను"
అను నుదాహరణము పనిచేయదఁట! అతఁడు గూడ మాతోపాటు దానిం దిద్దు
కొనవలసినవాఁడే యగునఁట! మాకర్మము కాలి యీ "నక్షత్రసూచుల" తప్పుడు
గూఁతలకు మేము పాత్రులమైన నగుదుముకాక; పాప మయ్యనఘుఁడు గూడ
నల్లై కావలసివచ్చెనేమి! అది యటులుండె, పైఁగా భారతమునుండి చూపిన—
"క|| మాయయ్య యెవ్వ రెక్కుడఁ బోయిరి" అను నుదాహరణమఁట! పద్య
ములో నున్నదియఁట! మాగద్యములు కూసుగద్యములఁట! ఇందలి ప్రయోగము
లకఁట! విచ్ఛిత్తివిశేషమునకై కొండొకచో వాడిన పద్యగతప్రయోగములు పని
చేయవఁట! ఎందులకీ పిచ్చిప్రలాపన మని యిది వఱకెందఱో మందలించినను
నోరు మెదుపు మా దేవయ్యాలి కెప్పుడేని బుద్ధిగల్గునోకో! ఏదియో ప్రేలుటయే
వృత్తిగా నేర్పఱచుకొని యదియే జీవనాధారముగ వర్తించు వీం డెట్లు ప్రేలిన
నడుగువా రెవరు? "అబోధోపహతా శ్చాస్యే జీర్ణ మంగే సుభాషితం"
పైప్రయోగముం గూర్చి పాశుపతమే విశేషించి తెల్పును గాన నిట విస్తరింప
వలసినది లేదు.

ఇదుగో, ఇడుగో, ఇరుగో, అరుగో:— అయీ రూపములంగూర్చి
పాశుపతమున విస్తరించి బోధించి వ్రాసియుంటిమి. అందు, ఇయ్యవి ప్రతి
పదోక్తావ్యయము లనియు కళ లనియు నొక్కి వక్కాణించి యుంటిమి. అయీ
సందర్భములకుఁ దగిన ఖండనోపాయము దొరకక యేవో కొన్ని మాటలు వదరి,
కొంత దుఃఖము దీర్చికొని— "మీఁదుమిక్కిలి యవి కళలఁట" అని యొక
అంకె వేసెరి. అవి కళలు కావేమి? కానిచో—

క|| ఈకుధరేంద్రము లోకా। లోకపు బల్గోడఁ దట్టి లోనికటాద్రుల్
మేకులుగాఁ జేయుచు నది। గో కానంబడియెఁ దెల్లగొల్లెన భంగిన్||

(వరాహపురాణము)

అను మహాకవిప్రయోగము కుదురుటెట్లు? శబ్దరత్నాకరకర్తకీప్రయో
గము దొరకక, దొరకిన కళాపూర్ణోదయప్రయోగమును సాధించుటకు గత్యం
తర మున్న దని యెఱుకపడక, ద్రుతాంతముగను లాక్షణికముగను వ్రాయవలసి
వచ్చినది. అట్లతఁడు భ్రమించినచోట్లు మఱికొన్ని గలవు. "గచ్ఛతస్ఖలనం
క్వ దోషాయ" కళాపూర్ణోదయ ప్రయోగముకన్న వరాహపురాణప్రయోగ

మేవిషయమునం గాని తీసిపోవునది కాదు. పైపెచ్చు దీనికన్న నది చాలఁ బ్రాచీనము. దిద్దుద మన్నఁ బ్రాసస్థానమం దున్నది. కాఁబట్టి "యోజించు" ప్రయోగమువలెనే యియ్యదియు వదరుఁబోతుల నోరు నొక్కునదియే యని బిజ్జు లరయుదురుగాక! యోచన తప్పనియు, 'యోజనయే సాధు' వనియు చింతకు మున్న ప్రాసస్థానమునందుఁ బ్రయోగ మిచ్చి వాకట్టు కల్పింపఁబడినది అందులకే మఱియొక మహాకవిప్రయోగము—

క॥ రాజా! యేమని చెప్పుదు। నాజగతీసురుని మొదటియణఁకువయును ధా
త్రీజనులు రోయునప్పటి। యోజన కాశ్చర్య మయ్యె..., (నిరంకుశోపా)

ఈ 'యోజనా' విచార మిటు లుంతము. దీనింగుఱిచి మా వేఁదుఱు శిష్యులు ప్రకృతమించుకయుఁ బలపించినవారు గారు, కావున నది చచ్చిన పాముం జంపుటవంటిది. ప్రకృత 'మిదుగో' విచార్యము. ఇం దిఁక నొక మాట బొత్తిగాఁ దెల్వితక్కువను వెలిఁ బెట్టునట్టిది వ్యయము చేసిరి.

"ప్రకృతిప్రత్యయజ్ఞానము కలవా రెవ్వరును 'ఇదుగో', ఇదుగో, మొదలగు శబ్దముల నొప్పరు"

ఒప్పరేమి! ఈమాట ప్రకృతిప్రత్యయజ్ఞాన మున్నవాండ్రు వ్రాసినదే యగునో? అగుచో, నట్టివాండ్రు 'ఇదుగో' శబ్దము నొప్పకున్నను 'ఇదిగో' శబ్దము నొప్పుదురుగదా! ఆయొప్పట, 'ఇది' అనునది ప్రకృతి యనియు, 'గో' అనునది ప్రత్యయమనియు ననుకొనుటవలననే కాఁబోలు, పోలు పోలు! ఎందుల కీపిచ్చివ్రాఁతలు? కలిగినంతలోఁ దిని కూర్చుండినచోఁ గొంత గంభీరులుగా నుండవచ్చునుగదా! ప్రతిపదోక్తావ్యయము లివి యేమి వ్రాసియుండఁగా దానింగూర్చి మాటలాడుచు మధ్య నీచేతఁగాని ప్రసంగ మెందులకు? "ఏనాన్నస్వయినది యన నాఱు నెల లైన" దనునట్లుండుట యుక్తమో కాదో, లోలోన యోజించుకొందురుగాక. మఱియు నిట్టి తెల్వితక్కువ మాటలనే 'చిగురు' శబ్దవిషయమును ఖండించుచు వెళ్లఁ గ్రక్కిరి. చూడుఁడు.

"చివర యనుటకు గ్రామ్యులెవరో 'చిగుర'ని వాడుచుందురుగాక... లోకమున నెన్నిశబ్దములు వికారమును బొందుచుండుటలేదు...ఓహో గ్రామ్యభాషాదేవతా......" ఇత్యాద్యపలాపముల కర్థమేమైనఁ గలదా. ఈ మా వేఁదుఱు వదరుఁబోతులకు గ్రామ్యశబ్దార్థము తెలిసిన నిట్లు వాగరుకదా! పైవ్రాఁత

వలన 'చివర' శబ్దమునకు 'చిగురు' శబ్దము గ్రామ్యమని తేల్చుచున్నారు. ఇది యింతకు మున్ను చూపినప్రకృతిప్రత్యయజ్ఞానప్రసంగముకన్న శోచ్య దశలోనున్నది. వ్రాఁత సర్వమును శోచ్యదశలో నున్నప్పుడు దీనికై యింత శోకింపఁ బనిలేదు.

నిష్కృష్టాంశ మిది. 'చిగురు' చివరకుఁ గాని, చివర చిగురునకుఁగాని గ్రామ్యములు గావు. గ్రామ్యమని మన మేపదమునందుమో, దానికి నదేయర్థముగల వేఱొకపదమును జూపవలసి యుండును. ఆపదము లొంచెము భేదము మాత్రమే కలిగి తాదృశానుపూర్వియే కలదిగా నుండవలయును. ప్రకృత మానుపూర్వీసామ్య మున్నను అర్థైక్యము లేశమును లేదు. కావున వీనిలో నొకటి కొకటి గ్రామ్యములుగాఁ జెప్పఁ గూడదు. అగుచో 'జివర' యను నర్థమున మీరు 'చిగు' రని యేల ప్రయోగించితి రందురా, ఇందుంగూర్చి యౌపచారిక మని మున్నే వ్రాసి బోధించి యుంటిమి. కాన నిందు విస్తరింపఁ బనిలేదు. ఇట్లుండ నవలనఁగా మా పాశుపతము చదువకమున్ను వెం॥ రా॥ లు ప్రకృతవిషయమును వ్రాసినవ్రాఁత యెంత ముద్దుగానున్నదో చూడుఁడు. "వెంద్రుక మనుష్యశరీరమున కగ్రభాగమగు శిరమం దుండును గాన దానికిఁగూడ నిట్టియర్థము చెప్పవచ్చును గాఁబోలును" ఈ ముద్దుమాటలలోఁగూడ లోకజ్ఞానము పూజ్యమో కాదో విచారింపుఁడు. వృక్షమున కెక్కుడఁ జూచినను, చిగురు (పల్లవము) శాఖోపశాఖల తుట్టతుద నుండును. అది నిజమే. అట్లే వెండ్రుకలుగూడ మా వెం॥ రా॥ లనుకొనునట్లు శిరమందే యుండెనేని చెప్పనే వచ్చును. ఇవి యటు లుండుట యనుభవసిద్ధము కాదు. మూతియందు, ముక్కునందు, ము + యందు, చం + యందు ఇంకను నెన్నో చోటుల నుండును గాన దీని కట్టి లాక్షణికార్థము కుదురదని బుద్ధిచెప్పవలసివచ్చినది. ఇంత తెల్వితక్కువగాఁ దాము ప్రసంగించుచు నీప్రసంగముతుదను "లాక్షణికార్థ మెట్టిచోట్లఁ జెప్పవలయునో యాలంకారికుల నడుగుఁడు" అని శాసించుచున్నారు. లజ్జయున్నంగదా, అది లేనియప్పు డన్నరుఁ డేవ్రాఁత వ్రాయఁడు? ఏకూఁత గూయఁడు? ఈక్రిందియపలాపమును జూడుఁడు. "ఇంతకు మున్న ముద్రింపఁబడిన పాండవాశ్వమేధపుఁ బ్రతులుఖర్చు కాకుండఁగనే వేంకటశాస్త్రిగారిమన్య నానాటకమును మరల నచ్చు వేయించి" ఏమి చెపుమా, అట్లేల యచ్చువేయించిరో! వెం॥రా॥లు

తప్పుడు శతఘ్నిని గృష్ణాముఖమున నామరూపశూన్యముగాఁ జేయునప్పటికే యది పునర్ముద్రణమునకు వచ్చి యుండుటయు, దానికొఱ కెందఱో చదువరులు సుమా రొకవత్సరము వేచి యుండుటయు సర్వజగద్విదితమే యగుటచే నీప్రస్తాపమున కుత్తర మనావశ్యకము. ఇది 'శృంఖలలో' పీంద్రకేష్వ్యాపకరుఁడు చేసిన “ధాతురత్నాకరమఁట! కాశీసహస్రిమఁట! శృంగారశృంగాటకమఁట! ఎక్కడనున్నవో?......ధాతురత్నాకరము, శృంగారశృంగాటకము లేవు ... అలు లేదు, చూలు లేదు, కొడుకుపేరు సోమలింగమఁట!” అను నరణ్యరోదనమున కుపాధ్యాయప్రాయ మని విజ్ఞు లరయకపోరు. కాన నిట్టి ప్రల్లదముల ఖండింపఁ బూనక శాస్త్రవిషయచర్చ కుపక్రమింతము.

కుప్రితపఱచు, కుప్రితసఱుచు:—ఇవి రెండును సాధువు లని వ్రాసి యందు ఒక శబ్దరత్నాకరము జూచుకోవలసిన దని మేము బోధించి యుంటిమి. అయినా మా వ్రాఁత మూఢదృష్టిలేని వ్రాఁతయఁట! అచట వీరి కువాదోద్ధరణమునకుఁ గంఠోక్తముగా నేదో యున్నదఁట! ఆయున్నదాని నిందు లిఖించి మందలింతముగాక. “పఱచు,......క॥ భంగించి యితరకాంత పొఱుంగుట తప్పొ తడం ఒఱచి పురుషుఁడు కుఱ్ఱ” కళా— ౭, ఆ, ... (ప్రేరణార్థకమయిన ‘పఱచు’ ఒక న్యాయమును బట్టి ఉకారమధ్యముగా నుండవలసియున్నను వ్రాఁతప్రతుల యం దంతట, తఱచుగా, అకారమధ్యముగా నుండుటవల్లను, ఒకప్రామాణిక కవిప్రయోగమున యతియందు కానఁబడుటవల్లను, ఇట్లకార మధ్యముగాను వ్రాయఁబడెను.” అని వ్రాసి మరల నుకారమధ్యములు వ్రాయుచు “పఱుచు” .........అనుప్రయుక్తమైన పఱుధాతువునకును రూప మిట్లైఱుంగునది ) అని లిఖించెను. దీనివలన నేమి తేలుచున్నది ? పూర్వమహాకవిలిఖితములగు ననేక గ్రంథములలో నిట్లకారమధ్యరూప ముపలబ్ధ మగుచున్న దనియు దానిం దిద్దకమున్న నొకమహాకవి యతిస్థానమునఁగూడఁ బ్రయోగించుటచే వలనుపడకున్నదియనియుఁగావున విధిలేక యకారమధ్యమునుగూడ నొప్పకతప్పక వచ్చినదనియు, నాకభీష్టమైనదిమాత్ర ముకారమధ్యరూపమేయనియుం దేలుచున్నది ఇతని కిష్టము లేకున్నను నితని తాతముత్తాతలకది యిష్ట మని వారివారి ప్రవృత్తి వలనసిద్ధమగుచున్నది. తథాచమతభేదేనోభయరూపసిద్ధిః, ‘సర్వపథీనాః కవయః’ మఱియు ‘తడఁబఱచు కన్యథా గతి యున్నది’ అని యొకబొంకు బొంకి యంత

తోనే ముగింప నేల వలసెనో! పట్టి చెత్తతుక్కు ప్రసంగముతోడనే చాల పుటలు చెఱిచి యేవో నాలుగు మూఁడు పుటలుమాత్రము ప్రధానవిషయమునకుఁ గా వమ్మొనరించిన మా దేవయ్యల కాగతి యెట్టిదో బయటఁబెట్టుటలో వచ్చిన నష్టి యేమో విజ్ఞులు విచారింతురుగాక. తప్పుడుకూఁతలు గూయు దేవయ్యలకుఁ గల గతియే దానికిని గల దనియు, దానికిఁ జూపఁ దలఁచిన గతిని నైటవైచిన యుత్తరక్షణమే యాగతిని దుర్గతిగాఁ జేసెద మనియుఁ గర్జోక్తిగాఁ జాటుచున్నారము.

నిగుడ్చి :— దీనింగూర్చి పాశుపతములో నెత్తిన హరివంశమునుండి యతిస్థానమున "కుంభపీఠమ్ము పగుల్చి మఱియు" అను ప్రయోగ మీఁబడి యున్నది. ఆసందర్భమును జూడనియట్లభినయించుచుఁ జిన్నయ్యసూరి సంస్కరించి యచ్చొత్తించిన పాత్రములో నున్నదని చెప్పిన ప్రయోగపదం పదల నెల్లఁ ద్రోసివేయ నుద్యమించు మా దేవయ్యల యవస్థకు వందురనివా రెవ్వరు? 'యతిస్థానము' యతిస్థానము, ఎఱ్ఱన్న, శంభుదాసుఁడు కవిత్రయములోనివాఁడు. ఇప్పుడేని తెలిసినదా? ఇఁక నోరు కట్టుట యుక్తమేమో"

రక్కసు లందఱిని దునిమి రక్తమది తన దేహంబందు :— ఇందున్న "రక్తమది" యనుచోటఁ గల "అది" యనుదానింగూర్చి తెలివితక్కువతనముచే నోరు తెఱచి వెక్కిరించిరి. భారతప్రయోగములను జూపి మేము శిరోభారమును బూర్తిగాఁ దగ్గింపఁగా మగల "క్రిందఁ బడియు మీఁదివాఁడ" నని చెత్తప్రసంగమునకు మొదలిడి భారతమునందలి "హస్తిపురం బది రాజధానిగన్" అనుచోఁ గల 'అది' ప్రసిద్ధార్థక మనియు నిది యట్టిది గా దనియు, నది విచ్ఛిత్తివిశేషాపాదక మనియు నిది యట్టిది కాదనియు, వ్రాయుచుఁ గొన్ని చుదుకుఁ గూఁతలు కూయఁ జొచ్చిరి. 'అది' 'తా' వీనింగూర్చి పాశుపతములో వ్రాసిన సంగతులపై నేమియు వ్రాయ వీలులేక వదరు వదరులవలనఁ జీవాట్లు తక్క ఫలాంతరము గలుగుట దుర్ఘటము. "హస్తిపురం బది" అను ప్రయోగ మటు లుంతము.

'చ॥ శిరమున కొప్ప నర్చనలు సేసిన పువ్వుల యవ్విధమ్మునన్' ఇందలి 'పువ్వులయవ్విధమ్మునన్' అనుచోఁ గల తచ్ఛబ్దార్థకమున కేప్రసిద్ధార్థకత్వము గల్గెడిని? "పువ్వులవిధమ్మునన్" అనినం జాలునుగదా? తెలిసీ తెలియని

మూర్ఖుల కేమిబోధించినను బ్రయోజనకారి కాదు.

కర్ణుఁడు దుర్ణయుం డగుచు :— ఇట "దుర్ణయ" తప్పనియు 'దుర్నయ' అని దిద్దవలయు ననియు మొదట వెం॥ శా॥ లాక్షేపించిరి; దానిపై భారతములోని "దుర్ణయుల్ శకునియుఁ గర్ణదుశ్శాసనుల్" అను దురుద్ధర ప్రయోగమును, మఱియు నిట్టి దిద్దరానివియే యగు శ్రీనాథపెద్దనాదుల ప్రయోగములను జూపి శాస్త్రవిషయకమగు సమాధానమును గూడ వ్రాసి పాశుపతములో బుద్ధి గఱపి యుంటిమి. అంతతో ముగియవలసిన యీయనివార్యసమాధానము నవ్యథాకరింపఁ దలఁచి భారతప్రయోగమును -దుర్నయుల్......కర్ణదుశ్శాసనుల్- అని దిద్ది నన్నయభట్టారకున కిట్టి చండాలపు నణ ప్రాసముకూడ నిష్టమని యపవదింపఁ దొడఁగి యంతం దనివి సనక "నన్నయ మఱికొన్ని చోట్ల బాహిరముగా నణప్రాసము వాడినాఁడు. నన్నయభట్టారకుని మతము సాధారణుల కెట్లు తెలియును. సిద్ధాన్తకౌముదీగంధ మెంతమాత్రము నిలిచిన నీతప్పు వెం॥ శా॥ గారికిఁ గలుగకుండెడిదిగదా ......" ఇత్యాది నీచాతినీచోక్తులు ప్రేల మొదలిడిరి. ఈవెఱ్ఱికూఁత లెట్లో వదరుదురుగాక, పాపము పెద్దలు విద్వాంసులును నగు బ్ర॥శ్రీ అకుండి వ్యాసమూర్తిశాస్త్రుల వారిచేఁ గూడ నీగుడ్డితోవయే యనుసరింపఁ బడిన దని వ్రాయుటకుఁ జాలఁ జింతిల్ల వలసి యున్నది. మఱియొక సంచికలోనేని గాక, ఈతప్పుడుఁ బ్రసంగము ప్రచురించిన సంచికలోనే, "భారతఫక్కి"లో వ్యాసమూర్తి శాస్త్రులుగారు వ్రాసినట్లున్న వ్రాఁతం జూడుఁడు. "దుర్ణయమున శకునికర్ణదుశ్శాసనుల్" అను సర్వప్రాస సీసము నాటగీతిని 'దుర్నయమున' అని యుండ వలయును. "షురష్షత్వణత్వయో రుపసర్గత్వ ప్రతిషేధో వక్తవ్యః" 'ఉభయప్రాసము భట్టారకునకు సమ్మతంబ' 'అక్షౌహిణియా నిరంతరపరిమాణసంఖ్యా' ప్ర ఆ.80.

ఈవ్రాఁతకును ఆవ్రాఁతకును గల సంబంధ మిఁకఁ దెలుప నక్కఱలేదు. అల్లునకరించి రాఁబోవు మానావమానములను గణింప నేరక గర్తమునం బడుచున్న శ్రీ శాస్త్రులవారి వ్రాఁతయందలి యసారతను గూర్చి మాభారత విశేషములు 31 వ పుట మొదలు 34 వ పుటవఱకును జదివి కొనఁదగు. మఱియు నందే శ్రీ శాస్త్రులవారు భారతముపై నాపాదించుచున్న భారతఫక్కియందలి దోషముల యసారతనుగూర్చి కూడ విస్తరింపఁ బడియున్నది. శాస్త్రులవారు ప్రాజ్ఞ

లయ్యును మాసేవయ్యల ననుసరించుకతన నవహాస్యాస్పదపు విమర్శనములకు దిగి
రని మే మిందు వ్రాయవలసి వచ్చినందులకు మిగులఁ జింతిల్లుచున్నారము.
“దుర్ణయ” గత ణత్వమునకై తిక్కనగారిప్రయోగముకూడ నొకటి యుదాహ-
రించి విషయాంతర ముపక్రమించెదము. “క॥ కర్ణునిసారథినైనను । నిర్ణయ
మున కేను బార్థునిఁ గాచెద నాదుర్ణయవిచారు నెమ్మెయిఁ । గర్ణకఠోరమ్ము
లాడి కలఁతుం బోరన్.” (భార. ఉద్యో) ఇట్లు కవిబ్రహ్మలనువారు సమ్మతిం
చిన ప్రయోగములనెల్లఁ హి హీహీ, యని వెక్కిరించి గర్తమునఁగూలి తమతోఁ
గొందఱం గూలఁద్రోచి యిప్పుడేమి చేసిన నేమి లాభము?

నాందీపద్యవిచారము:— దీనింగూర్చి మాశిష్యాపశదులు నదరిన నదరుల
నెల్ల రూపుమాపఁదగు సమాధానమును మాపాశుపతము చెప్పియున్నది. దానిం
జదివి యది ఖండింపరామికి వగచి మరల “కుర్వీత బుధ సోమయోః” అను
ప్రాస్తావిక శ్లోకపాదమున కున్నంత ప్రసక్తి మాత్రమే కల “న హి చమత్కార
విరహితస్య కవేః కవిత్వం” ఇత్యాది గల వాక్యము నొకదాని నుదాహరించి
వదరుచున్నారు. నాందిలోఁ రాఁబోవు నాటకకథ నిముడ్చుట చమత్కారము
కాదని పైవాక్యము చెప్పదు. కాన నిది యుదాహరించి ప్రయోజనములేదు.
మఱియు “ఏష రాజేవ దుష్యంతః” అనునది నాంది గాదనియుఁ గావున
నందలి సూచనము గూఢముగా నుండ నక్కఱ లేదనియు వ్రాయుట పూర్తిగా
బుద్ధిపొరపాటు. పాత్రప్రవేశసూచన మగూఢముగా నుండవలెననియు నాంది
లోని కావ్యార్థసూచనము గూఢముగా నుండవలయుననియు నాప్రియునంతటి
యప్రాజ్ఞులు లాక్షణికులలో నెందును లేరు. కాన నిటఁ బెనఁగుటకన్న వేఱు
మూర్ఖత లేదని యెఱుఁగఁదగు. విస్తరము పాశుపతమునఁ జూతురుగాక.

అన్యాయ్యము:— ఇందలి ద్విత్వమునుగూర్చి శాస్త్రమును జూపియుం
టిమి. అయినను మరల వదర గోరఁకొనిరి. ఆవదరు లివి; “దీని సత్య మిది,
న + అశ్వః, అనశ్వః అయినదికావున, న + న్యాయము, అన్యాయ్యము కాన
చ్చునని కవియాశయము. వ్యాకరణము నెమరునకురాక......” ఇత్యాదులు
తప్పుడుఁగూఁతలు గూసిన లాభమేమో! ద్విత్వము రాఁదగు శాస్త్రముండఁగా
దానిని గనఁ జాలక మొదట వదరి శిరోముండనమున కగ్గమై యిప్పు డాశాస్త్ర
జ్ఞాన శూన్యత నొరులపై నారోపించిన విశ్వసించు మూర్ఖు లెందుందురో!

ఏగురు, ఏడ్గురు:— ఈస్థలమున, ఏడ్గురు అనుటకు, ఏగురు, అని ముద్రణమునఁ బొరఁబడినది యని పాశుపత ముత్తరమిచ్చినది. దానిపై నిట్లువ్రా యుచున్నారు. "అయిదుగురు అను నర్థముగల, -ఏగురు- అను శబ్దమును, 'ఏడు గురు' అనుదానికి రూపాంతర మని తప్పుఁదలఁచి ప్రయోగించి......" ఇత్యా దులు వదరిరి. అగుచో వీండ్రాక్షేపించినచోటునకుఁ జాలవెకనునే యుక్త మూక్రింది యశ్వమేధపుఁ బ్రయోగములం దిలకింపుఁడు. (1) శా ......ఏగు ర్పాండవుల్ పక్క॥ (2) ఉ॥ ఏగురఁ బార్థులన్ (3) ఉ॥ ఏమను నైదుగు ర్గెలిగి యట్లన యుండిరి సోదరాత్మజుల్॥ ఆయీ ప్రయోగములవలనఁ తి॥ వెం॥ కవు లకు 'ఏగురు' అనుమాటకు, ఐదుగురు అనునర్థ మెఱుకపడు నను సంశయము తేలె డినిగదా! అట్టిచో నీనిక్కృష్టు లది ముద్రాప్రమాద మనిన విశ్వసింపక యింకను నఱచుట యెందులకో పాశ్రిజ్ఞు లరయుదురుగాక. ఇదిగాక, ఆముద్రాప్రమాద మేస్థలమునఁ బడినది? దాని సందర్భమెట్టిది? అని విచారింతునేని—

తే. గీ. "ఒక్కవసునంశమున దీప్తి నొప్పుటకుఁ [illegible]ంబుగాదిమ్యో మును సమరమున నాకు । అట్టివా రెగురఁటి.............................

అని కదా! మొదట ముద్రాప్రమాదపాఠము, వసువు లెనమండ్రనియు నందు భీష్ముఁ డొకనియంశ మనియు, నతఁడుగాక మిగిలిన వసువు లేడుగు రనియు తెలియుట కూడ నొక ప్రాజ్ఞతయే యగునోటు! ఈమాత్రపుఁ బ్రాజ్ఞతకూడఁ దె॥ వెం॥ కవులకు లేదని వాదించు నిర్దేశయ్యలకుఁ గల సత్యతత్పరతను జనులు తెలియుదురుగాక.

తి॥ వెం॥ కవులు రచించిన దేవీభాగవతము 2 స్కం. లోని "అష్టవసు వులుగూడ భార్యాసమేతు, లగుచు" అను వాక్యమువలన వారి కీమాత్రము జ్ఞానము కల దనియేని లోకము విశ్వసింపక పోదు. కాని యెఱిఁగి నిద్రించు మాదేవయ్యలకో, యెన్ని యుదాహరణములు చూపినను 'బూదిలోఁ బోసిన పన్నీరులే.

ఒకరా, యిద్దఱా! :— ఇందలి 'ఒకరు' అనుదానింగూర్చి పాశుపత ములో నెన్నియో యపభ్రయుక్తప్రయోగము లేఁబడినవి. మఱల మొఱఁగు చున్నారు; చేయవలసిన దేమి? ఆప్రయోగములెల్లఁ బనికిమాలినవఁట! చిన్నయ సూర్యాదుల ప్రయోగములెల్లఁ బనికిమాలిన వని తిట్టి యెట్టాప్రగ్గడగారె.

"సా। నొకరును బలుకరైరి నమితాననులై" అనుచో, ఒకరు అనఁగా అన్యు
లని యర్థము చెప్పుదుమని దబిద్ధవాదమునకు దిగిరి. ఆయర్థము కుదురదు. అన్యులు
అను నర్థము చెప్పుచో నందున్న 'ను' అను సముచ్చయమునకు స్వారస్యము
చెడి భ్రష్టమగును. ఈసంగతి దేవయ్యలకు తెలియదు. చిన్నయ్యసూరి, శబ్ద
రత్నాకరకర్తలు, లోనగువారితో పాటుగా నెఱ్ఱన్నను గూడఁ బనికిమాలినపని
మున కగ్గము చేసియే మెఱుగుట కొంత యుక్తమని తలఁచెదము. పోనిండు.
అన్యార్థ మగునప్పుడు 'ఒకరు' నిరాఘాటప్రయోగమని యిప్పుడు దేవయ్యలు
వ్రాయు వ్రాఁతలవలనఁ గన్పట్టుచున్నదికదా! ఈ తెల్వి మాపాశుపతావతార
మునకుఁ బూర్వమే వీండ్రి కున్నచో, "ఒకరిశక్తి నొకరు పరీక్షించుకొనుట
కేర్పడిన కయ్యము" అను చోటున, అన్యార్థకముగాఁ బ్రయోగించిన 'ఒకరు'
కూడఁ దప్పని యేల గిటుకెట్టవలయునో! తత్త్వ మిది; వీండ్రు జ్ఞానలవదుర్వి
దగ్ధశిరోమణులు. తటస్థించిన సాయముగూడ నంతటిదే, దానంజేసి వీండ్రికు
జన్మజన్మములకుఁగూడఁ దలనెత్త వలనీయనియంత పరాభవమునకు హేతుభూత
మగు శతఘ్నీరచనాపరిసక్తి ఘటించినది. అది చేయవలసిన యపకృతి పూర్తిగా
చేసినది. దానిని ఖండించుట కవతరించిన పాశుపతమువలన నిటీవలఁ గొంత
జ్ఞానము కలిగినది. కాని మొండితన మవలంబింపక విధి లేక యేదో మెఱుగు
చున్నారు. ఈయంశము నెఱుఁగని మానవవ్యక్తు లుండఁబోవు. కావున నే
విస్తర మనవసరము.

ఈకూఁతలు చూడుఁడు! 'పాశుపతములోని సమాధానములు తుక్కు
తుక్కుగుచున్నవి.' మఱియు నీయవ్యక్తప్రలాపములంగూడఁ జూడుఁడు. 'ప్రౌఢ
వ్యాకరణములోఁ బ్రతిసూత్రమునందును, గొండొకచో నొకానొకచో, నను
పప మెందుల కనిచినాఁడో పాశుపతము తెలిసికొనుఁగాక" ప్రౌఢవ్యాక
రణ మనునది యొకటి యున్నదనియె యెఱుఁగక తెగ వాఁగివాఁగి పాశుపతము
వలన దానిసత్తె నెఱిఁగి యయ్యది కొంప తీసినదని మిణికిమిణికి యిప్పు డద్దాని
కీదేవయ్యలు వ్యాఖ్యాన మొనర్ప మొదలిడి, జ్ఞానలవదుర్విదగ్ధత్వమును
బయటవేసికొనుటకన్న నొండు సిగ్గునుం గలదో! ఆవ్యాకరణము నటులుంచి
యభియుక్తప్రయోగములంగూర్చి యేమని వదరుచున్నారో తిలకింపుఁడు.
"......మొదలగు తప్పులకును బ్రయోగము లంగీకరింపఁబడవు, తప్పక దిద్దికొన

తెలిసినవే" ఈవాక్య మెట వ్రాసిన దనుకొంటిరి ! నోరెత్తకీలుగానిగతి సమర్థిం
చినచోట్ల పదమూడింటినెత్తికొని వానిపై నేమియు వ్రాయఁ జేయి రాక,
వాని కిచ్చిన ప్రయోగములు తిరుగనివని తెలిసి, యీయప్రగల్భోక్తిని వదకి
తలయెత్తఁదలఁచుచున్నారు. ప్రయోగము లంగీకరింపకుండుటకు ఏం ప్రెదవరో!
పైఁగా నాయాయాప్రయోగములకు శాస్త్రముకూడఁ జూపి యుపపాదించి
బుద్ధిగఱపితిమి. శాస్త్ర మక్కఱయే లేదునుఁడీ ! అభియుక్తప్రయోగమే
చాలును.

"వైయాకరణాః పిశాచాః ప్రయోగమంత్రేణ నివారణీయాః" ఇట్టుండఁ
ప్రయోగము లంగీకరింపఁబడవఁట ! అనాలోచితముగా నిట్లు వ్రేలుటవలన
నెత్తిపైఁ బడెడి 'తస్యపరిహారణముల' నేని యంగీకరింతురో, యంగీకరింపరో
కదా ! ఏమీ ముట్టిపోగరు ! స్థానము కవలి సత్స్నభకు వచ్చినచో నాయంగీక
రింపకుండుట యెట్టిదియో తెల్పెఁడు వని లోకు లెఱుఁగుదురు, ఇంకేయు
నిట్లు ముట్టిబలిమికూఁతలు కూయుచున్నను కరోభాగము వ్రాతిగాఁ
నిర్ణైనట్లు సూచించు కొన్నివాక్యాలు కెలువరించుచునే యున్నారు,
తిలకింపుఁడు. "ఆనాటకమును (పాండవాశ్వమేధమును) విద్యార్థులకుఁ
పాఠము చెప్పినవారు...సీనియరు పండితులగు వ్యాసమూర్తిశాస్త్రిలవారు కారు"
ఈవాక్యమువలనఁ దమకు వ్యాసమూర్తిశాస్త్రిలవారి సాయము లేమను లేద
నియు, శతఘ్నివలనఁ బ్రాప్తించిన యవమానమంతయు శ్రీవారికి భాగ మియక
తానినంతయుఁ దామే యనుభవింపఁగలవార మనియుఁ దెల్పుచున్నారు.
ఇయ్యది మొదటనే తెలిసినచో 'ఆ అంక మొకింత గల్గని మహాత్ముఁడు
వ్యాసమనీషి' అని వ్రాసికొనకయేయుందుము. పాపము, ఇవవలఁ నోఁచినలాభ
మేమి? 'విప్రాః పశ్చిమబుద్ధయః' విప్రకులోత్పన్నత్వముకతన నిట్టి పశ్చా
త్తప్తత కల్గినది; కాని యట్టి పవిత్రబ్రహ్మసామాజికమతప్రవిష్టతా సూచక
మగు 'నవర్థశతకము' వలన నుప్పరతనముగాఁ బరిణమించినది. కావున నిఁకఁ
బశ్చాత్ప్రియుక్తమగు దోసము వదలి సుఖముగా మనవచ్చునని తెల్పుచున్నారము

ఊరకొను :— దీనింగూర్చి పాశుపతము పూర్తిగా వివరించినది. మే
మెన్నివత్సరములకిందటనో దీనిని గ్రామ్య మని కంఠోక్తిగా వ్రాసి
యుండఁగా, దానిని ఏంద్రు మాకు గ్రామ్య మని బోధించుటలో ఫలమేమో!

గ్రామ్యమైనను మహాకవిసమ్మతింజేసి ప్రయోగార్హమగునని శాస్త్రముద్ఘోషిం-
చుచున్నది. "ఏవం స్థితే మహాకవిప్రయోగప్రధానత్వకథనేన మహాకవి-
ప్రయోగారూఢంచే ద్గ్రామ్యమపి ప్రయోగార్హ మిత్యాచార్య తాత్పర్యమ్"
(అహోబల 177 పుట) విస్తర మందే చూడఁదగు. ఇదివఱలోఁ జూపిన శ్రీ-
నాథప్రయుక్తమగు నుదాహరణము బజారుపత్రికలోనిదఁట! నుతుకుమిల్లి
నృసింహశాస్త్రిలవారికి హిరణ్యశృంగములు మొలువలేదఁట! కావున వారును
దిద్దుకోఁదగువారేనఁట! ఈవదరులే పరాభవాపనోదనము లగునోటు! వదరుల-
కేమి, ఈకిరింపి మహాకవి ప్రయోగములను గూడ శిరసావహించి మఱియుం
బ్రేలుదురుగాక.

ద్వి॥ "ఊరకో నాతండ్రి యూరకోపన్న, ఊరకో నాస్వామి యూరక
కింతేల" (బసవపురాణము) ఆ యీ ప్రయోగములు పాల్కురికి సోమనాథ
మహాకవివి. ఇతఁడు తిక్కనాదులకాలములోనివాఁడని కొందఱును, అంతకుఁ
గూడఁ బ్రాచీనుఁడే యని కొందఱును నుడువుచున్నారు; ప్రాచీననవీనత్వ
ములతో నంత ప్రయోజనము లేదు. ఈతఁడు మహాకవి కాఁడను వారుండరు;
దేశ్యా లన్నచోఁ బ్రయోజనకారి గాదు.

ఇఁక వీండ్రు ప్రకృతపరాస్త పాశుపతములో మగల నెత్తినవానికి సం
బంధించుకున్నను, పాశుపతములో మున్నుదాహరింపఁగా మిగిలిన మఱికొన్ని
సుప్రయోగము లుదాహరించుచున్నారము.

అవ్వల :— "అవల" అని యుండవలెనేకాని యిటు లుకారమన్య
ముగా నుండరాదని కృతఘ్నులవాదము. ఇదివఱలోఁ జూపిన ప్రయోగముల
కన్న నీప్రయోగము దిద్దవలనుపడని దను నంశము మనమందుంచికోఁగోరుచు
న్నారము. — చ॥ అతఁడు మహాదిగంతవిజయ మ్మొనరించి సురాద్రి (యౌల)
నున్నతనిజమైన లాంఛనము— (నరసభూపాలీయము, ౧ ఆ) అవ్వల, అనునది
యున్నంగాని, ఔల సిద్ధింపదు. కావున నిదివఱలో నిచ్చిన దానిని దిద్దినచోఁ
బ్రయోజనము లేదు.

తాపసి :— దీనింగూర్చి పాండురంగ మహాత్మ్యమునుండి ప్రయోగ
మును జూపితిమి. అంతలోఁ దృప్తి నంది కృతఘ్నులావిషయమును వదలికొనిరి
ఈయొక్క విషయమే కాదు, పాపము! నూఱులకొలఁది తప్పులు పట్టి వాని-

వానికిఁగా మేమిడిన సమాధానముల నన్నిటిని గైకొని తృప్తినందియే యున్నారు, కాని యూరక యున్నచో దర్బారుకవిత్వమునకు భంజకముగా నుండు నని యేవో వెఱ్ఱి మొఱ్ఱివదరులకు దిగినారే కాని యిందు విజయము చేకూరు నను నుద్దేశము స్వప్నముననేని వాండ్రకు లవమును లేదు. కాని యొక నమ్మకము మాత్ర ముండవచ్చును. మనము పరాస్తపాశుపతములో నూరక యుఁబుసుపోక వదరిన పిచ్చికూఁతలను వారు గణింపక యుపేక్షించి తీరుదురనియు.దానివలన మూర్ఖలోకమేని పైకోటే మనదిగా భావింపక పోదనియు దానిచే -చోరాయ లాభాయ- గా సంతసింప వలనుపడుననియు నెంచి, శివవాదమును విష్ణువాదమును జేయ మొదలిడి ధర్మసత్రమును ఱీఁకి భూమిపాలొనరించి యాగృహస్థునకుఁ గనుపట్టకుండఁ బాఱిపోయిన జంగమయ్యను సాతానిని మనమందుంచుకొని యీవదరులకు మరల నుపక్రమించిరని లోక మెఱుఁగుఁగాక. అట్లుపేక్షింపవలసియున్నను దెలిసినవిషయము నొరులకు బోధించుటయందే కృతనిశ్చయులమైన మేము పీంద్ర వదరులను నిమిత్తమాత్రముగాఁ బుచ్చికొని మాసంగ్రహించిన ప్రయోగాదికము మఱికొంత యిందుఁ బ్రచురించితిమి. ప్రకృత మనుసరింపుదము.

ద్విపద॥ చూపఱుల్ గీర్తింప సురలు శంకింప। (తాపసి) మైవెంపఁ దరుణి మై వెంప॥ (బసవ పురాణము) ఇటఁ దాపసి పురుషుఁడేకాని స్త్రీ యని వదర వీలు లేదని యెఱుఁగఁదగు.

మఱియు -ద్విపద॥ కన్నప్ప (తాపసి) కరయూరిచోడు... చెలఁగుచుఁ (దాపసి) చెప్పినయట్లు- (పండితారాధ్యచరిత్రము) ఇట్లెందఱో కవులు వాడియున్న యీపదము లోనగు పదములను దప్పు లని,చీవాట్లఁబడిన మాదేవయ్యలు మరలఁ బరాస్తపాశుపతమను పేరితో నేవో వదరదొరఁకొనుట యెందులకో? వీరలు కిక్కురుమనక వదలికొన్న స్థలము లెల్లఁ జూపుచో నెన్నియో కాగితములు నింపవలసివచ్చును గావ నందుంగూర్చి పాశుపతముం జూడఁగోరెదము. తాము చూపిన తప్పులలో నొకటియేని బిఱువోదను నమ్మకముతోఁ బ్రతిజ్ఞలు కొట్టికొట్టి తుట్టతుద కొకటియేని నిలిపికొనఁజాలని దౌర్భాగ్యదశ కగ్గమైన మావదరుఁబోతుల యవస్థకు మేమును విచారించుచునే యున్నాము. ఐనను విద్యా విషయము వ్రాయక తప్పదుగదా!

శిరసావహించు:— ఇది, విశాంపతి, అను ప్రయోగము నాక్షేపించుచు, -చేమకూరి వెంకన్న -శిరసావహించు- ప్రయోగమువంటి- దని యేమేమో వదరి యున్నారు. సమాధానము పాశుపతములోఁ బూర్తిగాఁ గలదు. మఱియొక మహాకవిప్రయోగ మిటీవలఁ జిక్కినది. -సీ॥ అఖిలవేదాతీతుఁడైన శ్రీమన్మహా దేవుండు నిను శిరసావహింప (వరాహపురాణము)

ఇట్లెన్నియో వీరు తప్పులనుకొని తెగవెక్కిరించిన ప్రతివిషయమునకును బ్రయోగములు కలవు. శాస్త్రసమ్మతియును గలదు. చిన్నతనముచే వీంద్రును, అనుభవముచాలక వీరిసహాయులును భ్రాంతి పడిరి. పరిశ్రమచేసి పాశుపతముచే భ్రాంతిని వారించితిమి. ఇఁక నేని వదరులు మానుట యుక్తముకదా! అట్లొన రింపని వీంద్ర నెవరు మాన్పఁగలరు? -బ్రహ్మణాపినశక్యతే, భవతు-

ఇంతవఱకు వీండ్రొకరి నాక్షేపించి తెచ్చికొన్న యవమానమునుగూర్చి కొంచెము తెల్పితిమి. ఇఁక నొరులు వీండ్రి నాక్షేపింపఁగాఁ దప్పుడు త్రోవ లతో సమాధానము లిచ్చి తాండవమాడు విషయము నొకదానిని సూచించెదము.

నింబశబ్దమునకు -వేఁప- అనియేకాని -నిమ్మ- అను నర్థములేదు. ఉన్న దని మాశిష్యులు వ్రాసిరి. దానికి నిఘంటువు నొకదాని నుదాహరించిరి. అందు, -లకుచో లికుచో నింబో డహుః-అని యున్నది. కాని యది ప్రమాదపతితమగు పాఠము. ఆ ప్రమాదము నీక్రింది యక్కరములు ధ్రువపఱుపఁగలవు. -నింబూ, స్త్రీ- నిబి సేచనే, ఊ,... జంబీరభేదే,...నింబుక, నింబూక,...తస్యఫలం, శ్లో॥ -నింబూక మంబు వాతఘ్నం దీపనం పాచనం లఘు- శ్లో॥ నింబుకంక్రిమి సమూహనాశనమ్-॥ "నింబ, పుం, నిబి, సేచనే, అచ్, వబయో రైక్యా న్మః, ......శ్లో॥ నింబం ఫలం రసే తిక్తం,...నింబతైలంతు కుష్ఠఘ్నమ్,...... (వాచస్పత్యమునుండి) అందెతయో వ్రాయఁబడియున్నది, గాని యీశబ్దము 'నిమ్మ' అను నర్థమిచ్చునక్కర యొక్కటియు నందు లేదు. కావున మాశిష్యు లుదాహరించిన యభిధానరత్నమాలలోని పాఠము "లకుచో లికుచో నింబూ ర్డహుః" అని యోకారము నూకారముగా దిద్దితీరవలయును. అది లేఖనప్రమా దముగాని గ్రంథకర్త పొరపాటు కాదు. వాచస్పత్యమునం దుదాహరింపని నిఘంటువులు లేవు. అయ్యది నిఘంటువు లను నదులకు సాగరమువంటిది. పాపము మాకృతఘ్నులుకూడ దానిపై నింతవఱకు నేవిధమైన వదరులును వదరినవారు

కారు; ఇఁక వదరుదురేమో! అది యటులుండె. 'నింబ'కు 'నిమ్మ' వికృతి కాదు. వికృతి యనుమాట యాపాతరమణీయముగాఁ దోఁచినను విమర్శనాసహము కాదు. కావుననే దేశ్యమని శబ్దరత్నాకరము వ్రాసినది. 'నింబూ' నుండి 'నిమ్మ' పుట్టిన దనునెడలఁ గొంతవఱ కొప్పికొనఁ దగియుండును; గాని దానివలన శబ్దరత్నాకరము దేశ్యమని వ్రాసినవ్రాఁత ఖండింపఁ బడినఁ బడునేమోకాని, "నింబంబంత" అను మాటకు నిమ్మకాయయంత అని యర్థముచెప్పి వితండవాద మొనర్చువాండ్ర కప్పుడును ఫలము కలుగదు. ఈవాదము ప్రస్తుతము కాకున్నను బ్రసక్తానుప్రసక్తముగా నిందుఁ గొండొక వివరింపఁబడియె. నింబశబ్దమున కెన్ని జన్మము లెత్తినను "నిమ్మకాయ" అను నర్థము సాధింపరాదనియు మం॥ కృ॥ దై॥ గారి వాదమే యుక్తమనియుఁ జదువరు లెఱుఁగుదురుగాక. దైవవంచితులకు దొరకు నాధారములుగూడ నంతటింతవే దొరకుననుటకు వక్షిరస్ఖాలిత్యము గల నిఘంటువు మాదేవయ్యాల కీవిషయమునఁ దటస్థపడుటయొక యుదాహరణముగాఁ జూచికొనఁదగు. తమరచన నాక్షేపించినపు డెట్లో పాల్పుపడుదురుగాక. ఒకరి నాక్షేపించునప్పుడు తగినంత పరిశీలకతతో నేల పాలుపడఁగూడదో! అది యటులుండుంగాక; ఏశాస్త్రజ్ఞానముతోఁగూడ నవసరము లేకయే దొరకఁదగు తప్పొకటి మాపాండవాశ్వమేధమునఁ బ్రథమ ముద్రణమున దొరలినది కలదు. వీండ్రికు నిజమైన తప్పులు పొడకట్టు నదృష్టము లేనికారణముననే యయ్యది చిక్కినదికాదు. చిక్కుచో మేముగాదు వేఱొకరేని యయ్యెడలఁ జెప్పదగు సమాధానము లేదు. ఇందునుగూర్చి అశ్వమేధ పీఠికతుదను గొండొక చర్చించి సవరణమును జూపి యుంటిమి. కాని ఆ సవరణలోఁ గూడ నిప్పటికిని బొరపాటు గలదు. ఈ"పరాస్తపాశుపత" రచనకుఁ జాలదినములకిందటనే యయ్యది ప్రకటిత మైనను వీండ్రి కిటీవలనిలిచియున్న మాప్రమాదశేషమేని చిక్కినదికాదు అదృష్టవంతులను జెఱుచువారును దురదృష్టవంతులను బాగుచేయువారును నుండరుగదా! ఆయొక్కటి చిక్కినంతలో వీండ్రెత్తిన యుద్యమమెల్ల ఫలవంతమగునని కాదుకాని యేమైనను నొకటియేని దురుద్ధరమైన ప్రమాదమును జూపినట్లు సంతసింప నవకాశము కలుగవచ్చును. ఆదోషశేషము, "వారు నేఁటికిఁ బ్రత్యుపకార మిట్టు లాచరించిరి" అనునది. అశ్వమేధ చతుర్థాంకమున 59వ పుట 6 వ పంక్తిలో

సవరింపబడినది. పయి ప్రసంగమున కిచటఁ బ్రసక్తి యేమనఁగా వెం॥ రా॥ లు దైవవంచితులనియు, వీండ్రు తప్పులు తప్పు లని వ్రాయక యొప్పులు తప్పులని వదరి చీవాట్లు తినుటకే జన్మించిరనియు,బుజువుచేయుటకుఁ బ్రస్తావించితిమి. వీండ్ర పరాస్తపాశుపత మెల్ల ముట్టిపొగరు వదరులతోడనే నిండి యున్నది. ఉండుఁగాక; గ్రంథవిమర్శనాదులలో నెట్లో యప్రమాణ వాదము లొనర్తురుగాక. అయ్యది భ్రాంతిమూలక మని సరిపెట్టుకొన వచ్చును. బుద్ధిపూర్వకముగా నప్రమాణమునకు దిగి వ్రాయుచున్న యీ దురాగతపు వ్రాఁతలం దిలకింపుఁడు.

"ఆ॥ ... కలుష మనక మూడుకాళ్ళ ముసలి। యైన తండ్రిమీఁద నాగ్రహముం బూని। యిల్లు వెలిచెనంట యీఘనుండు" (రామకృష్ణ మహాభారతము, రామపర్వము) ఆగ్రహించి నేను మాతండ్రిగారి నిలువెడలగొట్టినాఁడనఁట! వాండ్రు తల్లి కడుపుచల్లఁగా నింతమాత్రమే వ్రాసి విడిచిరి. ఏదో యొక హేతువునుఁగూడఁ గల్పింపనియందులకు సంతసింపవలసియే యున్నది. పైదురాగతపు వ్రాఁతనుగూర్చికూడ నేనిందు ఖండింపఁబూనుట యుపహాస్యాస్పదము కాకపోదు. అయినను దూరగులకొఱ కించుక వ్రాయుచున్నాఁడను. నాగురుభక్తి యెట్టిదియో దేవీభాగవతమువలన జగ మెఱిఁగియుండును. గురువులలో నొకరుఁడగు తండ్రి నిలువెడలఁగొట్టువానికి నొజ్జయందు మాత్రము భక్తియుండెడినా? ఏమాత్రము విమర్శనాజ్ఞాన మున్నను నింతతోఁ దేలఁదగిన విషయమున మాకృతఘ్నులిట్టికుకల్పనకుదిగుట కెంతయువిచారింపవలసియున్నది. అవును, పాపము! వాండ్రదతప్పేమి? ఏపూర్వజన్మప్రారబ్ధవశముననో వాండ్ర కీజన్మమున మహాపాతకరాజమగు కృతఘ్నతాకాలుష్యము సంఘటించినది. దాని నపనయించుటకై యెన్నితప్పుడుఁగూఁతలు కూసినను దుద కయ్యది "ముల్లుపుచ్చి కొఱ్ఱడచిన చందమై" వృత్రాసుర బ్రహ్మహత్యవలె మెడకుఁ జుట్టుకొని వంటింట దాఁగికూర్చుండుటకుఁ గూడఁ దావొసంగక యెంత యత్నించినను పైకిఁ దలయెత్తనీయక పీడించుచున్నది. అందుల కుపాయమేదియును లేక తుట్టతుదకు 'సంధ్యావందనం నమ్మగురువు కిల్లా' 'నాకేకాదు మాయింటిల్లి పాదికిని' అను తెలుఁగునఁ దమ కృతఘ్నతను మఱికొందఱకుఁగూడ నాపాదించి 'పదిమందితోటి చావు పెండ్లితోసమానము' గా సంతసింపవచ్చు

తని మాకృతఘ్నులు పైవిధమున దురాగతమునకు దిగి పరాక్రమించుచున్నారు. కాని యిందొకతప్పు నాదికూడఁ గలదని కొందఱు స్థూలదృష్టు లనుకోవచ్చును.

క॥ కులటం గులటా యన నది కులకాంత న్నాఱుసార్లు కులటా యను నవ్వుల నవ్వుల నవ్వులరఁగఁ గులటనె యని గేరి మెచ్చుకొనుఁ దననేర్పున్॥ (కవిసింహగర్జితములనుండి) అనుసామెత నెఱిఁగిన వెం॥ శా॥ గారు పూర్తిగాఁ గృతఘ్నులైనను గృతఘ్నుఁడని ఋజువు చేయుటచే శిష్యునికిట్టి దురాగతపు త్రోవకు దిగవలసివచ్చిన ట్లూహింపవచ్చుననుట సత్యమార్గము గాదు. కాని యేమైనను గృతఘ్నతావిషయ ముపేక్షార్హము కాకుండుటచే నట్లు వానికి దను పడి మిన్నకుండ వీలు గాదయ్యెను.

శ్లో॥ శక్తో య స్థాపితుం ధర్మ ముపేక్షాం కురుతే నరః, సోఽసిపత్త్రవనం నామ నరకం ప్రతిపద్యతే" అందుచే శిష్యునికి బుద్ధిచెప్పు టావశ్యకమైనది. వానికో, యిందుచే నాపై నపవాదలు వేయు టావశ్యకమైయుండును. అటుచో నిందుఁ బరిణోపాయ మేమి? తరణోపాయమే లేదా? మున్ను రజకాపవాదునిచే నపవదింపఁబడిన సీతాపాతివ్రత్యము మట్టి నశించి పోయినా? పోలేదుగదా! అట్లే నాపితృభక్తియు నింతమాత్రమునఁ గళంకితము గాదు. అయ్యెడ రజకాపవాదుని కున్నంతయేని యియ్యెడ నీకృతఘ్నాపవాదుని కపవదింపఁ దగినయవకాశమున్నదా యందు లేదని వినుఁడు.

కొంతకాలము విద్యాభ్యాసమునను, మఱికొంతకాలము విద్యావ్యాపనమునను బయిలె నతలప్రవాస మొనర్చిన నేను సుమారు పదివత్సరములకు మున్ను బందరున కుపాధ్యాయత్వమిషచే వచ్చినాఁడను. అప్పటికి మాతల్లిగారు జీవించియుండిరి. కాన నాతో మాతండ్రిగారు రావలసిన ప్రసక్తియే లేదయ్యె. పిదప సుమారు రెండు సంవత్సరములకు తల్లిగారు స్వర్గగతులగుట కతన మా తండ్రిగారు నాతో రావలసివచ్చినది. వారెన్నఁడుగాని ప్రవాస మొనర్చినవారు కారు. ప్రవాసమందుఁ గాని దాని నొనర్చు నాయందుఁగాని యితరు లందుఁగాని వారి కంతగా గౌరవము లేదు. తామున్నను నేకపుత్రవిషయ ముగుటచేత నన్ను వదలి యన్యత్ర నుండుట కిచ్చగింపక బందరు వచ్చి యెప్పటి కప్పుడు స్వదేశవాసమునకు నన్నుఁ బురికొల్పుచు నాలుగేండ్లవఱకు బందరు నందు వసించిరి. నేనును వారియాజ్ఞంబట్టియేమి, స్వదేశవాసమునందలి

కోర్కెఁ బట్టియేమి, యెప్పటి కప్పుడే గమనోన్ముఖుఁడనయ్యు నిక్కడి యన్నోదకఋణానుబంధప్రసక్తి తీరనికతన నిప్పటికేనిఁ గృతకృత్యుఁడను గాఁజాలకే పోతిని. అట్లు నాలుగు వత్సరములు మాతండ్రిగారిట వసించిన పిదప నొకపరి వారి శరీరమున కెక్కుడుగా జబ్బు చేసినది. అది వైద్యము కతన నివర్తించినపిదప వారాజబ్బు బందరునీటివలనఁ గల్గినది యనియు నిఁక "నే నిట వసింపఁ జాల" ననియుఁ బట్టు పట్టిరి. దానిపై "నీకుఁ గొన్నాళ్లుండు రేని యందఱమును స్వదేశమున కేగుదము, ఏక పుత్రవిషయములో మీ రొకచో నేనొకచో నుండుట ధర్మముగా నుండ" దని బతిమాలితినిగాని, వారి యుద్యమమును మరలింపఁ జాలనైతిని. పైగా వారికి బందరు మాగ్రామము వలెఁ బుణ్యనదీతీరము కాదని కూడ సందియము కలదు. దానంజేసియు దీనం జేసియు నన్నెట్టకేల కొప్పించి వారు స్వదేశములో మా చెల్లెలిగారియింట నే నామ గ్రామమునఁ బ్రవేశించిరి. "స్వతంత్రేచ్ఛస్య మునే ర్నియోక్తు మశక్యత్వాత్" అది మొదలు నే నెప్పటి కప్పుడు స్వదేశగమనమునకై మఱింత యత్నించుచునే యుంటినిగాని దైవ మనుకూలింపలేదు. పుస్తకముల ముద్రణము ముఖ్యముగా నుపాధ్యాయత్వ ముపసర్జనముగాఁ బెట్టికొని నేనిట నుండుట లోకు లెఱుఁగనిదికాదు. పుస్తకములలో నింకను నెన్నియో యముద్రితములు నిల్చి యున్నవి. ఆయీవ్యాపారము పల్లెటూళ్లలో సాగఁదగినది కాదు. ఇదియే నాస్వదేశగమనము నరికట్టుచున్న ప్రతిబంధకము. ఏమైనను గొలఁదికాలములో స్వదేశమున కరుగఁదలఁచియేయున్నాను. ఇప్పుడేని సెలవులరాకకుఁ బూర్వమే స్వదేశమేగి ప్రతివత్సరమును మాతండ్రిగారితోఁ గలిసికొని పితృపితామహార్జితవసతియగు కడియము గ్రామములో నియతముగా రెండుమాసములును వసించుచుంటిని. నారాక కెప్పు డెప్పుడని యెదురుచూచు మాతండ్రిగారు నే నరుగక పూర్వమే కడియమున కాలామడలోనున్న యేనామునుండి బయలుదేరి వచ్చి నన్నుం గాంచి యానందించుచుందురు. వారు వత్సరమునకు రెండుమాసములు నాయొద్దను పదిమాసములు మాచెల్లెలియొద్దను వసించుట మాకృతఘ్నుఁ డెఱుఁగనిదికాదు. మామాసౌహార్ద మెఱుఁగనివాఁడును గాఁడు. కాని వానికిఁగల కడుపుమంటచే నెట్టెట్టో యపవదింప మొదలిడినాఁడు. ఇల్లువెలువరించిన పుత్రునియొద్దఁ, గాదుకాదు శత్రునియొద్ద, వత్సరము

నకు రెండుమాసములే కాదు రెండుదినములేని యేతండ్రి నివసించుట కిచ్చగించు
నని యెవరేని చీవాట్లు పైవఁగలవార లుండకపోరని వాఁడనుకొనియుండఁడు.
ఇంత పరిశీలన యెవరికిఁ గావలసి వచ్చుననియు, ఏమో యతఁడు పితృద్రోహి
కాఁగూడదాయని దూరగులేని విశ్వసింపకపోదురా యనియుఁ దోఁచినట్లెల్ల
నదర దొరఁకొనియెను. సర్వగృహమేధిసాధారణమగు నీమాత్ర మవకాశము
తప్ప వాని కేవిధమైన యవకాశముగాని దొరకలేదనుటకు వాఁడు వ్రాసిన
దురాగతపు వ్రాఁతలోని "ఆగ్రహించి" అను, నిర్హేతుకాగ్రహ ప్రవాదకథనమే
చదువరు లుదాహరణముగాఁ గైకొనవచ్చును. ఆయీఘట్టమున నెన్నో తప్పుడుఁ
గూఁతలకుఁ జాలఁబద్దెములు వమ్ముచేసిన సాహసికి వారిపై నాకాగ్రహ మేల
రావలయునో తెలుపఁగల కొన్ని యక్కరములు విస్తరభీతిం గలిగించెడినని
యెవ రనుకొందురు ? ఇదిగాక యింత దురాగతము మొదట నుండియు వీని కల
వడినచో నీతప్పుడువదరులే "యప్రస్తుతప్రశంస" లోనో వదరవలసియుండును.
ఇనికిని నాకును గలహమునకుఁ బూర్వమే మాతండ్రిగారు నాయొద్దనుండి స్వదే
శము ప్రవేశించి యున్నారు. క్రమముగాఁ బాపము పండి కన్ను మిన్నును
దెలియక పరాభవసన్నిపాతము ముదిరి యిట్టి దురాగతములకు దింపుచున్నదని
పైహేతువులవలనఁ దెలియఁదగు. అయ్యో ! తప్పివచ్చెఁగదా యని వీఁడియ్యది
చూచినమీఁద నేవో హేతువులనుగూడ నపవదింపక పోఁడు.

అబద్ధమున కర్థమేమి, మొండికాలికిఁ జెప్పేమి?
నరకేసతి కోపోష్ మరణేసతి కింభయమ్
మొండివాఁడు రాజుకన్న బలవంతుఁడు.

వీండ్ర మొండితనము, వీండ్రి యసత్యపాండిత్యము, వీండ్రి యపత్రపా
శూన్యత్వము ఇయ్యవి మేము తెలుపనక్కఱలేదు. వీండ్ర -మహాభారతమే- సహస్ర
ముఖముల ఘోషించెడిని. అందు నేడు పర్వములవఱకు విగ్రహారాధనపీఠిక
విమర్శించినది. ఈతప్పుడు ప్రసంగము దాని కిటీవల వెలువడిన 8 వ పర్వము
నందలిది గాన నందెక్కదయ్యె. వీవ్రాఁత వ్రాసినను వీండ్రు సమీపస్థులు విశ్వ
సింతురనికాదు, కేవలము దూరగులను గికురించుటకే. వారు మాత్రము మూర్ఖులా?
ఎవరికో వ్రాసి నిజము తెలిసికొనకుందురా? ఇట్లు శృంగభంగమునందలి తత్త్వ
మును దెలిసికొనినవా రెందఱులేరు! ఎంతోదూరమునందున్న కలకత్తానివాసునకు

దానితత్త్వ మెంతలోఁ దెలిసినది. అట్లే యిదియును "నిజము నిలకడ మీఁద దెలియును" అను లోకోక్తికి స్మారకముకాకపోదు. వ్రాసి తెలిసికొనఁ వారు మాకృతఘ్నునికిఁ బెద్దతల్లికొమరుఁడును (ఈయన కీబాంధవ్యముతప్ప వేఱొండు కళంకము నాపాదింపవలనులేదని యెఱుఁగఁదగు) గడు నుత్తముఁడును, ఏనాముపోస్టు మురుమళ్లపోలవరగ్రామ నివాసియును నగు ఆకొండి రామమూర్తిగారికిఁ గాని, ధవళేశ్వరముపోస్టు మానివాసగ్రామము కడియమునందలి సంపన్న గృహస్థులలో నొకరును మాకృతఘ్నునికిఁ జాలఁగూర్చు చుట్టములును విద్యావయోవృద్ధులును నగు చామర్తి వెంకటాచలపతిగారికిఁగాని వ్రాసినచో నాపితృభక్తియు నాయెడల మాతండ్రిగారికిఁ గల యనురాగసంపత్తియు వేఱు వేఱు చోటుల నుండుటకుం గల కారణము వారు తెలుపక మానరు. ఈవిషయమై మాతండ్రిగారికిఁగాని, వా రెక్కడ నివసించుచున్నారో, ఆ నా చెల్లెలిభర్తకుఁగాని వ్రాసినను దెలియనయ్యెడినిగాని యేమైనను వారు తెల్పుట యంత బలవత్తరమైన సాక్ష్యము గాదు. ఎంత యపాత్రునందైనను గొడుకు నెడలఁ దండ్రి దోష మున్నదని వ్రాయక పోవచ్చును. వ్రాయనీయకయుఁ బోవచ్చును. "కడుపు చింపికొన్నఁ గాళ్లమీఁదఁ బడును" అను లోకోక్తి నెఱుఁగనివా రెవరు? కావున మాకృతఘ్నుని కత్యాసన్నులగు వారివలననే పైవిషయము తెలిసికొనుటవీలు. పేరెత్తిచూపిన యీయిరువురకే వ్రాయవలయు నను నియమముతోఁ బనిలేదు. ఆగ్రామములకే యక్కఱలేదు. చుట్టుపట్లగ్రామములకేని వ్రాయనగు, బందరు గ్రామమునకుఁగూడ వ్రాయవచ్చును, పూర్ణమైన హక్కుతోఁ జేరిన తండ్రి నిలువెడలఁ గొట్టవలసివచ్చినపు డద్దాని నెందఱు విని యుండవలెను. సుఖ సుఖాల నిలు వెడలి పోవుటకుఁ దండ్రి యతిథిసంతివాఁడు గాఁడుగదా! -శాంతం పాపమ్, ప్రతిహత మమఙ్గళమ్-

ఈవిచారణ మిటులుంచి వారిపోషణమునకు సంబంధించిన చరిత్రమున కుపోద్ఘాతప్రాయములగు మాకృతఘ్నుని మఱికొన్నివదరులంగూడఁదిలకింపుఁడు.

"క॥ నెలనెలకు నించుకించుక కొలబత్తెము కొడుకు కొసంగఁ గూటికినిఁ గుడ్డలకును జాలకయాతఁడు కలకాలము నిట్లు పాట్లు గనవలయునొకో॥ (రామకృష్ణమహాభారతము)

కాలనేమిచర్యా స్ఫోరకములగు పైవాక్యములఁదిలకించితిరా? మాతండ్రి

గారికి నేను నెలకుఁగాని సంవత్సరమునకుఁ గాని నాస్వార్జితమునుండి పైసయేని యీయవలసియు లేదు, ఇచ్చుటయు లేదు. ఇట్టిస్థితిలో నామాత్రమేని యిచ్చుచున్నట్లు వ్రాయు మాకృతఘ్నుఁడు కడు యోగ్యుఁడుగదా! మాతండ్రిగారు పితృపితామహార్జితమగు భూమిశిస్తునుండి రైతులవలన సం॥ 1 కి రు 82-0-0 మాత్రము కైకొని మాచెల్లెలిగారి కిచ్చి వారియింటఁ బదిమాసములును వసించుచున్నారు. వారి కవసరములేక కైకొనుటలేదు గాని యంతకధికము కావలసియున్నను నన్ను వారడుగవలసిలేదు, వారి భూమియే వారి కీయఁగలదు. ఈయంశమిక్కడ నేను క్రొత్తగా వ్రాసినదికాదు. సుదక్షిణలో వేఱొక ప్రసక్తిలోఁ దెల్పినదియే. ఇది కొలబత్తెమో వారి యిచ్ఛానుసారమగు పోషణమో ప్రాజ్ఞులు విచారింప నర్హులు. మఱియు నీదురపవాద లిఖించుఘట్టమున మాతండ్రిగారి నీ నికృష్టుఁ డెంతో నీచముగా నపవదించెను. అది యంతయు నిచ్చోట విస్తరించుట యుక్తముగాదు, ప్రస్తుతమును గాదు. ఏవిధమైన మనోవైషమ్యములుగాని మాతండ్రిగారికిని నాకును లేవు, అనునదిమాత్రమే ప్రస్తుతాంశము, అదియే విచార్యము. మఱియు మాకృతఘ్నులు వెం॥ రా॥ లలో రెండవవాని తండ్రిగారును కొడుకును మావలెనే వేఱువేఱుచోటుల వసించుచున్నారు. అవసించుటకుఁ గలకారణమును మేము శతధా సహస్రధా కాఁకరపఱ్ఱ వాస్తవ్యులవలన వినియుంటిమి. కాని యొకఁడు చెప్పఁగొఱికిన వేఱొకరుఁడు సిద్దిగొఱుకుటకు సిద్ధపడినటు లుండు నావ్రసంగ మిటవిస్తరింపఁ దలఁపము. ఆయనయు మాతండ్రిగారివలె నేకపుత్రికులే, వృద్ధులే; మామానివాసములవలె వారివారి నివాసగ్రామములు దూరములును గావు; బందరునకును ఏవామునకును నెంతదూరమో కాఁకరపఱ్ఱకిని పిఠాపురమునకును నెంతదూరమో యిందువ్రాయవలసి యుండదు; కావున నాయనఘుఁడు కొమరుఁడుండు చోటున నుండక స్వగ్రామమందే వసించుటకేమి కారణమున్నదో సూక్ష్మమతులు విచారించినఁ దేలకపోదు. ఆయన పూర్వాచారపరాయణులు, కొడుకు బ్రహ్మసామాజికమతప్రవిష్టుఁడు; అట్టిస్థితిలో నాయనఘుఁడు "పుత్రమంతేచకర్మణి" అను వచనము నీ సామాజికప్రబుద్ధుఁడు సార్థకపఱుచు నని యెట్లు విశ్వసింపఁగల్గెడిని; కావున నెట నున్న నేమగు? ఆయన యీప్రబుద్ధుని విషయమునఁ బొందుచున్న విచారమునకుఁ బారమే లేదని విందుము. ప్రకృతము వారి విచార

మిందెత్తుటకుఁ గల పరిసక్తి ఆపితాపుత్రులకుంబలె మాపితాపుత్రులకు మతవైమనస్యముగాని ఆచారవైమనస్యముగాని లేదని తెల్పుటకేయని యెఱుఁగఁదగు అంతియకాని వాండ్రితోఁ దుల్యత్వము సంపాదింప నుంకించుటగా భావింపకుందురుగాక.

ఇక ప్రస్తుత మగు పురశ్చరణమునకు సంబంధించిన పద్యములు కొన్ని మాత్ర ముదాహరించి యిది ముగించుచున్నారము.

ఉ. పాశుపతమ్ముచేఁ దెగి నభస్థలి నిట్టటు వ్రేలుచున్న న
ష్టాశము సింధురాజశిర మాపయిఁ బ్రేలద హేతు వేమి? దు
ర్ధీశబలమ్ముకా! తిరుపతీ! యదియుఁ జ మతిపేర్మి దేల? ల
జ్జాశకల ప్రచారవివశ మ్మది వీ రటు కారు వీఁటికుల్.

ఉ. జుట్టెగఁదట్టుచుఁ జ వపుడశుద్ధి నుపానహ మూని చేయు న
ష్టట్టునఁగూడ మోఱకు లవాకుచవాకులు గూయమాన ర
న్నట్టులు వాఁడు పాశుపత మట్టులోనర్చినమీఁదఁగూడ నీ
చెట్టుల తప్పఁగూఁతలు నశింపనికారణ మేమి తిర్పతీ!

మ. దనియాలంబలెఁ జేసి పోవిడిచినన్ ధార్ష్ట్యమ్ములన్ మాన రీ
యనయుల్; వీరలు రక్తబీజులో! లులాయాకారమున్ మున్నగై
కొని దుశ్చేష్టలొనర్చినట్టి యల రక్షోవీరులో! కాకభూ
జనులం దిట్టి యపత్రపావిరహితుల్ జన్మించుటల్ వింటిమే॥

చ. అతిమతి నేవియో గిలికి యజ్ఞుల వంచన సేయు నీధురం
ధరులకునై "పురశ్చరణ" తాడన మొప్పకయున్నె! తత్పుర
శ్చరణముకల్మిఁ బాశుపతచండిమ మెందు నఖండమై పొరిం
బొరి నపలాపధార్ష్ట్యమును బూది యొనర్చెడుఁ గాక వీఁకమై॥

ఉ. అంక మొకింత కల్గని మహాత్ముల మధ్యగ నుంచియో, నిరా
తంకుల మధ్య నుంచియొ 'శతఘ్ని'ని 'బాశుపతమ్ముఁ' దెచ్చి స
ర్వంకషులైన పండితుల భావముఁ జ దనియింప రాదె? యీ
పెంకెతనంపుఁగూఁతలు బిభీషికలున్ మఱి యేల కాల్పనే!

సంపూర్ణము.

—o—

# ఉపోద్ఘాతము

ఉ. ...వృథా తిట్టెడిపట్ల గ్రామ్యులకుఁ జెల్లెవిశేషము గాన వారలన్,
గట్టిగ మేపి తిట్టుఁడనఁగాఁ దగదో తమకేటికీ శ్రమల్. (గిరతము 1భా)

పాఠక మహాశయులారా!

మాచే దృణీకరింపఁబడిన 'శృంఖల' అను నపభ్రంశపు విమర్శనము, పై నుదాహరించిన గిరతపద్యానుసారముగ బయలువెడలినది. ఈ కర్త బ్రాహ్మణ వంశసంభూతుఁడు. తక్కిన యంశములు స్వకృతాపరాధసదృశమై శిక్షింపఁ బడు చున్న యితని విమర్శనమువలననే తెలిసికొనఁదగు. ఈ బ్రాహ్మణుని పూనికను ఒకువురు ప్రాజ్ఞులు నిరసించియున్నారు. అందుండి దిఙ్మాత్రము నుదాహరించి చూపుచున్నారము.

---

(1) పాణిగృహీత, శ్రవణానందము, అనెడు పుస్తకములయందుఁ జూపిన వెక్కి మొక్కి కళంకలఁ జూచితి.

బొడ్డుపల్లి శేషయ్య బోర్డుస్కూల్ మాస్టరు,
తాడికొండ, 9-7-13

(2) "శృంఖలను గూడఁ దెప్పించి చదివి యసహ్యమును జెంది యాకలాభివర్ధని మేనేజరుగారికి నాయభిప్రాయమును వ్రాసిపంపితి"

చివుకుల అప్పయ్య, సికిందరాబాదు.

(3) ఉ. జ్ఞానమెకింత లేక, విరసం బగుపల్కులు గొన్ని పల్కి క
య్యానకుఁ గాలుద్రవ్వి, బిడియంబు త్యజించి, యసూయనించి, యిం
తేనియుఁ గొంకులేక, రచియించిన "శృంఖలఁ గాంచినాఁడ న
జ్ఞానము వెట్టవెట్టుచు నశక్తిని జాటుచునుండె మెండుగన్"

భ. చి. యజ్ఞనారాయణశర్మ, మాడుగుల, 12-5-13.

---

ఇట్లుదాహరింపఁ బూనుదుమేని గ్రంథము విస్తరించును. ఈ బ్రాహ్మణుఁడు పాపము! యశోర్థి యయి యుపోద్ఘాతమును వ్రాసెను. వ్రాయుటకు నిజమైనకారణమేదియైనను, మేము మాపాణిగృహీత, పంచమాశ్వాసమున నుదాహరించిన—

చ. ఇపుడిఁక నొక్కకర్మ మదియేమనఁ? జేరిచి సంతలోనఁ గ
బ్బపుఁబనులాచరింప నది పండితులౌ కవులొప్పఁ జూచి "యీ

కపితము సెప్పనేల" యని గాఢముగాఁ దలవాయఁ దిట్టి దా
నిపయి విమర్శనమ్మొకఁడు నింపుదురంతకు మమ్మడుంగుగన్"

అను పద్యార్థమే తనకుఁ జేరికమని వ్రాసికొనియెను. ఆ పద్యము "మిడిమిడి" జ్ఞానముతో నొకవేశ్య కవిత్వము సెప్ప నుంకింపగాఁ బ్రాజ్ఞుఁడగు తన్మనోహరుఁడు దానివారించుటకుఁగాఁ బ్రసంగించినది. పాప మీ బ్రాహ్మణుఁ డట్టిపండితుఁడు తాననియు నావేశ్యవంటికవులము మేమనియు నిశ్చయించికొని మమ్మడుగుగాఁ గాకున్నను జాల విస్తరించి యీశృంఖలను రచించి మాకు బుద్ధి గఱపఁజొచ్చెను. బుద్ధి చెప్పునప్పుడు తిట్టవలయును గానఁ దోచినట్లెల్లఁ దెగఁ దిట్టెను, వెక్కిరించెను, ధిక్కరించెను. ఏమేమో చేసెను. అవియెల్లఁ జూపుట ప్రస్తుతముగాదు వానికన్నిటికి నితనికిఁ గల గురుభక్తి యొక్కటియే వారకము కావలెను. తనగురువులు గురుదూషకులై యశమార్జించుచుండ వారివద్ద నొకటో రెండో యక్కరములు నేర్చుకొన్న యీవిప్రుఁడు వారిత్రోవనే పట్టకుండుట గురుమతమునకు విరుద్ధమైనను లోకులకభినందనీయము కాక పోదు—

చ. గురులశతఘ్ని బ్రద్దలయి కుప్పికిన తుక్కది మోరమీఁదికే
దొరలి దృగంతరాళములు దూళిని బ్రుంగుడువోయి కన్ను మి
న్నరయఁగ లేక యుండుతఱి నయ్యల నుద్ధరణం బొనర్ప ని
ప్పరముఁడు పూనెఁదా "నుడుతబత్తి" గ "శృంఖల" పేరివారితోన్ 1

ఆ. వె. వారి పూరియగుచు వంధ్యమయ్యెను నాంధ్ర। పత్రికకు నితండు పంద్యుఁ
డయ్యె। మమ్మఁదిట్టుగాక మహితాత్ముఁడితడు నిం। ద్యుండుగాఁడు గురు
వశుండు గాన. 2

ఈ యాంధ్రపత్రికాభిప్రాయము 38 వ పుటలోఁ జూడఁగోరెదము. నిజముగా దానిని బ్రాజ్ఞులగు నాగేశ్వరరావు పంతులుగారే (నిజమైన యధిపతి) వ్రాసిరని తలంతురేమో, యనికల్ల, వారెఱుఁగకుండ నందు గొన్నివ్రాఁతలు పడుచుండును. ఇందులకు శ్రీపంతులుగారి చేవ్రాలుగల యుత్తరములే సాధకములు. ఈ విషయమును గూర్చి మా "వేమవరాగ్రహారశతావధానపీఠిక" చూడఁ గోరెదము. ఈ యభినందనముకూడ సత్యద్వేషియు నసత్యతత్పరుఁడును నగు నొక మానిసి ప్రకటించినదియే. ఈ రహస్య మెఱుఁగనివారు మాత్ర మాంధ్రపత్రికాధిపతి మెచ్చెనని భ్రమింతురు. నిజమున కాయన మెచ్చినను గవిత్వవిమర్శన యెడల నది యింత కార్యకారి కాదుగాని యదిగూడ నిజముగాదని తెల్పుచున్నారము. ఆయన యుత్తరింప రాని విట్టి వందాయన యెఱుకలేకయే పడుచుండు

ననుట కొకటి యుదాహరించి చూపుచున్నారము. (8 వ ఏప్రిల్ 1913 సం॥ సువర్ణలేఖనుండి) మ॥ ఆంధ్రపత్రికాధిపతిగారికి—

“కవితయన నేమి, యనుశీర్షికక్రింద, మార్చి 12 వ తేదీ ఆంధ్రపత్రికలో, భ. కుమారస్వామిశాస్త్రిలుగారు వ్రాసినట్లు ప్రకటింపఁబడినది. ఈ కుమారస్వామిశాస్త్రి లెవరోగాని యాతఁడీ వ్యాసమును వ్రాయలేదు. ఈ వ్యాసమును వ్రాసినది నేను, దానిక్రింద “నిష్కల్మషులనూరక దూఱెడి తెలువులకు ధీగజఘనతఁడు” అని వ్రాసితిని. ఆంధ్రపత్రికాధిపతిగారు, భ. కుమారస్వామిశాస్త్రిలు అని మార్చుటకేమికారణమో తెలియదు. ఆంధ్రపత్రికాధిపతిగారీ తప్పును పత్రికాముఖమున సవరింతురని కోరుచున్నాను.

ఇట్లు,
నిష్కల్మషుల నూరక దూఱెడి తెలువులకు ధీగజఘనతడు.

ఈ భ. కుమారస్వామిశాస్త్రి యను పేరు కల్పితము. దీని నవలంబించి యెన్నో యనేకతిటకలు చాలపాళ్లు చాలచోట్లఁ బ్రచురించినమానిసి యొకఁడిప్పుడుఁ గలఁడు. ఆతఁడే తబ్బిబ్బులు చేయుచుండును. పాపము! పత్రికాధిపతి యేమెఱుఁగును? అందుఁ గొన్ని యెదురు తిరుగును. ఆ యెదురుతిరుగునంశములలో ‘శృంఖలను’ గూర్చిన యభినందన మొకటి, దీనింగూర్చి యడిగినచో నాగేశ్వరరావుపంతులువారు నిరుత్తరులే యగుదురో, మఱి యేమగుదురో యీ ఖండనమే తెల్పునుగాన విస్తరింపము, ఇఁకకొన్ని వ్రాఁతలుగూడ నింతకుమించిన వంటఁ గలవు.

“గండ్రతనము కవిత్వమగునా?, ... యాతఁడే కవియగునెడ” నీకఁగవి కానివాఁడెవ్వఁడు? యని సువర్ణలేఖయొక్క సాక్షి వ్రాయుచున్నాఁడు. ఈ వాక్యములను చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు జ్ఞప్తియందుంచుకొనఁ గోరుచున్నారము. (ఆంధ్రపత్రిక నుండి)

ఈ వ్రాఁత వ్రాసినమానిసి యెవరో యా యభినందనమును వారిదే. దీనిని వివరించవలసివచ్చినచో నింతట నంతటఁ దేలదు. ఇది వ్రాసినవారు నాగేశ్వరరావుపంతులుగారు మాత్రము కారు అనునది సారాంశము. వారే వ్రాసినను పైవాక్యమునందు దోసమేమున్నదని చదువరు లనుకొనవచ్చును. బోలెఁడు దూషణ మాఘట్టమునఁ గలదు. ఆ భాగము వదలి బొట్లుపెట్టితిమి. ఇట్లు వదలుట గూడ శ్రీనాగేశ్వరరావుపంతులుగారి గౌరవమును గాపాడుటకొఱకేయని ప్రాజ్ఞులగ్రహింతురుగాక. వృథాగా నట్టివా రెవరినిగాని పేరుపెట్టి యెచ్చటనో యెందు

లకో యేర్పడిన తిట్లతోఁ బెట్టుదురా ? అది నమ్మఁ దగినదియా? వారది వాదే
యని ప్రకటించినప్పుడదుగఁ దగినది బోలేఁడు కలదు గాన నిఁక నిట విస్తరింపఁ
బనిలేదు. ప్రకృత మనుసరింపుదము.

తే. గీ. కాలదోషమ వ్రాయసకానిదోష, మిందు లవమును లేదని యెఱిఁగినార,
తుది యొకర్పఁగరాని దెయ్యదియుఁ గాని తప్పు గన్పట్టదీ మాట తజ్జహితము.

ఆ కాలదోషస్వరూప మిట్టిది.

ఆ. వె. వ్రాసినతఁడు మంచివాఁడయ్యుఁ గనుఁ బరీభావి యయ్యె దానఁదవులుకతన
మఱి ప్రమాదములకుగుఱియౌటరెరా? ప్రమాదీచవత్సరంపు నీచగుణము 4

క. ఎటఁ దెగినన్ శృంఖల నతు, కుటకుం గొనిపోవవలయుఁ గొల్మికిది తృణం
బటఁబని సేయ దయోమయ, ఘటనకు నది పుట్టె దీనిగతి యేమగునో? 5

అని మాత్ర మీ బ్రాహ్మణుని 'శృంఖలం' గూర్చి విచారింప వలసియు
న్నది. ఈయనకుఁ దటస్థించిన యభినందన తత్వమును దెల్పితిమి గాన మఱికొన్ని
తప్పపరిహరణములను జూపుచున్నారము.

"పాణిగృహీతా శ్రీవణానంద శృంఖల" యిట్టి విమర్శనమునకుఁ దాము
స్వయముగా నిరసనము రచించుట యంత భావ్యము గాదేమో, "వివాహశ్చ వి
వాదశ్చ"   రాజమండ్రి, 25-6-13.   భ. సీతారామయ్య.

లోక మీ బ్రాహ్మణుని ప్రల్లదముల కుత్తరమును లిఖియించుటకే యొప్పి
కొనలేదు. సుదర్శనీపత్రికాధిపతిగూడఁ జాలవఱకు నీతనికుశంకలకు జవాబులు
వ్రాసివ్రాసి తుద కీ క్రిందిరీతిగా లజ్జించి విరమించెను.

'ఈ నడుము చాల సంచికల నుండి' ... "శృంఖల" యను విమర్శనమును
గూర్చి "విశృంఖల" యను పేరిటఁ జర్చించుచున్నాము. ఇంకను జర్చింపవలసిన
దెంతయో గలదు గాని యింతటితో విరమించుటయైనది. ఏమనఁగా? ఈ నడుమ
వీరిచే రచింపఁబడిన "వారకాంత" యను నాటకము (జూడఁ దటస్థించినది
భాషలో నింతకన్నఁ బాషిష్ఠగ్రంథమును బ్రయత్నపూర్వకముగానైన నెవ్వఁ
డును వ్రాయఁజాలఁడు ... తా నిట్టి దిక్కుమాలిన గ్రంథమును వ్రాసియు...
ప్రౌఢకవుల మనోహర కవిత్వమును పంకలోత్తుటకుఁ బ్రయత్నించిన యీ వెం
గలి వెఱ్ఱి మొఱ్ఱికుశంకలకు సమాధాన మిచ్చుటయే యసమంజసమని తోఁచుట
ముఖ్యకారణము.   (సుదర్శని)

ఇంపికన్ని విధముల నేనమును బ్రకటించువారిఁ తపై సదభిప్రాయమిచ్చు
నకుఁ దెట్టివాఁడై యుండునో చదువరులే యోజింతురుగాక. అభినవసరస్వతీ
పత్రికాధిపతి యిట్లు తన యభిప్రాయమును బ్రకటించెను.

మాకాభాగ్యము కూడఁ దటస్థింపలేదు. ఈతఁడిట్టి వాఁడయ్యు మా, వె. రా. ల
శిష్యుఁడు గాన విధిలేక మాప్రశిష్యులలో జమ కాఁబడియె. ఇతనిజ్ఞానము చదు
వరలెఱిఁగినదే కదా? ఈలాటి విజ్ఞానులే నేఁడు కాళిదాసాదులయు నన్నయాదు
లయుఁ గబ్బములనుగూర్చి గోలచేయుమహాభాగులు. ప్రకృత మీప్రశిష్యుఁడును
శిష్యులు వెం॥ రా॥ లును "కప్పకు నిప్పు పెట్టి పేలా లేరికొని తినుటకై"
యీ యుద్యమునకు దిగిరి. ఈయంశము "శృంఖల" అను పేరే తెల్పుచున్నది.
విస్తరింపఁ బనిలేదు. వారికోరిక యిటీవల శ్రీగవర్నరుగా రేర్పఱచిన సదుపా
యముఁబట్టి విఫలమగుటకు విచారింప వలసియున్నది. ఈయంశ మాంధ్రభాషాపరిష
త్పత్రిక, ప్రమాదిచ చైత్రమాససంచికలోని "పరీధావి నామసంవత్సర కార్యని
వేదనము" 8 వ పుటలో విస్పష్టముగ నున్నది. అందే 9 వ పుటలోఁ గొందఱు
ప్రాజ్ఞమహాశయు లొకతీర్పును దీర్చియున్నారు. అందు అభ్యంతరరతివర్ణనము
కూడనిదిగా నిర్ణయించిరి. ఇందుల కెంత వెదకినను ప్రాచీనలాక్షణిక సాహాయ్య
ము దొరకమింజేసి అది వారిస్వకపోల కల్పితముగా భావించుచున్నారము.

ఈ విషయము నాటకమున కావశ్యకమని సహృదయు లిదివఱకే యెఱుఁగుదురు.

శ్లో. ...రంగమధ్యే... స్తనాధరవిమర్దంచ । తథా లజ్జాకరంచ యత్,...
శ్లో. పితృపుత్రస్నుషాశ్వశ్రూదృశ్యం యస్మాత్తు నాటకం । తస్మాదేతాని
సర్వాణి వర్జనీయాని యత్నతః, (నాట్యశాస్త్రమునుండి)

విస్తరమందే చూడఁదగు నాటక మందివి వర్జనీయములని యెఱిఁగిన ప్రా
జ్ఞులు శ్రవ్యప్రబంధముల నుండవచ్చుననుటకు హేతువు సహృదయైకగమ్యము.
అది యటులుండె, యెందులకో నేఁటివారవలంబించిన యీ మతముఁ జేరి యిప్పు
డనేకులు జ్ఞానలవదుర్విదగ్ధులు గోలచేయ మొదలిడి— "ద్విత్రా యేవకవయః,
ద్విత్రాణ్యేవ కావ్యాని" యనునుక్తికిఁగూడ జంకనివారికే వంకలు పెట్టమొద
లిడిరి. ఇఁక నితరులలెక్క యేమి, మిడిమిడిజ్ఞాన మా యీ యిక్కట్టులకు
హేతువు, యితరభాషాధ్యేత లిద్దానికిఁ దీర్పరులగుటయు నీ ముప్పునకుఁ గార
ణము, యేమైనను వీరి ననుసరింపక తీరదు, కావుననే బ్ర. శ్రీ. వేదము వెంకట
రాయశాస్త్రులవారు శ్రీనాథుని నైషధమున కొకక్రొత్త త్రోవను ద్రొక్కియు
న్నారు బ్ర. శ్రీ. కల్లూరి వెంకటరామశాస్త్రులవారు పైవారివాదము లశాస్త్రీ
యములని సూచించుచుఁ గొన్ని పంక్తుల నొకట వ్రాసియున్నారు. ఆయా విషయ

మెల్ల నిందుదాహరించుట కవకాశము చాలదు. సార, మిది క్రొత్తమతము, పం డితదూరము. అని తేలును. అది యటులుండె. నేటినాగరికులలో నొకరుడు కూడ మాశ్రవణానందము నభినందించుటంగూర్చి 24- పుటలోఁ గొండొక చూపితిమి, మఱియొకటి యిటఁ జూపుచున్నారము—

అభినవరీతుల ననుసరించి సులభగ్రాహ్యముగాను, రసవంతముగను, తాము రచియించిన శ్రవణానందము చదివినమీఁదట తమచే రచితములగు యితర కావ్యము లనుగూడ, చదువ కుతూహలము పొడముచున్నది...

చెన్నపట్టణం 4-4-11, విధేయుడు, గా. కనకరాజు.

వీరి యుద్యోగాదికము 3 వ పుటలోఁ జూపఁబడెను, వేలకొలఁది ప్రాజ్ఞుల సదభిప్రాయములున్నను నేఁటికాలమునకు నిరర్థకములగునని యెంచి వీని మాత్రము దాహరించి విరమింపఁదలఁచితిమి. ఇందు వచ్చిన చిత్రపద్యములు చాలఁ గలవు, వానికిఁ బ్రాజ్ఞులు తమంతటఁదామే సమాధానము చెప్పుకొనఁగలరు, లేదా మాపాశుపతాదికములవలనఁ దెలిసికొన వచ్చును. కాలానుసారముగఁ గని తాకన్యక, శ్లో. యన్యపక్షే........ ద్వితీయాస్యామహంకరమ్॥ అను శ్లోకమున కుదాహరణ మగుచున్నది. సహృదయాః ప్రమాణం.

ఇట్లు,
తిరుపతి వేంకటేశ్వరులు.

# శృంఖలాత్రుటీకరణము

చదువరులారా !

మేము రచించి ప్రచురించిన శ్రవణానంద, పాణిగృహీతలపై విమర్శన మను నెపముతో "పాణిగృహీతాశ్రవణానందశృంఖల" అను నొక పెద్ద పొత్తము కేవల దూషణప్రధానమగు వెక్కిరింపులతో వెలువడినది. దానిని భారతి యను పత్రికాధిపతు లంతకుమున్నే నిరసించి ప్రచురించియున్నారు. విమర్శనకర్త సదృశు లను కొందఱు దాని నభినందించి యున్నారు. ఆయా యంశములను పీఠికలోఁ జర్చింపఁ దలఁచి ప్రధానాంశమున కుపక్రమించు చున్నారము. శంక లెట్టివైనను సమాధానము నపేక్షింపకమానవు. చదువరు లలో ననేకులు పరప్రత్యయనేయబుద్ధు లుండుటచే గ్రంథకర్తలు ప్రతిపక్షుల పూర్వపక్షములకుఁ దోఁచిన సమాధానములను ప్రచురించుట తప్పనిసరి. విమ ర్శన మసమంజసమను నంశము స్వయముగానే గుర్తింపఁగలవారికి గ్రంథకర్త స్వహస్తలిఖితము లపేక్షణీయములు గాకున్నను, దక్కుంగలవారికి నివి యపేక్ష ణీయములు కాక పోవు. కొందఱు మొత్తముమీఁద విమర్శనము బాగుగా లేదని మాత్రమే చెప్పఁగలుగుదురు గాని తగినంత యాధారమును జూపఁజాలరు. అట్టి వారలకొఱకై యీపరిశ్రమము చేయఁబూను మమ్ము విజ్ఞలోకము మన్నించుఁ గాక —— విమర్శనము యుక్తియుక్తమా? కాదా? అను విషయమువాత్రమే చర్చించుట ముఖ్యమగుటచే మే మిందుఁ దక్కువిషయము లనఁగా విమర్శకుని స్వరూపస్వభావపాండిత్యాద్యప్రస్తుతవిషయముల నెత్తికొనక విడిచితిమి. ఇంతియకాక యతని గ్రంథపంక్తులనుగూడ నిందుదాహరింపక మాసొంతమాట లతో నతని పూర్వపక్షస్వరూపమును దెల్పుచు మాయెఱిఁగినంతలో సమాధాన ములను లిఖించుచుందుము. సాధ్యమైనంతలో సంగ్రహింపఁదలఁచి మేమీ లాఘ్యమున కొడిగట్టితిమి. ఇఁకఁ బ్రకృత మవధరింపుఁడు.

"పాణిగృహీతా శ్రవణానందశృంఖల"

ఈనామము తప్పు. రచనాకాలమును బట్టినచో శ్రవణానందము మొదట నుంచవలసియుండును. అట్లుంచినచో "శ్రవణానందపాణిగృహీతాశృంఖల" అని యగును. అప్పుడు విమర్శకుని మనోరథసిద్ధికి భంగము కలుగును. విమర్శ

కుఁడు తానిడిన పేరునకుఁ జెప్పినయర్థ మేమని? పాణిగృహీతా=లంజలయొక్క, శ్రవణ=చెవులకు, ఆనందము=సంతోషము (ఇచ్చునది) అని. పేరు తలక్రిందై నప్పు డిట్టియర్థమున కవకాశ మెట్టు లుండెడిని. విశేషార్థము రాదు గాని, ఆరెండు గ్రంథములను గూర్చిన విమర్శనమను నర్థము వచ్చెడిని. కావున నీపేరట్లు మార్చికొనవలయును.

“శ్రవణానందము అను పేరు న్యాయ్యమా?” న్యాయ్యమే. శ్లేషయమక చక్రవర్తి యగు శ్రీ వేంకటాధ్వరి “శ్రవణానంద” మను పేరితో నొక సంస్కృతనాటకమును రచించెను. “ఎవరిచెవులకు?” అని వెక్కిరింపనక్కఱ లేదు. అవయవము లవయవి వినాభూతములుగ నుండవు గావున నర్థతాకాంక్షావశమున నవయవి యాక్షిప్త మగును. ఆయవయవి కవితాస్వాదనార్హముగా నుండవలసి వచ్చును. ఐనచో విమర్శకుని వ్రాఁతచొప్పున అనామకులగు మూర్ఖు లాక్షిప్తు లెట్లగుదురు? పైఁగా విమర్శకుఁడుగారు లంజియల చెవుల కానందమిడు నని నేఁడొకచో వ్రాసినారు. వాండ్రుగూడఁ గవితారసాస్వాదనకుఁ దగు యోగ్యత గలవాండ్రున్నచో వాండ్రనుగూడ గ్రహించుటలో మాయభ్యంతరము లవమును లేదు. మేమిడిన నామమువాత్రము సహృదయ మాత్రాకర్షకము గాని విమర్శకాభిప్రాయము ననుసరింపదు. ఇంతవఱ కెందులకు? లోకులు సామాన్యముగా మంచివస్తువునుగూర్చి చర్చించునపుడు మనోహరముగా నున్నది హృదయంగమముగా నున్నది, అని వాడుచుంట యెల్ల రెఱిఁగినదే. అట్టిపట్టుల నెల్ల నెవరిహృదయములకు? అని యాకాంక్ష తప్పనిదే. అనుగుణ మగు నవయవి యాక్షిప్తము కావలసినదే. సర్వసులభమగు నీవిషయమున కింతకన్న వ్రాసి పెంచుట యయుక్తము. సహృదయుల శ్రవణముల కానందము నొసఁగునది యను నర్థము తప్ప వేఱొండు కల్పన యిటఁ బ్రాజ్ఞులు చేయరు. అట్టి సహృదయుల లేఖ లెన్నెన్నియో కలవుగాని విస్తరభీతిచే నుపేక్షించి,

క. ఒక శ్రవణానందమ్మున, నొకపద్యమునందుఁ గల్గు నొకపాదమునం
దొకయక్కరమున కొసఁగిన, సకలమ్మగు రత్నగర్భ చాలునె తూఁపన్.

అను పద్యమును మాత్ర ముదాహరించుచున్నారము. ఈ పద్యమును బ్రహ్మశ్రీ రామడుగుల సీతారామశాస్త్రులవారు నిర్వ్యాజముగా వ్రాకడకంపి యున్నారు. మున్ను కృష్ణాపత్రికలో నీపద్యమును, మ॥ రా॥ రా॥ గోటేటి

కనకరాజు పంతులుగారు (గవర్నమెంటు ట్రాన్సులేటరు) వ్రాసిన యభిప్రాయమునుంగూడఁ బ్రచురించియుంటిమి. ఇట్టి ప్రాజ్ఞుల చెవుల కానందమిడిన గ్రంథములను, అనామకులయొక్కయు లంజియలయొక్కయుఁ జెవుల కానంద మిడునవిగా లిఖించిన విమర్శకుని ప్రాజ్ఞలోకము క్షమించుఁగాక! ఇదిగాక విమర్శకుని త్రోవనుబట్టి విమృష్టగ్రంథములు లంజెకుఁగూడ నానంద మిడఁజాలవు. విమర్శకుఁ డొకచో "ఇవి విటులను బ్రియ్యఁదిట్టుటచే విటులకానంద మిడనేరవు" అని వ్రాసి యున్నాఁడు. ఇదే యుక్తి నుపచరించినచో నీగ్రంథములు విటులకన్నను లంజియలనే యెక్కువగా దూషించుచున్నవి. ఈయంశము కన్నులే వాకుచ్చెడిని. కావున వాండ్రచెవులకుమాత్రము మెట్లు లానంద మిచ్చెడిని? అట్లగుటచేఁ బూర్వపక్షివ్రాఁత తప్పు. తప్పు. తప్పు.

"పాణిగృహీత" అను పేరు సమంజసమే యగునా?

ఈపేరు జుగుప్సాకర మనియు నేమో యనియు విమర్శకుని వాదము. దీని వ్యుత్పత్తింబట్టి చూతము. "పాణిర్గృహీతోఽస్యాః" 'పాణిగృహీతీ' అని సుధాకారకుఁడు వ్రాసెను. ఈయర్థమునే 'పాణిం గృహ్ణీష్వ పాణినా' అను వాల్మీకివాక్యము ధ్వనింపఁజేయుచున్నది. విధివిహిత మగు పాణిగ్రహణము జరిగినస్త్రీ పాణిగృహీతి యని చెప్పఁబడును కావుననే "పాణిగృహీతి ర్భార్యాయాం" అని వార్తికము పుట్టినది. దీని ననుసరించియే "పత్నీ పాణిగృహీతిస్స్యాత్" అని యమరము ప్రవర్తించినది. ఈ పత్నీశబ్దమువలన 'పత్యుర్నో యజ్ఞసంయోగే' అను సూత్రము స్మృతికిఁ దగులును. దానిచే యజ్ఞయాగాదులయందు భర్తతో సహాధికారముగలస్త్రీ 'పాణిగృహీతి' యనిపించుకొను నని తెలును. అట్టిది కాక, కేవల పాణిగ్రహణమును బొందిన స్త్రీ అనఁగాఁ గేవల కామనిర్వాహణప్రయోజనమునకుఁగా స్వీకరింపఁబడినస్త్రీ పాణిగృహీత అని చెప్పఁబడును. కావుననే భట్టోజీదీక్షితులుగారు "పాణిగృహీతాఽన్యా" అని వ్రాసిరి. ఈ దీక్షితులవారి పంక్తినేమి, పైనుదాహరించిన వార్తికము నేమి మా విమర్శకుఁడు సూత్రము లనియే వ్రాసెను. దానివలన నయ్యావఘుని పాండిత్యమును లోక మెఱుఁగుఁగాక! ప్రకృత మనుసరింతము. పాణిగృహీతా పదము టాబంతము. అనఁగా ఆకారాంతము. పాణిగృహీతీ పదము ఙీబంతము. అనఁగా ఈకారాంత మనుకొనుఁడు. ఈరెండుపదములకును నించుమించు

వ్యుత్పత్తి యొకటియే. రెండవదానిలో విధివిహితయు అను నంశము మాత్ర ముండదు. ఈ యంశమును మనమందుంచుకొనియే మేము మా కోశములలో—

ఉ. పాణిగృహీతి యందురు వివాహితయైన సతిన్ దనంతఁ దాఁ
బాణిగ్రహించి యుంచికొను బానిస తొత్తును శాబ్దికాగ్రణుల్
పాణిగృహీత యందురు. (పాణిగృహీత)

అని వ్యాఖ్యానము చేసి యుంటిమి. అది యటు లుండుఁగాక. జుగుప్స అనునది వచ్చిబూతుమాటలు వినుటవలనఁ గలుగఁ దగినది. పైపైన మట్టిదియుం డ్రయే ప్రాజ్ఞులును పలుకరు. విధివిహితముగాఁ గాక కేవల కామార్థము స్వీకరింపఁ బడినస్త్రీ అనుమాత్రముననే జుగుప్స కలుగు నని వాదించువారుకూడ లోక మున నుందురా? ఉందురు గాక!

"కృతాభిషేకా మహిషీ భోగిన్యో౽న్యానృపస్త్రియః",

గృహీతీ, గృహీతలకుం బోలె మహిషీ భోగినులకును గొంచెక విచారిం చినచో జుగుప్సాకరత్వము జ్ఞానలవదుర్విదగ్ధులు కల్పింప వచ్చును. మహిషి పట్టాభిషేకసమయమున రాజుగారి సహాసనమున కర్హురాలు. భోగిని అట్టిది కాదు. భోగమాత్రప్రయోజనముగా నేర్పడినది. పాణిగృహీతాపద మీభోగినీ పదమునకుఁ బర్యాయము కావచ్చును గాని భోగినీ పదమునకుంబలె సులభముగా దానికి నర్థము స్ఫురింపదు. గూఢమగు నాపదమే జుగుప్సాకర మగుచో సులభ మగు భోగినీపదము మిగుల జుగుప్సాకరము గాదా? అగు నేని—

"భోగినీసంగతికి రాజు పోవుచుండి" అముక్త మాల్యద

ఇత్యాది ప్రయోగములెల్ల నింద్యములే కావలయును గదా? భోగము, రతి, సురతము, యిత్యాది పదములవలన జుగుప్స యుదయించునని వ్రాసినలాక్షణికులు మా యెఱిఁగినంతలో లేరు. భోగినీ అనునర్థ మిచ్చు మాత్రముననే 'పాణిగృ హీతా' పదము నింద్య మగుచో, భోగినీపర్యాయములగు "వారకాంత" లోనగు పదములును నట్టివియే కావలసి వచ్చును. వారల గుఱించి మహాకవులెల్లఁ బురవర్ణ నములలోఁ బ్రతికావ్యమునందును వర్ణించి యున్నారు. అదికూడఁ దప్పే కావల యును. వారల నటుంతము. ఇది పరిష్కృతము నూతనముగా బయలు వెడలుచున్న యొకవిధమగు సిద్ధాంతము ననుసరించిన యాక్షేపణ యనుకొందము. అయినచో నాక్షేపణ కవకాశముండ వచ్చును. గాని యీవిమర్శకుఁడుగారు "వారకాంత"

అను పేరుతో నాటకమును రచించినట్లే విమర్శనమునందే నాటివ ప్రతులలో వ్రాసి కొనియున్నారు. గూఢార్థముగల పాణిగృహీతా పదమును జూచి రోసపడు విమర్శకునకు "వారకాంతా" పదము సమంజస మెట్లయ్యెడిని? దీనింగూర్చి విశేషించి చర్చించినఁ బ్రయోజన ముండదు. విమర్శకునింగూర్చి సుచిర్యనపత్రిక జదువఁగోరెదము.

## గ్రంథపరమైనప్పుడు పాణిగృహీతా పదమున కర్థమేమి?

పాణిగృహీత నుద్దేశించి రచించిన గ్రంథమని యర్థము. విమర్శకుఁడు గారీసందర్భమున మఱియును సాహసించి యున్నారు. గ్రంథమునకు "లంజె" అని పేరు పెట్టినట్లభిప్రాయ మిడిరి. కాదంబరి, ఆముక్తమాల్యద, లోనగు నామములు నిట్టివేయని ప్రాజ్ఞలోక మెఱుంగుదురుగాక. ఈ యర్థము వైయాకరణుల వలన విస్పష్టముగా దెలిసికొనవచ్చును. విమర్శకుఁ డెట్టివాఁడైనను పరగ్రంథముపై నిచ్చినయాక్షేపణల కుత్తర మిచ్చుట గ్రంథకర్తకుఁ దప్పని పనియై యున్నదని చెప్పియుంటిమి. గ్రంథనామ విమర్శనమున కిచ్చిన ప్రత్యుత్తరము వలననే విమర్శకుని పాండితి కొంత తెలిసియుండును. ఏమైనను వైదికాచారము కొంచెల శాస్త్రముతో సంబంధించి యుంటచే సర్వసులభముగా బోధపడఁ దగినది కాదు. ఈ క్రింది యంశమును దిలకింపుఁడు.

"గృహమునకై వగ విరాలింగఁ జేరి యాత్మగతమునన్" (శ్రవణానందము)

ఇందు గృహమునకున్ + ఐ, అని పదచ్ఛేదము చేసికొనకున్నచో యతి చెడును. ఆత్మశబ్దప్రయోగము వలననే పదచ్ఛేదము స్ఫుట మగుచుండఁగా దానిం గణింపక గృహమునకై, అనునది చతుర్థ్యంత మని నిర్ధారణ చేసికొని, యెంతో వెక్కిరింపును వినియోగించెను. ఇట్లే—

తే. గీ. తనకు చిత్తమ్ము నేనియుఁ దగినసొగసు
గలుగు చెలిమిన్న కడకంపఁ గదలిరాదు
అట్టిచోఁ గేవలాన్యుల ననుప నగునె
దౌత్యమునకన్న సతిపొందు తప్పిదంబె. పాణిగృహీత.

ఈ పద్యములో "దౌత్యమునకన్న" అను నాల్గవ చరణమునకు సందర్భమే లేదని త్రోసివేసెను. పద్యము కఠినశైలిలో నున్నచో నన్వయింపక వెక్కిరించ వచ్చు ననుకొందమన్న నట్లు లేదుగదా. అయినచో వెక్కిరింపున కవకాశ మేమి?

సమన్వయించి చూపినచోఁ జదువరులే నిర్ణయించుకొందురుగాన నట్లు చేసెదము.
శ్లో॥ నపుంసక మితిజ్ఞాత్వా ప్రియాయై ప్రేషితంమనః । తత్తు తత్రైవ రమతే
హతాః పాణినినా వయం॥

ఈశ్లోకము ననుసరించి మేము పైపద్యమును రచించితిమి. తన మనస్సే దూతకృత్యమున కనర్హ మని చెప్పవలసి వచ్చుచుండఁగా నితరులెట్లు పనికి వత్తురు? అని శంకించుకొని మరల నట్టియనుమానము యుక్తముకాదనియు యోగ్యుఁడగుదూత నాయికా సంపర్కమునకై యత్నింపఁడనియు సమాధానము రాఁగలదని కొండొక యూహించికొని, తుట్టతుది యర్థాంతరన్యాసము నుపయోగించెను. ఆ యర్థాంతర న్యాసమువలన దూతకృత్యమయుక్త మనియు దాని కంగీకరించు వానికి నాయికాసంభోగాభిలాషముఁత తప్పిదముగాఁ దోఁచకపోవచ్చుననియు నాయకుఁడు నిర్ణయించినాఁడు. ఈ యంశము రసమంజర్యాదులలో వివరింపఁబడిన యధమ నాయికలను మనమం దుంచుకొని వర్ణింపఁబడినది. దీనింగూర్చి వర్ణించుటకూడఁ దప్పని విమర్శకుఁడుగా రందురేమో! అట్లనఁ గూడదు.

శ్లో॥ నిశ్శేషచ్యుత చందనం స్తనతటం నిర్మృష్టరాగోఽధరః॥

అనుశ్లోకము నంగీకరింపని లక్షణగ్రంథకర్తలు లేరు. పైశ్లోకము నాయకుని యధమత్వమును దెల్పుట కేర్పడినది యని లక్షజ్ఞు లెఱుఁగుదురు.
శ్లో॥ దూతి! త్వయా కృత మహో నిఖిలం మదుక్తం॥

అను పుష్పబాణవిలాసగత శ్లోకముగూడ నాయకాధమత్వమునకే యుదాహరణము. ఆ యీ శ్లోకము లయోగ్యము లని యిప్పటివఱకును నెవ్వరుగాని వ్రాయ లేదు. కాని యొక విశేషము మాత్రముండును. అధమనాయికానాయకులకన్న నుత్తమనాయికానాయకులు గరీయ స్థానయోగ్యులని చెప్పక తప్పదు. ఈ యంశ ముత్తమాధమవిశేషణములే చెప్పుచున్నవి. అయినచో సర్వత్ర యుత్తమాశ్రయముగనే కవిత్వము చెప్పుట యుక్తమేమో. యుక్తమగుట కేసంశయమును లేదు గాని ప్రతికవియు నొకచే త్రోవను బోవలసి వచ్చును. ఒకరు పోయినత్రోవనే పోవుటచేఁ దాను స్వతంత్రించి రచించినకల్పనలుగూడఁ దత్తత్సలోచితము లగుకతన నంతకుముందు పోయిన వారును పోయియుందురుగానఁ దనకుఁ జౌర్యము నాపాదింప వలసినవి కావలసి వచ్చును

ఆయా హేతువులచే భిన్నభిన్న విషయములుగాఁ గవులు కావ్యములు రచించుటకై లాక్షణికులు కొన్ని శ్లోకలు చూపి యున్నారు. వానింబట్టి యథేష్టముగఁ గవులు ప్రవర్తింప వచ్చును. ఒక కవి కొన్నియట్టివియు మఱికొన్ని యిట్టివియు కావ్యములు వ్రాయవచ్చును. అట్లే కానిచోఁ గాళిదాసు రసాభాసమున కుదాహరణ మనఁదగు విక్రమోర్వశీయకథ నెత్తికొని నాటక మేల వ్రాయును? ఊర్వశి దివ్యయైన నగుఁగాక! ఇంద్రుని యుంపుడుకత్తెలలో నొక్కతెకదా. అట్టిది పురూరవునియం దనురక్తయై వలచినదే యందము. రసాభాస మెల్ల వారింప నగును.

శ్లో॥ మోహితో బహుసక్తి శ్చేత్.

అను నంశమున కుదాహరణము కాక యెట్లుండును? తుట్టతుద కూర్వశి మిష పెట్టి తన్ను వచించినతఱిఁ బురూరవుఁడు పడిన పాటులెల్ల రసాభాసమున కుదాహరణములే యగునుగదా.

శ్లో॥ ఏకత్రైవాఽనురాగ శ్చేత్॥

తెలుఁగులో మనుచరిత్రముకూడఁ బైలక్షణములు గలయదియే కాన రసాభాసకావ్యమే. ఈ రసాభాస విషయ మటులుంతము. ఉత్తమత్వము వేశ్యకన్న సంసారిణియం దెక్కుడుగ నొప్పక తప్పదు అట్టిచోఁ గాళిదాసు వేశ్య నుద్దేశించి కావ్యమేల వ్రాసెనో కదా! పెద్దన్న గూడ నదియే శ్లోపనేల పోవలసి వచ్చెనో? దీనింబట్టి కవులు స్వీయా, పరకీయా, సామాన్యా అనిలాక్షణికు లేర్పఱిచిన మూగురు నాయికలను దమ కబ్బములయందు నిరాఘాటముగా వర్ణింప వచ్చునని సిద్ధాంతిత మగుచున్నది. మఱియు నీనాయికల యొక్కయు వీరలకు సదృశులగు నాయకుల యొక్కయుఁ బ్రభేదములనెల్లఁ గవులు తమతమ కబ్బముల యందుఁ గైకొన వచ్చును కావున నాయికాధమత్వద్యోతకమగు వైపవ్యమును రచించుట యుక్తమే మేము పీఠికలో—

మ. అగుఁ గావ్య మ్మిది యైననుం బ్రహసనప్రాయమ్ము ప్రారంభమా
దిగ దీనన్ బలుచోటులం దొదవు నెంతేనిన్ రసాభాసకో
మగువన్ నాయిక నేఁత దుర్విటుల నిర్మర్యాదవాక్యమ్ము లో
ప్పఁగ దానిన్ వెలయించుఁ; బండితులు తప్పల్ తీతురేమోకదా.

అను పద్యములో సూత్రప్రాయముగాఁ బై విషయములనెల్ల సూచించి యుంటిమి. పద్యరచనాకాలమునకు మాకుఁ గల భయము పండితాక్షేపణకుఁ

చాతుర్యిల మగుదు మేమో యను నంతవఱకే. ఇటీవల నాభయము పోయినది. సర్వమును దెలిసిన పండితులుగాని వారి లక్షణములుగాని వారి లక్ష్యములుగాని పనికిరాని కాలము వచ్చినది. ఎవరియిచ్చవచ్చినట్లు వారు శాసనము లేర్పఱుప యత్నించుచున్నారు. కావునఁ బైపద్యములో 'పామరులు తప్పుల్ దీతురేమో కదా' అని సవరించుట యుక్తముగాఁ గానవచ్చుచున్నది. అయినచోఁ గవులు పండితప్రీతికిఁ గాక పామరప్రీతికే లోఁగి కబ్బములు వ్రాయవలసినట్లు స్ఫుటమగును. అట్లు ధ్రువపడెనేని క్రమమైన కవికి మూకీభావముకన్న నుత్తమమగు పని గానరాదు. కావుననే—

ఉ. కైత యొకండు గాదిపుడు కాలము సర్వము మాఱె వ్యర్థపుం
జాతుర హెచ్చె స్వల్పమగు సాహితితోఁ బెదపెద్ద పొత్తముల్
చూతురు తప్పు దిద్దుదురు శూరత చచ్చెఁ గవీంద్రులందు నీ!
మాతులు గట్టిపెట్టుకొనఁ బోలదె సత్కవు లైనవారికిన్.

అని యీ విమృష్టగ్రంథముల పీఠికలలో నొకట వ్రాసియుంటిమి. పైనొనర్చిన చర్చలోఁ గొంత శాఖాచంక్రమణము పరికృతపద్యమునకు సంబంధింపకున్నను నిందే వేఱొకచో విమర్శకుఁడుగారు వ్రాసిన యాక్షేపణను బ్రత్యాఖ్యాన మొనర్చుటకుఁ బనికి వచ్చునని విజ్ఞులూహింతురుగాక. గృహమునకై అనుదాని విచారణమువలనను, దౌత్యమునకన్న అనుదాని విచారణమువలనను, బ్రకృతవిమర్శకుఁడుగారి పరిశీలకతాజ్ఞానము స్ఫుటమగుచున్నది గాన వీరు శంకించు శంకల కుత్తరమీయవలసియుండునో యుపేక్షింపవలసియుండునో ప్రాజ్ఞులు విచారింతురుగాక.

సీ. ......సంధ్యావందమునకు బావగారు
......జపతపమ్ములకెల్ల సవతితల్లి,...

తే. గీ ...కవిత యిట్టిదియని చెప్పగాఁ దరంబె. (శ్రవణా)

పైపద్యములో కవిత్వము సంధ్యావందనమునే చేయనీయని యప్పుడు జపతపమ్ములను జేయనీయదని వేఱుగఁ జెప్పుట నిష్ప్రయోజనము అని విమర్శకుఁడు వ్రాసియున్నాఁడు. సంధ్యావందన మనఁగా మన విమర్శకుల యభిప్రాయమునుబట్టి—

తే. గీ. కడువడిగఁ జిన్ననాఁడైన వడుఁగునాఁడు
తడఁబడుచుఁ జెప్పికొన్నట్టి తప్పుసంధె

ముక్కు లాక్కొక్క నిమూసాన మిగియవచ్చు
బళిర ! యనవచ్చు లౌకిక బ్రాహ్మణులను. (తెల్గునాడు)

అని శ్రీ దాసు శ్రీరామకవిగారాక్షేపించిన విధమైనదిగాఁ దేలుచున్నది. సహస్రగాయత్రీజపితలు, దశసహస్రగాయత్రీజపితలు లోనగువారింగూర్చి వీరి హృదయము ప్రవర్తింపనేలేదు. విమర్శకుఁడుగా రభిప్రాయపడిన సంధ్యావందనము కవులు చేయుదురను నర్థమును "బావగారు" అను రూపణమువలననే ధ్వనివేత్తలు తెలిసికొనఁ గలరు. బావగారియెదుట మఱఁదలు సంకోచించుచుఁ జరించు ననికదా ? దానియర్థము. ఐనచో సర్వశూన్యత్వ మెట్లు సాధింపఁ బడునా ? అది సాధింపఁబడనిచో "కవులు సంధ్యావందనము చేయరనుట" ఇత్యాది విమర్శకసాహసప్రయుక్తసిద్ధాంతము లెట్లు బ్రదికెడిని ? ఎట్లో బ్రతుకుఁగాక! జపతపములనుగూర్చినపృథగ్గ్రహణము పాదపూరణమాత్రప్రయోజనమే యగునో కాదో విచారింతము.

శ్లో. సంధ్యావందన ! భద్రమస్తు భవతే భోస్స్నాన తుభ్యంనమో
భో దేవాః పితరశ్చ తర్పణవిధౌ నాఽహం క్షమః క్షమ్యతామ్.

అను లీలాశుకశ్లోకమున సంధ్యావందనమును వదలుకొనుట తెల్పినపిదప దేవపితృతర్పణత్యాగమును గూర్చిన ప్రసంగము కన్పట్టుచున్నది. విమర్శకాభిప్రాయముచొప్పున నిదియును దప్పే కాఁబోలును. ఇట వ్రాయవలసినది బోలెఁడున్నను జూపినశ్లోకము ననుసరించి చేయఁదగు వ్యాఖ్యానము విజ్ఞులే చేయఁగలరని యుపేక్షించుచున్నారము. మఱియు 'వ్యాసవాల్మీక్యాదులు సంధ్యావందనమే చేయలేదా ? తి॥వెం॥ కవులు మానిరేమో?' ఇత్యాద్యప్రస్తుత ప్రసంగమును మా విమర్శకుఁడు లిఖించెను. మారచనలో సంధ్యావందనమునకు సర్వశూన్యత్వమును గయికొనువారే యుండరు. అట్టిచోఁ బైశంకల కవకాశమే లేదు. "నచ శంకా నచోత్తరమ్". లీలాశుకుని శైలిలో సంధ్యావందనమునకుఁ బరిత్యాగమే కానవచ్చుచున్నది. ఇది యితఁడు సన్న్యసించినపిదపఁ జెప్పినదని యందురేమో ? ఐనచో స్నానమునకుఁ గూడఁ ద్యాగము విధింపవలసియుండదు. ఇదిగాక విరజాహోమకాలమునఁ ద్యజించిన సంధ్యావందనాదికమునకుఁబునస్త్యాగప్రవచన మనుపపన్న మగును. దేవపితృతర్పణములు సన్న్యాసికి విధివిహితములైనచో నవి చేయలేకపోతినని పరితాపపడుట యుక్తముగాని పరిత్యజింప

వలసినదానిని బరిత్యజించుటలోఁ దప్పేమి యుండును ? కావున నిది కవితార్ణవ మగ్నతాదశయందొండె, భగవద్గుణానుభవమగ్నతాదశయందొండె నుభయ పద్మేళనప్రసంగమగ్నతాదశయందొండె రచించిన శ్లోక మనక తప్పదు. పైశ్లోకము

శ్లో. గోవిందేతి సదాస్నానం గోవిందేతి సదాజపః
గోవిందేతి సదా ధ్యానం సదా గోవిందకీర్తనం.

అను శ్లోకమునకు స్మారక మగుచున్నది. వ్యాసవాల్మీక్యాదులుగూడ నొకానొకచో సంధ్యావందనమును రచింపనే లేదని యూహింపవలసియున్నది. వేలకొలఁది వత్సరములు తపస్సమాధిలో మునిఁగియున్న ఋషులకుఁ బ్రతిదిన మును సంధ్యావందనాచరణమును సమర్థింపఁదగు ప్రాజ్ఞు లెచ్చట నుందురు ? ఋషులకుఁ దపస్సమాధి యెట్టిదో నిజమైన కవులకుఁ గవితాసమాధియు నట్టిదియే. ఈవ్యసనమునందుఁ జిక్కికొందఱు సాంసారికసుఖములను వర్జించినవారు గూడ గలరు.

శ్లో. శబ్దేందుశేఖరః పుత్రో మంజూషా తవ పుత్రికా.

పైశ్లోకము శ్రీ మహామహోపాధ్యాయ నాగేశభట్ట విరచితము. గ్రంథ నిర్మాణదీక్షలో వయస్సెల్ల వినియుక్తమైనపిమ్మట నొకచో సంతానార్థినియు మహాపతివ్రతయు నగు భార్య కతఁ డట్లు సమాధానము చెప్పెనని తజ్ఞులు చెప్పుచున్నారు. "అహరహస్సంధ్యాముపాసీత" అను విధివాక్యము నుల్లంఘిం చుట యెట్టిదియో ? "ఋతౌ భార్యా ముపేయాత్" అను విధివాక్యము నుల్లం ఘించుటయు నట్టిదియే. ప్రసంగవశమున నింతవఱకు వ్రాసితిమే కాని మా రచన సర్వశూన్యత్వబోధకము గాదు. కేవల కర్మఠులవలెఁ గవులు సంధ్యావంద నాదులపట్ల బద్ధదీక్ష కలవారు కారనునది సర్వసమ్మతము. సంధ్యావందనసమ యమున నేదేని వర్ణనంగుఱించి మనము ప్రసరించినచో నిజమైనకవికి సంధ్యా వందనము తోఁచ దనుటలో నతిశయోక్తి లవము లేదు. ఇందులకుఁ జూపిన యుదాహరణములే చాలును. మఱియుంగావలసినచోఁ గాళిదాసాదుల చరిత్రము లుదాహరణములుగాఁ గైకొనవచ్చును. కవిత సర్వశ్రేయస్సాధకము గావున వారి కితరకర్మశ్రద్ధతో నంతగాఁ బని యుండదు.

శ్లో. కావ్యం యశసేఽర్థకృతే। వ్యవహారవిదే శివేతరక్షతయే।

సద్యః పరనిర్వృతయే। కాంతాసమ్మితతయోపదేశయుజే॥(కావ్యప్రకా)
విమర్శకుఁడాక్షేపించిన శ్రీవణానందనములోని సీసపద్యము పైశ్లోకార్థము ననుసరించి రచించినదియే యని విజ్ఞు లెఱుఁగుదురుగాక! మాపద్యము నిట నుదాహరించి కొంత వ్రాయవలసియున్నను విస్తరభీతిచే నట్లు చేయఁజాలకున్నారము. అందలి—

"ముక్తికాంతాసంగమునకుఁ దారుపుఁగత్తె సద్యశ్శోవ్యాప్తికిఁ జాటు దప్పు"

ఇత్యాది చరణములయందలి యర్థమునుబట్టి విచారించినచోఁ గవులు సంధ్యావందనాదికర్మములచేఁ దరింప నక్కఱలేదనియుఁ గవితవలననే వారు తరింపవచ్చుననియు స్ఫుటముగాఁ దేలెడిని. అయీయంశము లెట్లు లున్నను. గవులకు సంధ్యావందనమునం దింముక శ్రద్ధాలోపమునే మా రచన చెప్పునుగాని సర్వశాన్యత్వమును బోధించుట లేదు గాన విమర్శకుని ప్రసంగము తప్పు. తప్పు. తప్పు.

తే. గీ. అరయఁగాలేక మిము వెలయాండ్రటండ్రు
గాని యీయర్థ మది నేటికాలమందు
దప్పమిడి పెండ్లియాడిన ధన్యతముల
భార్యలకు నెల్లఁ జెల్లఁగా వచ్చుఁగాదె. (పాణిగృహీత)

అలంకారికులారా! "ఈగ్రంథమున దుర్నీతి యంతయు నీసందర్భముననే యున్నదఁట". విచారించితిరా ? కావ్యార్థమేమి ? విక్రీతకన్యాపరిణయము దూష్యమనియేకదా ? గ్రహింపవలెను. తక్కిన ధర్మములు భిన్నములైనను విక్రయణ ముభయత్ర తుల్యమగుటచే నింతకుమున్న వేశ్యలయందు యోగరూఢముగా నున్న "వెలయాలి" పదము ప్రకృతము విక్రీతకన్యలయందుఁగూడ సంక్రమింపవచ్చు ననునది యాపత్తి కాని నిజముగా సంక్రమించిన దని చెప్పుట కాదుగిదా. "జీవితం వ్యంగ్యవైభవం". కావున నిట వాచ్యమేమి ? వ్యంగ్యమేమి ? వేశ్యలు తమ కన్నియల ద్రవ్యార్థము విక్రయించుటచే, వాండ్రకాకృతి ననుసరించి "వెలయాండ్రు" అను నామము వచ్చినది. మనముగూడ నట్లు విక్రయింతుమేని మన కన్యకలకుఁగూడ నా నామము చెల్లవలసివచ్చుననునది వాచ్యార్థము. వ్యంగ్యమో ? కన్యావిక్రేతదూష్యుఁడు. పరిగ్రహీతదూష్యుఁడు. విక్రీతకన్యక దూష్యరాలు.

యథా, అన్నవిక్రేతా దూష్యః తదన్నంచ దుష్టం, తద్భోక్తా చ దూష్యః, విస్తరస్తు తద్బోధకేభ్యశ్శాస్త్రేభ్యోఽవగంతవ్యః.

కన్యావిక్రయణనిషేధాపాదకమగు నీపద్యమే దుర్నీతిబోధక మగునేని తద్బోధకధర్మశాస్త్రములెల్ల నట్టివియే కావలసివచ్చును. సాదృశ్యమన భేద ఘటితము. తద్భిన్నత్వే సతి తద్గతభూయో ధర్మవత్త్వం సాదృశ్యం, కవివివక్షిత ధర్మపురస్కారముగా సాదృశ్యమును విచారింప వలసి యుండును విక్రయణ మిక్కడ సమానధర్మము, తక్కుఁ బ్రవర్తనాదికము భిన్నతాపాదకము. "చంద్ర వన్ముఖం" అనుచోఁ జంద్రనిష్ఠయావద్ధర్మములును మొగమం దెన్నఁటికిని రావు. అట్లే వెలయాలికిఁ గల వ్యుత్పత్తిమాత్రమే యిట వివక్షిత మగుచున్నది గాని తక్కిన వ్యభిచారాదికము వివక్షిత మగుటలేదు. విస్తరింపవలసియున్నను విజ్ఞులు కలరుగదా వారే విస్తరింతురని ముగింపఁబడుచున్నది. ఇందులకు భాగవతాగ్ర గణ్యుఁడగు శ్రీ పోతరాజుగారి పద్యమొకటి యుదాహరింపఁ బడుచున్నది.

ఉ. బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకన్న సత్కవుల్
హాలికులైన నేమి... (భాగ 1 స్కం)

ద్రవ్యాపేక్షచేఁ దమ కావ్యకన్యకల నొరులకు విక్రయించుకొను కవులు పడపుఁగూడు భుజించువారని పోతన్నగారు వ్రాసిరి. కావ్యమునకుఁ గరచర ణాద్యవయవములు లేవు. అది స్త్రీ కాదు. కొన్ని ధర్మములం బట్టి కవులు స్త్రీగా రూపించుచున్నారు. దేని ధర్మము నిందు రూపించుచున్నారో దానిని విక్రయించి భుజించువారు పడపుఁగూడు భుజించువారుగాఁ బరిగణించు వ్యవ హార మున్నయప్పుడీ పోతరాజుగారియూహ బ్రదుకును. ఐనచోఁ బోతరాజు గారు గూడ మా యభిప్రాయమునే పొందిరనుటకు సందియము లేదు. కావున విమర్శకాభిప్రాయము చొప్పున దుర్నీతి పోతరాజుగారి పద్యమునకును దగుల వలయును. శాంతం. పాపం.

శ్లో. నశబ్దబ్రహ్మోత్థం పరిమళ మనాఘ్రాయ చ జనః
కవీనాం గంభీరే వచసి గుణదోషా రచయతు. (మురారిర్మహాకవిః)

పురుషుని విధవ యనవచ్చునా? అనఁగూడదా?

అనవచ్చును. విధవాత్వము స్త్రీనిష్ఠధర్మమైనను శిష్టవ్యవహారమువలన నీప్రయోగము సుసాధ మగుచున్నది. ఇందుల కీ క్రింది పంక్తులు సాధకములు గాఁగలవు.

శ్లో. వేనచి త్పూర్వముక్తోఽపి నీవీబంధశ్శ్లథీకృతః
విచిత్ర భోజనాభోగవర్ధమానోదరాదినా॥
ఇతి ప్రయోగః, భ్రాంతే రుపచారాద్వా॥

(వామనకృత కావ్యాలంకార సూత్రములనుండి)

నీవీబంధపదము స్త్రీ కటివాసోబంధమునకు జెల్లును గాని పురుషవస్త్ర గ్రంథికిఁ జెల్లదని శంకించుకొని మొదట భ్రాంతివలనఁ గవి యట్లు వాడి యుండునని చెప్పి పిదప స్వల్పవిషయమునందు మహాకవికి భ్రాంతికల్పన మనుచిత మని యెంచి "ఉపచారాద్వా" అని గతిని సూచించియున్నాఁడు. ఇంతశాస్త్రము నుపయోగించి దీనిని సాధించుటకన్నఁ దప్పనుట సుళువు కాదా అని కొందఱలసు లనవచ్చును. కాని యది సరి కాదు. అస్మదాదుల ప్రయోగము లట్లు త్రోసివేయ వలనుపడును గాని శిష్టవ్యవహారమట్లు త్రోసివేయుటకు వలనుగాదు. శాబ్దబోధోపకరణములలో "వ్యవహారతశ్చ" అని వ్రాసిన శాస్త్రజ్ఞులకు శిష్టులయం దెట్టి గౌరవమో యిట్టె తెలియఁగనిది కాదు. దానిని సాధించు రీతి యెఱుఁగఁగాక, మానుఁగాక! మూర్ఖుఁడుఁగూడ విధవ యనియే పలుకుటకుం గతమేమి? శిష్టవ్యవహారోపలబ్ధియే. ఇప్పు డన్యథాగా నాపదమును మార్పుఁడన్నను లోకులు మార్పరు. మార్చుటకుఁ దోషయును గానరాదు మఱియుఁ గొందఱు 'విధవుఁడు' అని యందు గనుకొందము. అట్లనుట యుక్తమా? ఎన్నఁటికిని యుక్తముకాదు. 'ధవః ప్రియః పతి ర్భర్తా' ఇంపలి నాల్గుశబ్దములలో ధవశబ్ద మెన్నఁడు గాని భార్యాపరముగా స్త్రీలింగముగా నుండదు. ప్రియాదిశబ్దము లుండఁగలవు. భర్తృశబ్దము స్త్రీలింగముగా మాఱినను భార్యావాచకము మాత్రము కానేరదు. దీనింగూర్చి వ్రాసిన గ్రంథము విస్తరించును. గాన నది వదలుచము. ప్రకృత మనుసరింతము. విధవుఁడు, అనుశబ్దము కావలసి వచ్చుచో, విగతా, ధవా, యస్యసః అని విగ్రహము చెప్పనొప్పును గాని, దయిత వల్లభాది శబ్దములవలె ధవశబ్దము స్త్రీలింగము లేదు. కావుననే విధవుఁడు, అను వ్యవహారమును గలుగలేదనియెఱుంగునది నిష్కృష్టాంశమేమనఁగా విధవాశబ్దము విశేష్యనిఘ్న మగుటకు వీలులేదు గాన నిత్యస్త్రీలింగముగాఁ బరిణమించినది. ఆహేతువుచేఁ బురుషుని దిట్టవలసి వచ్చినను నయ్యది యవ [illegible]వార్థశూన్యముగా నదేలింగమున వ్యవహరింపఁబడుచున్నది. ఇందులకు—

శ్లో. లింగసంఖ్యా విభేదేఽపి విశేషణ విశేష్యయోః।
విభక్తిః పున రేకాచే ద్విశేషణ విశేష్యతా.

అను నార్యోక్తి సాధకము కాఁగలదు.

స్త్రీనిష్ఠ విధవాత్వము పురుషునియం దుపచరించుకతన నిది యౌపచారిక ప్రయోగమని శిష్టవ్యవహారవేత్తలు నిర్ణయింపఁగలరు. ఇంతులకు మొదటనే యాధారము చూపఁబడినది.

గీ. మనకు వేశములకు నచ్చు ధనముకన్నఁ
దగినవారలతోడ సంబంధములు ఘటించుటే
ముఖ్య మగులాభము. (శ్రవణానందము)

విమర్శకుఁ డిట నన్వయము సెడిన దని దిసంతులు గొట్టి తిరస్కరించెను. దిద్దికొమ్మనియెను. ఎందులకు దిద్దవలెనో కదా? వేశములకుఁ దటస్థించుధన మెంతయో యుండదు గాన నద్దానికన్న నయ్యెడ కరుదెంచి తమ హావభావాదులం జూచి మోహించిన విటులొసగెడు ధన మెన్నిరెట్లో హెచ్చుండుటం జేసి, ఆ ధనరూప లాభముకన్న నట్టివారలతోడి సంబంధ మనెడి ధనలాభమే ముఖ్యమగులాభమని బాలునకేని స్ఫురించుచున్నది. ఇట్లుండఁగా వెక్కిరించి తిరస్కరించుట కవకాశమేమో విజ్ఞులే నిర్ణయింపఁగలరు. సుదర్శనీపత్రికాధిపతి వ్రాసినచొప్పున "గ్రంథపు బొంత యంతయు" నిట్టియనాలోచితపు శంకలతోడనే కుట్టబడినది ఈ శంకల కుత్తరము లేల లిఖింపవలయును. అథవా లిఖించిన ఫలమేమి? ప్రధానాంశమునకు వత్తము. ఈ విమర్శకుఁడు వ్యాకరణాది విషయములనుగూర్చి చర్చింపఁ దగువాఁడో కాఁడో తజ్ఞులెఱుఁగక పోరు. పాశుపతములో ననేకోదాహరణములు చూపియుపపాదించిన విషయములనే యిందు మరల నెత్తికొనినఁ జేయునదియేమి? కావున నా విషయములను, అనన్వయములని యాక్షేపించిన విషయములను నుపేక్షించి యీ కబ్బములు దుర్నీతిని బోధించుచున్నవని విమర్శకుఁడు వ్రాసిన దెంత సత్యమో విస్తరించి చర్చింతము. శ్రవణానందములోనేమి, పాణిగృహీతలోనేమి, వేశ్యలంగూర్చియు, తన్నాయకులంగూర్చియు, వారివారి ప్రవర్తనలంగూర్చియు నిరాకరించి మందలించిన యుక్తులకుఁ బరిమితియే లేదు. ఇదుదాహరించి చూపుద మన్నఁ బ్రబంధమెల్ల నుదాహరింపవలసి వచ్చును గదా! అట్లగుటచే నా నెత్తి పనికిఁ బూనక ప్రాజ్ఞులగువారి నాగ్రంథములు సాంతముగాఁ జూచునట్లు ప్రార్థించుచున్నారము. మఱియు విందశికథలు రసాభాసములను వాదమున కింతకుమున్నే కొండొక యుత్తర

మోఁబడినది. కాన నద్దానిం గూర్చి విస్తరింప వలసిన యావశ్యకత లేదు. ఇఁక నీతిబోధకము లైనను అక్కడక్కడ దుర్నీతిని గూడ బోధించు పద్యములు కలిగి యుండెనా? లేదా? యను శంక కుత్తరము వినుఁడు. కావ్య మనునప్పుడా యాపాత్రల కనుగుణముగా వాక్యకల్పన చేసినదియే కాని యన్యము కాదు. వారివారి మనోభావముల ననుసరించి రసోచితముగా రచించినప్పుడు పాత్రోచితమగు దుర్నీతి కొంత ప్రతికావ్యమునందును నుండియే తీరును. శ్రీమద్రామాయణములో, రావణుఁడు సీతతోఁ బ్రసంగించిన ప్రసంగము దుర్నీతి కాదని యెవ్వరేని చెప్పఁగలరా? అంతమాత్రమున నాకావ్యము దూష్యమని యెవ రను చుందురా? ఉండరు. అయినచో నాదుర్నీతి ప్రజల మనమ్మున నాటుకుండ నెట్లు కాపాడ నగునో చెప్పవలసియున్నది. ఉత్తమపాత్రలు పలుకు వాక్యములు సిద్ధాంతములనియు నితరపాత్రలు పలుకునవి పూర్వపక్షవాక్యములుగాఁ గన్పట్టినను నవి సిద్ధాంతములు కాఁజాలవు గానఁ బాఠకులు వానింబట్టి తమవర్తనమును మార్చుకొనరనియు నెఱుఁగఁదగు. ఇట్టిదానికి వ్రాయుటకన్న మహాకవుల వచనరచనలం జూపి చర్చించినఁ గొంత యుక్తముగా నుండెడిని.

సీ. వెలిఁబెట్టిరే బాడబులు పరాశరుఁబట్టి దాశకన్యా కేళి తప్పఁజేసి? (మ. చ.)

పై సీసపద్యము దుర్నీతి బోధకమా కాదా? మఱియు—

ఉ. ...వెన్నవలెం గఱంగు నలివేణులఁ గాఁగిటఁ జేర్చుభాగ్యముల్
శా. ...ఆ నందో బ్రహ్మయటన్న బ్రాఁజమప్ర నంతర్బుద్ధి నూహింపుమా...

ఈ పద్యము లన్నియు దుర్నీతిబోధకములే, యివియె యననేల, యీపట్టిమున వరూథిని నోటనుండివచ్చు ప్రతియుక్తియు దుర్నీతి బోధకమే కావలెను. ఎందుచేత? వేశ్యాసమాగమ ముత్తమ మనియుఁ, గర్మనిష్ఠత్యాజ్య మనియు బోధించుటచేత. అగుచో గతియేమి? ఆ మాటలను బూర్వపక్ష మొనర్చి పలికిన ప్రవరాఖ్యుని మాటలు సిద్ధాంతము లగునని కవి యభిప్రాయము గాని వరూధినిమాటలు సిద్ధాంతములని కాదు. కావున నంతమాత్రమునఁ గావ్యము దుర్నీతిబోధకము గానేరదు. ప్రవరాఖ్యుని వచనములు చూడుఁడు.

శా. ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱియొండేఁ గంటిమే కామశా
స్త్రోపాధ్యాయివి నా వచించెదవు మేలోహో త్రయీధర్మముల్
పాపంబుల్ రతి పుణ్యమంచు నిఁక నేలా తర్కముల్ మోక్షల
క్ష్మీపథ్యాగమ సూత్రఫక్కి కివివో మీసంప్రదాయార్థముల్.

ఈ యుపన్యాసము వలన నవగతమగు నీతియే శాస్త్రచోదిత మగునీతి యనియు దీనినే చదువరులు గ్రహింపఁ గలరనియుఁ గవియాశయము. పూర్వ పక్షము లేనిచో సిద్ధాంతముదయింప నేరదుగానఁ గవిసమీహిత సిద్ధాంత సదృశ మగుపూర్వపక్ష ప్రసంగము పాత్రోచితముగ వర్ణించుట కవిధర్మము. అట్లు వర్ణించు నప్పుడుగూడ నాలంకారిక సమయోల్లంఘనము చేయఁగూడదు. కాని యేకారణము వలననో సర్వజ్ఞు లగు కాళిదాసాదుల శ్లోకములు గూడఁ గ్వాచి త్కముగా దోషపరికరణమున కుదాహరణము లగుచున్నట్టులు లక్షణగ్రంథముల వలనఁ దెలియ నయ్యెడిని. దీనింబట్టి చూడ గుణమున్న చోటనెల్ల నించుక దోష మున్నను సహ్యమని పెద్దలు చెప్పు సిద్ధాంత వచనము స్మృతికి వచ్చుచున్నది. అది యటులుండుఁగాక! అవస్థాంతరమును బొందియున్న యుత్తమ నాయికా నాయకుల ప్రసంగములు గూడఁ గొండొకచో దుర్నీతి ప్రదములుగ నుండును. రాగిగినవారి ప్రలాపములంబలె, నట్టిపట్టుల నవ్వారి వచనములును బరిత్యాజ్య ములే. అనఁగాఁ బూర్వ పక్షకోటి ప్రవిష్టములే గాని సిద్ధాంతపదవికి రాఁజా లవు. పరికింపుఁడు. అనృతము దుర్నీతి కాదనువా రుండరుగదా? అట్టి యనృతము నొక పట్టునఁ గాళిదాసు దుష్యంతునివంటి యుత్తమ నాయకునిచేఁ బలికించెను.

శ్లో. క్వవయం క్వపరోక్షమన్మథో మృగశాబై స్సమ మేధితో జనః
పరిహాస విజల్పితం సఖే పరమార్థేన నగృహ్యతాం వచః॥

ఈ శ్లోకము శాకుంతలములోనిది. దుష్యంతుఁడు తనకు శకుంతలయందును శకుంతలకుఁ దనయందును గల యనురాగమును దనమిత్రునితో వచించి వదపడి యతఁ డంతఃపురమునకు నిది తెలియఁజేయు ననుసందియము రాఁగాఁ బైరీతి నప లాపించెను. దీనిని దుర్నీతి యనువారుందురా? సమయోచితముగా నట్లతఁ డప లాపించుట యుక్తమేయని కావ్యధ్వనివేత్తలు నిర్ణయింతురు. దుష్యంతుఁడు శకుంతలా విషయక వ్యామోహములో నుండి పలికిన పలుకులకన్నఁ బదపడి శకుంతలను మఱచి శకుంతలచేఁ దెలుపఁబడి కూడ శాపవశమున నిజము స్మృతికిఁ దగులక యామె బరిగ్రహించుటకుఁ బరకీయా పరిగ్రహణ దోషము వాటిల్లునేమో యని కొంకునప్పటి పలుకులు నీతిప్రదాయకములుగను సిద్ధాంత స్థానోచితములు గను నుండునని ప్రాజ్ఞులు నిర్ణయింతురు. ఇట్లే కావ్యముల యందేమి నాటక ములయందేమి చర్చించి సారమును దెలిసికొనవలసి యుండును. దిఙ్మాత్రము వ్రాసితిమి గాని విస్తరించినచో నెంతయేని పెంచ వలసివచ్చును. పైని జెప్పిన

విధముగాఁ గాక యేదో యొక పూర్వపక్షపు వచనమును బట్టుకొని నిషేధింపఁ బూనితిమేని ఆదికావ్యము మొదలు నేఁటివరకును గలకావ్యములన్నియు దుర్నీతి భూయిష్ఠములే యని చెప్పవలసి వచ్చును.

ఉ. ...తాటాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడినఁ బాపమంచు॥

(తారాశశాంక)

పై పద్యము నిప్పటివారనేకులు గర్హించు చుండఁగా మేము వినియుంటిమి. కవియుద్దేశము చొప్పన నది సిద్ధాంతవాక్య మెన్నఁటికిని గాదని వారెఱిఁగినట్లు తోఁచదు. దుష్ప్రవర్తనాభిముఖురాలగు స్త్రీ వచించు దుర్నీతి బోధకవాక్యమును బట్టి చరించువా రుండరు. ఎంతవ్రాసినను నిది తేలునది కాదు. వేద పురాణ కావ్యములలోఁ గావ్యార్థగ్రహణమే కష్టము. ఇందుఁ బదార్థము వేఱుగను సారము వేఱుగను నుండును ఈయంశమును గూర్చి లాక్షణికు లెంత యుద్ఘోషించినను ప్రకృతకాలవిమర్శకాభాసుల కా గ్రంథనామములుగూడ తెలియని కతన యథేచ్ఛగా వ్రాసి కవులను దూషించుట కవకాశము గలుగుచున్నది.

"వ్యభిచారము తప్పని బోధించుటకుఁ గథానాయకునకు సుఖవ్యాధులు లోనగునవి తటస్థింపఁగా నప్పుడతఁ డేడ్చుచు నీతి బోధించినట్లు రచించుట లాక్షణికసమ్మత మగునా ?"

మావిమర్శకుఁడుగారు పైఁ జెప్పిన చొప్పునఁగాని నీతిని బోధించినను లాభము లేదనుచున్నారు. అట్టి దుస్థితులు వ్రాయవలసిన యవసరము తటస్థించినను వర్ణించుట యుక్తము కాదని లాక్షణికులు మొఱ్ఱవెట్టుచున్నారు. ఇందేమి గతి? గతిమాటకేమి! లాక్షణిక సమయము నుదాహరించి చూపుటయే గతి.

"...కవినా ప్రబంధ ముపనిబధ్నతా సర్వాత్మనా రసపరతంత్రేణ భవితవ్యం తత్రేతివృత్తే యది రసాననుగుణాం స్థితిం పశ్యే త్తాం భంక్త్వాఽపి స్వతంత్రతయా రసానుగుణం కథాంతర ముత్పాదయేత్ నహి కవే రితివృత్త మాత్రనిర్వహణేన కించి త్ప్రయోజనం ఇతిహాసా దేవ తత్సిద్ధేః"

(ధ్వన్యాలోకమునుండి)

మఱియు మాప్రబంధముల నటుండనిత్తము. రామాయణాది ప్రబంధము లనే పుచ్చుకొందము. నాయికా నాయకులకు సంబంధించినంతవఱకు వర్ణనీయ

ములైన కష్టసుఖములు స్నానపానాదులు లోనగునవియును నందు వర్ణించియు దంతధావనమునకుమున్నవశ్యంభావి యగు కొండొక కృత్యమును గూర్చి వర్ణింపని కారణ మేమో? విమర్శకుఁడు విచారింపవలసి యుండును. ఏ నాయికా నాయకులుగాని దానితో నవసరము పట్టనివా రుండరుకదా? ఔరా! కావ్యార్థ విజ్ఞానము! ఏది వర్ణ్యమో, ఏదికాదో, లక్షణజ్ఞసమయ మెట్టిదియో తెలియకయే విమర్శనము వ్రాయుటయు దాని నెవరో యచ్చొత్తించుటయుఁ గలుగు నీకాల మహిమ నేమనవలయును. దీనిం గూర్చి విమృష్టగ్రంథములలో నొకటి యగు పాణిగృహీతలో—

చ. మునుపు మహాకవీంద్రులు సమున్నతభక్తి నొనర్చు కబ్బముల్
వినుతికి నెక్కెఁ గాని యవివేకుల కూఁతలు తాటియాకులం
దునె నశియించె, నోటఁ బడు తుంపురు లేనియు నిప్పాశమ్ము వ
చ్చిన కతనన్ జగాన విలసిల్లెడి, మేటికృతుల్ నశించెడిన్.

అని వ్రాసియుంటిమి.

“ఉ. కాంతలమాట నమ్మికొని కంతునికిన్ గడు లోఁబడై తదీ
యాంతరభావముల్ దెలియ ‘కైసరుబొజ్జ’ యటంచు నుబ్బుచుం
డెంతవివేకులైన మది నీవిషయంబు పరీక్ష సేయఁగా
నెంతయు ‘బుడ్డనమ్మికొని యేటను బడ్డ విధమ్ము’ గాదొకో ”(శ్రవణా)

పై పద్యములోని ‘బుడ్డ’ అను పదము అసభ్యమని విమర్శకుని వాదము. అసభ్యమనఁగా అశ్లీల మని యాశయము. ఆ యశ్లీలము వ్రీడావ్యంజకము, అమంగలవ్యంజకము, జుగుప్సావ్యంజకము అని మూడు దెఱఁగు లనియు దానిని గావ్యములయందు వాడఁగూడదనియు లాక్షణికులు వ్రాసియున్నారు. కావున నిప్పట్లు విమర్శకుని యాక్షేపణము సమంజసమే కావలెను. కాని యాదోషము నకుఁ గొండొకచోఁ బ్రవృత్తిని లాక్షణికులెల్ల నంగీకరించి యున్నారు. దాని నిట నుదాహరించి చర్చింతముగాక.

“శాంత విదూషకాద్యుక్తౌ నదోషః శాంతోక్తౌ యథా”

శ్లో. ఉత్తానోచ్ఛూన మండూక పాటితోదర సన్నిభే
క్లేదిని స్త్రీవ్రణే సక్తి రకృమేః కస్య జాయతే.(కావ్యానుశాసనమునుండి)

పైపంక్తులశ్లీలప్రకరణముననే యాయానుశాసనికుఁడు వ్రాసియున్నాఁడు. శాంతుఁ డనఁగా నేకారణమువలన నైన నేమి స్త్రీవిషయక వ్యాపారమునుండి

దోషమును బొందినవాఁడని యెఱుఁగఁదగు. వాని ప్రసంగమునం దశ్లీలదోషము గుణముగా గ్రహింపఁ బడుననియు, నట్లే విదూషకోక్తులయందును గ్రహింప వచ్చుననియుఁ, బై వాక్యముల కర్థము, ప్రకృతమో ? భావశాబల్యమునఁ బ్రవర్తించు నాయకుఁడు పలువిధముల వితర్కించుచు నందు స్త్రీ వ్యసనము గూడనిది కావున నందుఁ బ్రవర్తించుట వివేకికి లక్షణము కాదనియు నట్లు ప్రవర్తించుట "బుద్ధిను నమ్మికొని యేటనుబడ్డ" సామెతవంటిదనియుఁ దనలోఁ దాను విమర్శించుచున్నాఁడని పద్యము వలన విస్పష్టముగాఁ దెలిసికొనవచ్చును గాన నిది శాంతోక్తిలోఁ జేరుచున్నది. అందుచే నిది దోషముగాదు. మమ్మా టకిని గాదు ఈ యనుశాసనము నెఱుఁగుటంబట్టియే మహాకవులెల్లరు నిట్టి పట్టులనెల్ల నిట్లే వ్యవహరించుచు వచ్చిరి.

(1) శ్లో. కృచ్ఛ్రేణా౽ మేధ్యమధ్యే నియమిత తనుభిః స్థీయతే.

(2) శ్లో. స్తనౌ మాంసగ్రంథీ కనకకలశావిత్యుపమితౌ
ముఖం శ్లేష్మాగారం తదపిచ శశాంకేన తులితం
స్రవన్మూత్రక్లిన్నం కరివరశిరస్పర్ధి జఘనం
ముహుర్నింద్యం రూపం కవిజనవిశేషైర్గురుకృతం.

(పైశ్లోకమునకే యేనుఁగు లక్ష్మణకవిగారి తెలుఁగు పద్యము)

చ. స్తనములు మాంసపిండములు చక్కని బంగరుకుండ లంచు నా
ననము కఫాలయంబు తుహినద్యుతితుల్య మటంచు మూత్రభా
జనజఘనస్థలంబు కరిచారుశిరస్సమమంచుఁ గామినీ
జనమలినాంగముల్ సుకవిచాతురి వర్ణనకెక్కె నిమ్మహిన్.

(3) శ్లో. ...భోగినీనాం స్థూలోపస్థస్థలీషు స్థగితకరతలస్పర్శలీలోద్యతానాం"
అత్ర సహృదయాహ్లాదిన్యాం వ్యాఖ్యాయా మేవ మస్తి- స్థూలోపస్థ
స్థలీషు వర్తులోచ్చూనమదన సదనప్రదేశేషు జానపదేత్యాదినా అకృ
త్రిమార్ధేజీవ్ స్థగిత, మాచ్ఛాదితం, యత్కరతలం...ఇత్యాది.

అతివిస్తర మెందులకు ? పైశ్లోకము లన్నియును మహాకవి యగు భర్తృహరి సుభాషితములోనివి. ఇందలి యశ్లీలము లెల్లఁ బై నుదాహరించిన "శాంతోక్తా" అను దానివలననే సంరక్షణీయములు. ఈరహస్య మెఱుఁగనివారికా సుభాషితములు కుభాషితములే. కవిత్వము పుట్టినది మొదలు నేఁటివఱకును.

శాస్త్రజ్ఞు లగువా రెవరును నిట్టి సందర్భములయం దిట్టి ప్రయోగముల నేవగించు కొనుట లేదు సరికదా పైపెచ్చు తమ లక్షణగ్రంథములయం దుదాహరణములు గాఁగూడఁ గైకొనుచున్నారు.

శ్లో. ఆలోకనంచ వచనంచ నిగూహనంచ
యాసాం స్మర న్నమృతవత్సరసం కృశ స్త్వమ్
తాసాం కి మంగ! పిశితాస్రపురీషపాత్రం గాత్రం విచిన్త్య
సుదృశాం ననిరాకులోసి. (వాగ్భటాలంకార గ్రంథమునుండి)

పైశ్లోక ముపమేయ ప్రమరోపమాలంకారమున కుదాహరణముగా గ్రంథ కర్త స్వీకరించియున్నాఁడు. మఱియొకటి యీసందర్భమున విచారింపవలెను. ఈ కవికి నశ్లీల మన నెట్టిదియో తెలియదనియు నక్కతన దీని నుదాహరించి యుండు ననియు నాపాతరమణీయమగు నొకవాదము రానచ్చును. కావున దానిని నివారింతము.

“...వ్రీడా, జుగుప్సా, అమంగల, ప్రతీతికరా యే శబ్దాస్తేఽపి సభా మచితత్వా ద్గ్రామ్యా ఏవ, వ్రీడాహేతుర్యథా. “సాధనం సుమహ ద్యస్య” ఇత్యత్ర సాధనశబ్దః పుంశ్చిహ్నేఽపి శంక్యేత, జుగుప్సావాచకో యథా, వాయుః ప్రసరతి” వాయుశబ్దోఽ పానపవన శంకాకారీ, అమంగల ప్రతీతి కరో యథా, “సంస్థితోఽయం, సంస్థితశబ్దోఽత్ర మృతార్థ శంకాకారీ...”

(వాగ్భటాలంకార గ్రంథమునుండి)

సహృదయులారా! “సాధన, వాయు, సంస్థిత, శబ్దములనుగూడ నంగీకరింపనియంత పరిశీలనగల యీయనుశాసనమునకు “పురీషపాత్ర” శబ్దమునందలి దోషమెఱుఁగరాదను సాహసులుండరుగదా! అట్టిచో నితఁ డద్దానిని నలంకారోదాహరణముగా నిచ్చుటకుఁ గతమేమి? “శాంతోక్తావదోషః” అను నట వాదశాస్త్రము ననుసరించియే యని యెఱుఁగునది. మఱియు నీరహస్యము నెఱుఁగక కొందఱు యథేచ్ఛముగా నశ్లీల ప్రసంగములను గావించి వాని నెల్ల భర్తృహర్యాదులు శాంతోక్తులయందు వాడిన ప్రయోగములవలన సాధింపఁ జూచుచున్నారు వారెల్ల నీరహస్యము నెఱుఁగవలయు నని కోరుచున్నారము. ఇందునుగూర్చి “శలభాలభనము”నందు విశేషించి చర్చింతుము. పై నుదాహరించిన భర్తృహరి శ్లోకములలో (8)వ యంకెగల శ్లోకము “శాంతోక్తి”

కాదని ప్రకరణమునుబట్టి కొందఱు వాదింపవచ్చును. అగుచో నది మాకు మఱియు నుపకారకమేగాని యైనను దత్త్వమును దెలుపఁబూనుపట్టున నట్టి స్వలాభములను జూడఁగూడదు గాన నదికూడ శాంత్యోక్తిలోనిదే యని చెప్పు చున్నారము. అందులకు,

"శ్లో. సంసారే స్వప్నసారే పరిణతి తరళే ద్వేగతీ పండితానామ్."

అను మొదటి చరణమే బోధక మని ప్రాజ్ఞు లెఱుఁగుదురుగాక మఱియు నాయాశ్లోకముల నుదాహరించి తమ కృష్ణలీలాతరంగిణిలోని యవాచ్య ప్రసంగములను సాధింప నెంచుచు "గుంజాగర్వభంజన" మను పేరితో మామిత్రులు మ॥ రా॥ రా॥ బెల్లంకొండ రామారాయ కవీంద్రులవారు చిన్నపొత్తము నొక దానిని బ్రచురించియున్నారు. పైవారి రహస్యముల నెఱిఁగి సమర్థనము నకు దిగవలయునని ప్రార్థింపఁబడుచున్నారు. అపవాదాపవాదకభావము నెఱుఁగక యెవరుగాని శాస్త్రప్రసక్తిలోనికి నడుగిడఁ గూడదు

"నహింస్యా త్సర్వాభూతాని" "అగ్నిషోమీయం పశుమాలభేత" ఈ యుభయశ్రుతులకును నేకవాక్యత గల్పించుకొనినంగాని చక్కని సిద్ధాంత మదయింపదు.

"వచనా త్ప్రవృత్తి ర్వచనా న్నివృత్తిః"

ఏభూతమునుగాని హింసింపఁగూడదు. ఎందుచేత? 'నహింస్యాత్' అని వేద ముద్ఘోషించుచున్నది గనుక; మఱియు యజ్ఞమునందుఁ బశుహింసచేయ వచ్చును ఎందుచేత? శ్రుతి చెప్పుచున్నది గనుక — తుదకు దేలిన సారమే మనఁగా — "అపవాద వినిర్ముక్త స్థలఏవోత్సర్గశాస్త్రస్య ప్రవృత్తిః" కావున ముందుగా నపవాదమునకుఁ జోటుచూపి పిదప నుత్సర్గము ప్రవర్తింపవలయును. అందువలననే.

"అగ్నిషోమీయ పశువ్యతిరిక్త సర్వభూత కర్మకహనన మిష్టసాధనత్వా-భావవత్"

అని పైశ్రుతులకు నిష్కృష్టార్థమును మీమాంసకులు నిర్వచించియున్నారు. విస్తరము తజ్ఞులవలననే యెఱుఁగఁదగు. ఇఁకఁ బ్రకృతమో శాంతవిదూషకా ద్యుక్తులయందుఁదక్క నశ్లీలము లితరత్రి వాడఁగూడదు, అని యర్థము చెప్పి తీరవలయును. కావున విమర్శకుని యాక్షేపణము శాస్త్రజ్ఞానదూరమని యీచే

క్షింపవలసినదే. మఱియుఁ బ్రకృతమునకు సంబంధింపకున్నను నపవాదశాస్త్ర ఘటిత విదూషకాద్యుక్తులకుఁగూడ నుదాహరణము చూపవలసియున్నది. గ్రంథ విస్తరభీతిచే నందులకు దిగక తదుదాహరణము లచ్చటచ్చట నాటకములయందును ప్రహసనములయందును జూడఁగోరెదము. ఈవిచారణమువలననే ప్రహసనము నందలి శ్లోకములుగూడ శ్రీరామారావుగారి యశ్లీలములను సమర్థింపనేరవని తెలియఁగలదు. వారి "గుంజా గర్వభంజన" మెల్ల నింతమాత్రముననే ప్రత్యా ఖ్యాతమని చెప్పవలసియున్నను "శలభాలభనమున" నందుంగూర్చి విస్తరింపఁ బడునని సహృదయు లరయుదురు గాక.

మఱియు నొక విషయము విచార్యము. భర్తృహర్యాదులు సంస్కృత భాషాకవులు. వారా భాషలోని యనుశాసనములం బట్టిపోవచ్చును, తెలుఁగుకవుల కట్లుపోవుట యుచితముగాదని కొందఱనఁగా వింటిమి. ఈయనువా రెంత విజ్ఞులో మేమెఱయఁజాలము. ఆలంకారిక విషయము తెలుఁగునకు వేఱుగలేదు. ఉండనక్కఱయులేదు. గుణదోషవిషయకమగు చర్చయుఁగూడఁ దెలుఁగునకు వేఱుగ గ్రంథములులేవు. ఉండెఁబో! అవియు సంస్కృతగ్రంథములఛాయలే. ఏభాషలోనున్నను ధర్మశాస్త్రమెట్లు సర్వజనగ్రాహ్యమో అట్లే యిదియునని యెఱుంగునది. కావుననే తెలుఁగుమహాకవులుగూడ శాంతోక్తులయం దశ్లీలము లను వాడియున్నారు. దిఙ్మాత్ర ముదాహరించెదము.

(కవికర్ణరసాయనమునుండి)

శా. పాత్రాపాత్రవివేకరిక్తులు శుభప్రారంభముక్తుల్ పుర
పోత్రిప్రాయులు తత్త్వసాధనకళాబోధానపాయుల్ శ్రవో
నేత్రఘ్రాణకజిహ్వికాపరమనోనిత్యానుకూలుర్ సదా
మూత్రద్వారసుఖాభిలాషు లహహా! మోక్షంబపేక్షింతురే.

క. మలమూత్రరక్తపిత్తా, దులు వేర్వేఱైనరోసి దుర్మదుఁడిహిహీ!,
మలమూత్రరక్తపిత్తా, దుల ప్రోవగు కాయమింపుతోఁ గామించుఞ్.

తే. గీ. మూత్రపతనస్థలం బపవిత్రమనుచుఁ
ద్రొక్క రా నేఁ గని చాలఁ దొలఁగుచుందు
రట్టిమూత్రపుఁ గాలువయైన డోలి
యోని దానికి రోయదీ యుల్లమహహ!

(కవిరాజ మనోరంజనమునుండి)

అతివిస్తరమెందులకు? పైనుదాహరించిన గ్రంథములలో నీ పట్టము నందే మఱికొన్ని యిట్టివికలవు. చూడఁగలరు. ఆగ్రంథములే యననేల, యే గ్రంథములందేని యిట్టి పట్టుల నిట్టే యుండును. ఐనచో నేవము కలుగుట సంభవించునందురా? ఆయేవము కలుగుటయే సాధ్యముగా నెంచి కవి పాత్రోచితముగా నట్లు ప్రసంగించెను, గాన నాయాపత్తి పనిచేయదు. కావుననే ఆది శంకరులు,

శ్లో॥ నారీస్తనభరనాభీదేశం దృష్ట్వామాగామోహావేశం। ఏతన్మాంసవసాదివికారమ్॥ అని యేవమును గలిగించిరి.—

శ్లో॥ శాంతే లోష్టాయతే సర్వమ్॥ (అలంకారశేఖరమునుండి)

మన మెంతటి మహ్యాపడినను విరక్తుడింతకన్న గౌరవముగా వర్ణింపఁడు. ఇంతవఱకెందులకు? శ్రీ యాంధ్రకవితా పితామహుఁడొకచోట్లను,

చ. పడిగముత్తమ్ములం బుఘుసుము పల్లవకోటికి నోరు, వేణి యం
గడిపవరమ్ము సంశ సారకాయ బుర్రోజము లవ్వరవ్వసా
వడి యొద, యూరువుల్ గబడి వాతియనంటులు, పాప జిడ్డిగి
జ్జిడి వెలయాలి పవనము జీవనమే తలపోసి చూడఁగన్.

అని యేవముగా వర్ణింపలేదా? భాగవతాగ్రగణ్యుఁడగు శ్రీ పోతరాజుగారు.—

ఆ. అధముఁడైనవాని కాలుగుకంటె
నత్యధికుని యింట దాసియగుట మేలు
హీనుఁబొంది యోని హింసింపఁగా నేల
యువతి జనుల కూరకుంట లెస్స॥

అని భాగవతమున నుడువలేదా? వీరెల్లరు మూర్ఖులా? లౌకికసమయము నెఱుఁగక వంకలుపెట్టు మనము విజ్ఞులమా? ఔరా! కాలమహిమ! వచనానుసారముగ లోకానుసారముగ నడుచు మహాకవుల కీనాఁడెట్టికష్టము తటస్థించుచున్నది! ఆశ్చర్యమేమి? వేదమననుసరించి యజ్ఞయాగాదు లొనరించు మహామహులకన్న నీకవులయెక్కువయేమి? వారిని వెక్కిరించి వ్రాయువారు వ్రాయుటలేదా? అట్టే వీరినిగూడ వెక్కిరింతురు. అది యటులుండుఁగాక. ప్రకృత శ్రవణానందప్రయోగ మిప్పటి నవీన సిద్ధాంతమునకుఁగూడ విరుద్ధము

కాదని శ్రీ రెంటాల వేంకటసుబ్బారావుపంతులు బి.యే.,బి.యల్., హైకోర్టు లాయరుగారి లేఖవలన దెలిసికొనవచ్చునుగాన నద్దాని నిట నుదాహరించు చున్నారము.

I have perused all these verses in 'Sravananandani' and am of opinion that only six of them (indicated in the list by cross marks) are objectionable according to modern refined notions, though verses containing similar ideas and description are not uncommon in high class Telugu Literature. The rest of the verses in the list are unobjectionable and do not transgress the legitimate bounds of of *Srungara*, even according to present-day canons.

28th Janry 12, Mylapore, Madras. } (Sd) R. Venkata Subba Rao.

ఈ క్రిందిపంక్తులు పాణిగృహీతనుగూర్చినవి.

I have gone through every one of them. None of these are objectionable.

(Sd) R. V. S.

పైపంక్తులు శ్రీలాయరుగారు వ్రాయుటకు సందర్భ మేమనఁగా మ॥ రా॥ రా॥ బల్లంకొండ రామారావుగారు శ్రీకృష్ణ లీలాతరంగిణిలో నసంప్రదాయము గా నశ్లీలములను వాడి రని మాశిష్యుఁ డాక్షేపించఁగా, వారిపక్షమున నొకరు బూతులు, బండ బూతులు, అని పెద్దజాబితాను మా శ్రవణానంద పాణిగృహీత లనుగూర్చి ప్రకృతపు విమర్శకునివలెనే ప్రచురించిరి. దానిని జూచి వారు పై యక్షరముల నాయచ్చుకాగితము మీఁదనే వ్రాసి పంపించిరి. ఆవ్రాయు నప్పుడు వారందులోఁ గొంతమంది పరిష్కృత నవనాగరకు లంగీకరింపనివి యని కొన్నిటికిమాత్ర మొక గుర్తుపెట్టిరి. ఆగుర్తు పరిష్కృతపద్యమున కుంచలేదని యెఱుఁగునది — కావున "బుడ్డ" అనునది యేమతమునఁగాని యెయ్యెడ దూష్యము కాదని స్థిరీకరింపఁ బడుచున్నది. ఇదిగాక యీపదము బుడ్డకాఁకర, బుడ్డ [illegible] నగు పెక్కుసమాసముల శ్రుత మగుచుంటచే నశ్లీలములలోఁ గూడ

నంతగాఁ బరిగణింపఁ దగనిది. "తుష్యతు దుర్జన న్యాయమున నశ్లీలములలోఁ బూర్తిగా గణింపఁ దగినది యైనను "శాంతోక్తా వదోషః" కనుక నిర్దుష్ట మని యెఱుఁగఁ దగు. ఈ వ్రాసిన శాస్త్రార్థముచే దీని సజాతీయములగు "మురుగు కాలువజాతి" లోనగు నాక్షేపణములెల్లఁ బ్రత్యాఖ్యాతములని యెఱుఁగఁ దగు. మనపూర్వులు ప్రతివిషయమునందును లేశలేశములుగా విమర్శించి లక్షణముల నేర్పఱచి రనియు వారి కట్టుబాటుల నాక్షేపించు నేఁటి నవీనులలో ననేకులు వృథోదరపోషకమాత్రులనియు నీవిమృష్ట గ్రంథములలో నొకట వ్రాసియే యున్నారము.

మ. కలు ద్రావన్ జన దంచుఁ జెల్పుటకునై కల్లిచ్చు నాచెట్టునా
కులుగూడన్ గలుషమ్ము లంచుఁ దమ వాక్కుల్ వేదముల్ గా జగం
బులకున్ బోధ యొనర్చినట్టి సుమహాత్ముల్ "కడ్పుకైలాస" మా
ఖలులన్ బోలఁగఁ జాలరో వశమొకో? ఖండింప నక్కట్టులన్.

(పాణిగృహీత)

ఆయా శాస్త్రార్థ విషయమెల్ల 'నిప్పుడు నవీన సిద్ధాంతములకుఁ గాలు ద్రొక్కు వారింగూర్చి వ్రాసితిమి. మా విమర్శకుఁడుగారి కిది యంతయు నకించిత్కరమే గాన నాయనకొఱకుఁ గాదని యెఱుఁగునది.

"ఈపరి సురతవర్ణన మసభ్య మగునా?"

మావిమర్శకుఁడుగారు పైవిషయమును వర్ణించినవి కొన్నియుఁ గేవల సురతమును వర్ణించినవి గొన్నియు నసభ్యము లని వ్రాసియున్నారు. అందు వారొక సీసపద్యము నుదాహరించుచు నందు మఱియు నసభ్యమని కాఁబోలు నొక చరణము మానివేసిరి. ఆచరణమునకుఁ గుండలీకరణము గుఱుతుగా నెఱుఁగునది.

సీ. చూచు నేమొకో సిగ్గుచోటు లంచును మధ్యమధ్యఁ గౌఁగిటికొక్కమాఱుఁజేరు
కోపగించునో యంచుఁ గులుకు గుబ్బల మధ్యమధ్యఁ జేతులకొక్కమాఱొసంగు
పరిహసించునో యంచు బల్ రయమ్మున మధ్యమధ్య నాపక యొక్కమాఱు పెనఁగు
(శ్రమఁజెందునో యంచుఁ జవులు దేఱఁగ మధ్యమధ్య నోష్ఠమ్ము కొక్కమాఱొసంగు)

తే. గీ. ముద్దులిడి యొడలెఱుఁగమి మోవిఁ గొఱుకు
బదులు తీర్చనె యని చేతఁ బట్టు త్రొమ్మ

రాజ్యమిది నాది యంచు గర్వమ్ముఁ జూపు
నుపరత మొనర్చువేళ నయ్యువిద మిన్న.

పద్యమెల్ల నుదాహరించి "శ్రమఁ జెందునో" అను నాల్గపచరణ ముదాహరింపకుండుటకుఁ దగిన హేతువు మాకు గోచరింప లేదు. చదువరులు పరికింతురుగాక. అది యటులుండె. పురుషాయిత వర్ణనమే తగదనియా? లేక యిట్లు వర్ణించుట తగదనియా విమర్శకుని యాశయము? క్షణకాల మిట్లు వర్ణించుట మాత్రమే తగదని యనుకొని చర్చింతము.

సీ. పాలిండ్లు ప్రియపడి పతి చూడ లజ్జఁ దద్వక్షస్థలమ్ము పై వ్రాలి వ్రాలి
మగుడఁ దన్వేఁడుచు నెగనెత్తి పట్టఁ గాముకునక్షు లిరుగేల మూసి మూసి
యిఁకఁ జూడఁ గప్పితి నిదె యంచుఁ జనుముక్కు లతఁడు పాణులనంట నలిగి యలిగి
కటిభార మెగయ నెత్తుటకుఁ బోడ్పడి యెదనని చాఁపఁ బతి చేతులాఁచి యాఁచి

తే. గీ. తనదు గోప్యాంగముల దాఁచికొనఁగ రామి
యరసి కెలనికి డిగిపోవ మరలి మరలి
కొమ్మ పుంభావరతి కాదిఁ గొంచగాని
కొలఁది యెఱుఁగద మది వొరకొన్న వెనుక. (కళాపూర్ణోదయము)

మఱియు నీషట్టమున నిదే వర్ణనమున మఱియొక సీసపద్యమును వేఱొక చంపకమాలయును నిదే శైలివి కలవు. ఈదాహరించిన కళాపూర్ణోదయ పద్యమునకును మా పద్యమునకును గల పోలికను సహృదయు లరయుదురుగాక. పింగళి సూరన్నగారనఁగాఁ ద్రోసివేయఁదగు కవులలోని వాఁడు గాఁడు. ఉపరిసురత మసభ్యమని యంతైన నెఱిఁగినచోఁ దన ప్రబంధమున నేల వర్ణించును? వర్ణించుటలో నేమైనఁ గొంకినట్లున్నదా? లేదు కావున గ్రామ్యాశ్లీలాదులలో నుపరి సురత వర్ణనము చేరదు. మఱియు నిందుంగూర్చి లాక్షణికులు గొన్ని విశేషములు వ్రాసియున్నారు.

శ్లో. ......పురుష భావవషట్కృతి వర్జితం
వనితాయా నిజయా సుకృతీకృతీ మణితహీనరతోత్సవ మాచరేత్.

అని రతిరహస్యమునందు స్వీయాసంభోగము పురుషభావవర్జితముగా నుండఁదగు నని శాసించెను. ప్రకృతము మా కీయాక్షేపణము లేదు గాని సూరన్నగారి వర్ణనమునకుఁ దగులుచున్నది. ఒక సూరన్నగారికే యననేల! స్వీయా

విషయమునకుఁ బురుషాయితము వర్ణించినవారికెల్ల నీయాక్షేపణము తగులఁ బడినదే. తగులుఁగాక ! అంతలో వారి కవనమున కసభ్యత్వ మెట్లు కలిగెడిని ? ఆకవులు కామశాస్త్రరహస్యము నెఱుఁగనివారని కాని, యెఱిఁగియు నతిక్రమించిరని కాని యూహింప వలసియుండును. కవులకుఁ గామశాస్త్రజ్ఞత్వము కూడ నుండ వలెనా యని మా విమర్శకుఁడు వెక్కిరించును గాఁబోలును. వెక్కిరించినను చెల్లక తీరదు.

...కామ శాస్త్రతః కామోప చారస్య, సంవి దిత్యను వర్తతే కామోప చారస్య సంవితాఃమశాస్త్రత ఇతి కామోపచార బహులం హివస్తుకావ్యస్యేతి.
(కావ్యాలంకారసూత్రములనుండి)

(1) ...లోకే...నాట్యాభిధాన కోశకామార్థ యోగాది శాస్త్రేషుచ నిపుణతా వ్యుత్పత్తిః ...కామశాస్త్రే నైపుణం యథా....శాస్త్రోక్తివిపర్యాసో విద్యావిరుద్ధః, యథా॥ శ్లో॥ ...విభాతి దన్తపత్రిణ ముత్తరాధరే అత్రపత్రిణమధ రాధర ఏవ కామశాస్త్రే విహితం, నోత్తరాధరే॥ (కావ్యానుశాసనము)

పై శాసనములవలనఁ గవికిఁ గామశాస్త్రజ్ఞత యావశ్యక మనియే కాక కావ్యము కామోపచారబహులమనియు సంభోగశృంగారము వర్ణ్యమనియు విస్పష్టపడును. ఇంతమాత్రమే కాదు. కవికిఁ దెలియవలసిన వెన్నో యున్నవి. కావుననే—

శ్లో. నసశబ్దో న తద్వాచ్యం నసా విద్యా నసా కలా
జాయతే యన్న కావ్యాంగమహో భారో గురుః కవేః (అనికావ్యదర్పణం)

కవికిఁ బైవిద్యలయం దొకింత పరిశ్రమ తక్కువైనను నంత లోటు లేదు గాని విమర్శకునికో ! అం దేది తెలియకున్నను నవహాస్యత తప్పదు. నేఁటి విమర్శకులకో ? ఏమియుఁ దెలియ నక్కఱ లేదు. ఇచ్చవచ్చినట్లెల్ల గీట్లుపెట్టుట యొక్కటి చేతనైనం జాలును. అది యటు లుండె—

(1) కావ్యప్రకాశికాకర్త (2) కావ్యానుశాసనకర్త (3) కావ్యదర్పణ కర్త (4) నాట్యశాస్త్రకర్త, ఎందఱపేళ్లని వ్రాయఁగలము ? వీరెల్లరు సంభోగ వర్ణనమును నిషేధింపనివారే, పైఁగా నిట్లువర్ణింపుఁ డిట్లువర్ణింపుఁడని కూడ శాసించి యుండిరి—

శ్లో. సురతే సాత్త్వికా భావా శ్సీత్కారాః కుట్మలాక్షతా
కాంచీకంకణ మంజీరరవోఽధర నక్షతే. (అలంకారశేఖరమునుండి)
(విస్తరస్తత్రైవద్రష్టవ్యః)

విమర్శకుఁడు వదలిన నాల్గవ చరణమున "అసరోక్త విషయ మున్న" దని యెఱుఁగునది. ఈవిషయము వర్జ్యమని లాక్షణికులు ఘోషించుచు నేయున్నారు. పితృమాతృవిషయికమును పార్వతీపరమేశ్వర విషయకమును దక్కఁ దక్కిన సంభోగశృంగారమును లాక్షణికులెల్ల నంగీకరించువారే.

శ్లో॥ భవానీశంకరాదీనాంపి. తో ర్వా కేళివర్ణనమిత్యలంకారశేఖరే, యద్యపికుమార సంభవే కాళిదాసేనవర్ణిత మ స్తితథాప్యర్వాచీనేన నకర్తవ్యమ్, ఇత్యపితత్రైవ.

ఇట్లు లేశలేశములుగా నాయా యీ విషయములను విమర్శించిన లాక్షణికులు సంభోగము నంగీకరించు చున్నారు. తత్తద్భేదములను గ్రామ్యాశ్లీల దూరముగా వర్ణింప వలసి యుండుననియును వారే శాసించు చున్నారు. అట్టిస్థితిలో సంభోగ వర్ణనము పనికిరాదని కేవలము వాదించు వారికిఁ జెప్పఁదగు నుత్తరమేమి? ఏమియును లేదు. వారిప్రతిభ ముందు మహాకవుల శాస్త్రములు పనిచేయునవి కావు. ఇది యితరవిషయము. ప్రకృతమో? "నచ శంకా నచోత్తరమ్" ఉభయవిధ సురతములను వర్ణించిన మహాకవులపద్యము లెన్నో యున్నను విస్తర భీతిచేఁ దెలుఁగు కవులలో నుత్తముఁడని పేర్వడసిన పింగళి సూరన్నగారి పద్యమును మాత్ర ముదాహరించి మిన్నకుంటిమి. దానివలననే విమర్శకుని యాక్షేపణము నిరాధార మని తెలును

(1) 'రసజ్ఞవరుల మందు నిక్కెదరుగా' (శ్రవణా)

(2) "వానిం దన వీధి నేగుతఱి నిక్కి కనుంగొని" పాణిగృహీత.

ఇందలి "నిక్కు" ప్రయోగము లసభ్యములని విమర్శకుని వాదము—

సీ. కడుఁదీఁగసాగుచుబడుగునెన్నడుము మిక్కిలి గృశంబుగఁదత్తఱిలు మనిక్కి"

పై "నిక్కు" ధాతువు. క్రొత్త పెండ్లికూఁతురు భర్తపైఁ దలఁబ్రాలు వోయునెడఁ బింగళి సూరన్నగారు కళాపూర్ణోదయమున వాడిరి.

చ. ... నిక్కెడి నీల్గెడి విఱ్ఱవీఁగెడిన్ ॥ (విజయవిలాసము)
ఇది యురోజవర్ణనాసందర్భమునఁ జేమకూర వెంకటకవి వాడినది.
"బిగువుఁ జన్ను నిక్కఁ దిన్నెలఁబాత్రముల్ నెత్తమాడు॥

ఇది ఆముక్తమాల్యదలో శ్రీకృష్ణరాయ మహాకవి వర్ణించినది — ఈ కృష్ణరాయ లనేక మహాకవులను బరీక్షించు సభకు నాయకుఁడైనను మావిమర్శ

కుఁడుగారి యాక్షేపణముఁ బాతుఁ డయ్యెనుగదా! ఇతఁడేకాదు. మన యజ్ఞానమునెల్ల శాస్త్రముగా నుపచరింతుమేని నన్నయ్య భట్టారకుఁడుఁగూడ నవలక్షణలక్షితుఁడే సుఁడీ.

క. ... మఱువక నుష్ఠించునది సమంజసబుద్ధిన్॥ (మహాభారతము.)

మన తెల్విం బట్టి "నిక్కు" ధాతువుకన్నను "అనుష్ఠించు" ధాతు వసభ్యముగదా? గ్రాంథిక భాషాసంప్రదాయము నెఱుఁగక విమర్శనము చేయువారి కుత్తరమిచ్చుమా తెల్వి నేమనవలయును? మనవిమర్శకుఁడుగారి యర్థములు నైఘంటికులు వ్రాయనే లేదు.

"నిక్కు (దే) ఉన్నతమగు, గర్వించు, అతిశయించు, వర్ధిల్లు, గర్వము, ఉన్నతి, విలాసము. (శబ్దరత్నాకరము)

"కవి, రాజనికటమునఁగాని వేశ్యానికటంగాని రతిరహస్యముల ప్రస్తావింప వచ్చునా?"

వ్యాసః॥ ... శ్లో॥ గతోఽహం శయనాగారే మాతుస్తద్వచనాన్నిశి। దాసీ విచిత్రవీర్యస్య రూపయౌవనసంయుతా, (దేవీభాగవతషష్ఠస్కంధమునుండి)

శ్లో॥ పర్యంకేఽహం సమావేశ్య సంస్థితా ప్రేమసంయుతా। పరిసన్నోఽహం తదా తస్యావిలాసేనాభవం మునే। రాత్రౌ సంక్రీడితం ప్రేమ్ణా తయా సహ మయాభృశం ...

కాళిదాసః॥ శ్లో॥ కదా కాంతాగారే పరిమళమిళత్పుష్పశయనే। ... నిమిషమివ నేష్యామి దివసాన్'

మఱియొక తెలుఁగుకవి, క॥ శీతలసలిలస్నానము। భూతలమున శయ్య వంటిపూఁట మెతుకులున్। నాతిగల బ్రహ్మచర్యము। నాతరమా రోజుగడప నారయభూపా.

మఱియు నెన్నియో యిట్టివి కలవు. వీని నసభ్యము లనుట పొరపాటు. స్వరహోవిషయముగూడఁ గవికి వర్ణ్యమే. మఱియు రాజెంత కాలమునకు నాజ్ఞ యొసఁగనితఱి నింకొక కవి చెప్పిన శ్లోకము నుదాహరించుచున్నారము.

శ్లో. రాజం స్త్వత్ప్రిణాంబురాశేర్నహి జగతి గతః కశ్చిదేవావసానం।
కోవాఽర్థోఽర్థైః ప్రభూతైః స్వవపుషి గలితే యౌవనే సానురాగే

గచ్ఛామ స్సద్మ తావ ద్వికసితకుముదేందీవరాలోకినీనా।
మాక్రమ్యా క్రమ్యరూపం ఝుడితి వ జరయా లుప్యతే ప్రేయసీనామ్॥

పై శ్లోకము భర్తృహరి సుభాషితమునఁ గన్పట్టు చున్నను నిది యన్యకవి కృతమనియు దాని నిటీవల నెవరో చేర్చిరనియుఁ జెప్పవలసి యున్నది. భర్తృహరిలోని శ్లోకములు మఱికొన్ని గూడఁ బ్రబోధ చంద్రోదయాదులలోఁ గానవచ్చుచున్నవి. ఆ విషయ మిట విచార్యము కాదు. చూపిన యుదాహరణములంబట్టి వ్యాస కాళిదాసాదులెల్ల స్వరహో విషయములను స్వకవిత్వ మందుగ్గడించుటకుఁ గొంకమి తెల్లమగుచున్నది-తత్సంప్రదాయము ననుసరించియే శ్రీయాత్మకూరు ప్రభుసన్నిధిని—

సీ చెవులు సంజవరాలి చిన్నారి పొన్నారి ముద్దుపల్కులకునై
మొగము వాచె...... పంపఁగదవయ్య, యాత్మకూర్పార్థివేంద్ర॥

అనియును, శ్రీ పోలవరపు జమీందారుగారి సన్నిధిని—

శా. పాకన్ వాస మొనర్చుటొక్కటుపై భార్యా
సమాయోగము...కృష్ణరాయ నృపతీ వేవేగటాక్షింపవే॥

అని గృహనిర్మాణమునకుఁ గల్పను ద్వారగా దయచేయుఁడని వేఁడుసందర్భమునందును. శ్రీ మందసారాజుగారి సన్నిధిని—

శ్లో. దేశో దూరతరో యువా౽ప్యహ మహోవృద్ధా గురూ।
గేహినీ నూత్నాయంచ ఋతు ర్హిమప్రచురః...

అనియును జెప్పియుంటిమి. ఇవి యసభ్యములనుట పొరబాటు. ఆ యీ పద్యములను నానారాజ సందర్శనము 54, 81, 88, పుటలలోఁ జూడఁదగు—మఱియు నీక్రింద విమృష్ట గ్రంథములలో విమర్శకునిచే నాక్షేపింపఁ బడినకొన్ని ప్రయోగములను వాని నిర్దుష్టతను దెల్పు మహాకవుల ప్రయోగములను జూపుదుము.

(1) ఉ. ...ఏ। చందము నందమున్ గనఁగనైఁపఁడు. (శ్రవణా)

(1) ఉ. ...నీ। చందము నందమున్ గనిన జవ్వని యెవ్వని వెఱ్ఱిఁజేయదే॥
(మనుచరిత్ర 3 ఆ)

(2) సీ. మాయమాటలకు నమ్మకమైన వ్యాఖ్యాత... వంది... వేశ్యమాత॥
(శ్రవణా)

(2) శ్లో. కార్యేషు దాసీ కరణేషు మంత్రీ (ప్రాస్తావిక శ్లోకము)
(3) ఉ. ... ఏటికిదాఁచిపెట్టితిరి యేఁగనకుండ. (పాణిగృహీత)
(3) ఉ. ... ఏమంటి యుపేంద్ర (భార. ఉద్యో 3)

మధ్యమ పురుషేకారమునకు వికల్పసంధి.

చ. అడరిచి...మీ। రిదె యను నాజ్ఞ ద్రోచితిరి యొచ్చట।
(సర్వలక్షణ సారసంగ్రహము చూ)

(4) చ. ...అధమపు వేశ్యల॥ (పాణిగృహీత)
(4) చ. ...ఉగ్రపు బలులు॥ (భార కర్ణ ౨ ఆ)

ఉగ్రముగా వర్తించు బలవంతులని సమన్వయము. మధ్యమపదలోప సమాసము. దీని నిజేవల చిన్నమొన్న “ఉగ్రపుబలమని” దిద్దిరి. అది విచార దూరము.

(5) చ. కలసిన కొన్ని నాళ్ళకటిగాఁ గనుపట్టెడి మేనులై...మగండు నాలుసై
(పాణిగృహీత)
(5) ఆ. వె తెల్లహారుల రథము తెల్లనిగొడుగునై।
యల్లవాఁడె పాండవాగ్రజుండు...... (భార కర్ణ ౧ ఆ)
(6) ఉ. ...అంచు ...ఇంతులు...ఎల్లప్పుడు స్తుతియించువారు।(పాణిగృహీత)
(6) తండ్రి నచ్చిన ప్రజలు। (భార ఉద్యో 3 ఆ)
ఇటఁ జచ్చినవాఁడు తండ్రియో ప్రజలో తెలిసినచో నచ్చుట నుతియించు వారింతులో జలజాక్షియో తెలియనగు.

తే. గీ ...నీవు సంకట పడియెడు దేవపదవి। యైన నేనొల్ల॥(భార ఉద్యో 3ఆ)

సంకటపడువాఁడు శ్రీకృష్ణుఁడు గాని దేవపదవికాదు. విమర్శకుఁడు భారత మెఱిఁగినను నందలి ప్రయోగవైచిత్ర్యము తెలియఁగనివాఁడందురా? అయినచో నిది చిన్నయ్యసూరిలోనే కలదు.—

“కర్మాదులకుఁ బ్రాధాన్య వివక్షయందు ధాతుజ విశేషణంబులు కర్తతోడం బోలె వానితోడ సమసించు.” రాముఁడు రక్షించిన భృత్యుఁడు... రాముఁడు వసించిన చోటు.

ఇట రక్షించినవాఁడు రాముఁడా? భృత్యుఁడా? అప్పురా! భాషాస్వభావమా? తెలియదు. సంస్కృతాలంకార గ్రంథములా? తెలియవు. ఇట్టివారు విమర్శనము నొనర్చుటయా! మేలు! కాలమా! మంచిదశకు వచ్చితివి

(7) 'తవిటి రొట్టె' యిది విమృష్ట గ్రంథములలోనిది కాదు. నాచేతనే రచింపఁబడిన వెలుఁగు చిన్న వ్యాసము పేరు. ఇట "తవుటి" అని యుండవలెనని విమర్శకుని శాసనము. చిన్నయసూరియు సుప్తార్థప్రకాశిక యను దానివ్యాఖ్యయు "తవుటి" "తవిటి" యీ రెండును సాధువులని చెప్పుచున్నవి. (ఆచ్ఛికపరిచ్ఛేదము 36 వ సూత్రమును దాని వ్యాఖ్యయుఁ జూడుఁడు)

(8) మనమున యోజించు చున్నంత (శ్రవణా) ఆలోచించు అనునర్థమున యోచించు అని యుండవలెనఁట? యిందులకుఁ బాశుపతములోఁ బూర్తిగా వివరించితిమి. యోచించు తప్పు, తప్పు, తప్పు. దీనిని బ్రమాదపడిన వారు తప్పఁ దక్కినవారు ప్రయోగింపరు. శబ్దరత్నాకరమున నిది తత్సమ క్రియయని వ్రాయుట భ్రాంతిమూలకము. 'గచ్ఛత స్ఖలనం నదోషాయ' సంస్కృత గ్రంథములలో సర్వత్ర యోజయేత్ అనియే యుండును. ఇందులకు ధ్వన్యాలోకము, అలంకార శేఖరము, కావ్యాలంకారసూత్రములు, అవి యివి యన నేల? యాసద్గ్రంథప్రపంచమును జూడఁదగు

9. ఉ. ఇప్పటికైత గాండ్రు..." (పాణిగృహీత)

కవిత యనుదానివికృతి కైత, శబ్దరత్నాకరముచూ, కైత + కాడుఁ కైతగాఁడు బహువచనము, కైతగాండ్రు ఆయీప్రక్రియకుం జిన్నయసూరి వ్యా॰ తద్ధితపరి, ౧౧-౧౨ సూత్రములు చూచునది.

10. ఉ. పాడు వెలచేడియు నుంచెడి నిన్ను బోఁటికిఁ (పాణిగృహీత)

ఇట ఉంచెడి యను తద్ధర్మ విశేషణమునకు భూతార్థకత్వము సుగమము (ప్రౌఢవ్యాకరణము 71 వ పుటనుండి)

తద్ధర్మార్థక విశేషణం బసహాయతం త్రికాలవాచి యగు..., నా నేర్చు విధంబున (నేర్చు, నేర్చిన) భారత ఆది 1 ఆ,... జనమేజయు చేయు సర్పయాగమ్మున (చేయు-చేయఁగల) భారత ఆది 1 ఆ"......

11. క. అప్పరమేశ్వరి... (శ్రవణా)

ఈ పరమేశ్వరికి లక్ష్మియను నర్థము రాదని చిరకాలమునుండి యీతని గురువులు రామకృష్ణులు వాదించు చున్నారు. పాశుపతములో దీనింగూర్చి వివరించితిమి. ప్రయోగములకుఁ బరిమితియే లేదు. శబ్దరత్నాకరములో, పరమే

శ్వరుఁడు, శివుఁడు, విష్ణువు, అని స్పష్టముగా వ్రాసి యున్నది. పరమేశ్వరుని భార్య, పరమేశ్వరి యగుట లేమి సందియము ? తెలుఁగు నిఘంటువే చూడలేని వారికి క్రిందిసంస్కృతలకించిత్ప్రామాణికమైనను ... పలకోఆ కేఁబడుచున్నవి.

శ్లో॥ భార్యత్రి నగరే పరమేశ్వర్యా, ... పరమేశ్వరశబ్దస్య శంకరాది సాధారణస్య రాజన్యేఽభిధానియుజ్యతే..."

12. క॥ నవనాగరికులు కొందఱు శివశివ (శ్రీవణా)

ఈ "శివశివ" వైష్ణవభక్తురా లని వర్ణింపఁబడిన కథానాయికతల్లి పల్కిన మాట కాన నిట శంకించుచున్నారు. యుక్తమే, కాని వీరవైష్ణవుల మనిపించుకొను ప్రాజ్ఞులుగూడ శ్లో॥శివం మహాభాగవతం స్మరామి,అని శివస్మరణ నంగీకరించుచుండఁగా సర్వసామాన్య యగు నీసామాన్యవచనమున కింత శంకింపఁ బనిలేదు. దీనింబట్టి యీవృద్ధ వైష్ణవమతరహస్యవేదిని గాని సామాన్యభక్తురాలు కాదనికూడఁ దెలిసికోఁదగును. ప్రాజ్ఞులగు వైష్ణవులుగాని శైవులుగాని శివకేశవ నామముల నుచ్చరింపఁ గొంక రని యెఱుఁగునది.

శ్లో॥ తతస్త్వ సగణ శంభుస్తామాహ హరివల్లభాం,...హరిం త్యక్త్వా కస్మాత్ స్తౌషి దేవి జగత్పతిం,...(లక్ష్మీః)...ఏకత్వంచ మయాజ్ఞాత్వా మయా తే స్మరణం కృతమ్, ఉభయో రన్తరం నాస్తి మిథ స్స్వంసక్తచేతసోః,... ఇత్యుక్తం దేవదేవేన విష్ణునా ప్రభవిష్ణునా,...... (దే-భా-6స్కం)

సాక్షాల్లక్ష్మికన్న విష్ణుభక్తురాం డెక్కుడనుందురు ? ఆమెయే స్మరింపఁగా నిఁక నీసామాన్య యాదృచ్ఛికముగా స్మరించుటలోఁ దప్పేముండును ? ఇదిగాక వారివారివద్ద నాయారీతుల నటించినను వ్యో సామాన్య గాన నాయాయీమతములకు సంబంధించిన పట్టుదలతో దానికిఁ బనిలేదనియుఁ బ్రైప్రసంగము తానును గూఁతురును మాటలాడుకొను సందర్భములోనిది గాన నితరానుసరణముతో లేశమును బనిలేదనియుం గూడఁ దెలిసికోఁదగు. ఇఁక నొకచో మధుసూదనుఁడు—

క॥ ధనకాంతా...వానిశివునిగా నెన్నఁదగుఁ (శ్రీవణా)

అను పద్యమునందు ధనమోహకాంతామోహములు లేనివానిని శివునిగాఁ జెప్పవచ్చునని నొడువఁగా నయ్యెడఁ గూడ విమర్శకుఁడు వెక్కిరించెను. అది సంస్కృతశ్లోకమును దెలిఁగించిన పద్యము, అందు శివుని గూర్చియే యున్నది. శివకోడనుటకు బదులు హరికోడనినట్లు తెనిఁగించుట యపహాస్యాస్పదము గాన యథాశ్రుతముగనే తెలిఁగింపఁబడినది. మూలశ్లోక ముదాహరింతము.

శ్లో॥ వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసుకనకేషుచ, తాసు తేష్వ
ప్యనాసక్తః సాక్షాద్భర్గో నరాకృతిః”

కథానాయకుఁ డగు మధుసూదనుఁడు తనలోఁ దాను విచారించుపట్టున
నీశ్లోక మతనికి స్మృతికిఁ దగిలియున్నది. అప్పు డతఁ డిద్దానిని మార్చి పఠింప
వలయు నని యెవ్వ రందురు? అనరు. ఇది స్మృతికే తగులరాదందురా? అది
యనివార్యము. జితేంద్రియప్రశంస వచ్చినప్పుడు జితేంద్రియాగ్రగణ్యుఁడగు
శివునిం గూర్చిన శ్లోకములే స్మృతికిం దగిలెడిని ఇదిగాక వైష్ణవులయిన
కవులు గూడ శివునిగూర్చి వ్రాయవలసివచ్చినప్పుడు మూకీభావమును వహిం
చుటలేదు. ఇందులకు విశ్వగుణాదర్శము లోనగునవి యుదాహరణములు.
విస్తరభయమున శ్లోకము లుదాహరింపలేదు శ్లో॥ ఈశః కరస్వీకృత” లోనైన
నవి చూచుకొనఁదగు. మఱియు, పైపద్యములో మూలశ్లోకముకన్న విశేషార్థ
మున్నది ధనకాంతామోహమ్ములు, ఇట ధనమోహ, కాంతామోహ, ధనకాం
తామోహ, అని మూఁడర్థములు చెప్పికోవలయును. ఇందుకు, శ్లో॥ “అంభోజం
కలయజ” అనుచో, అంభోజం, అంభోజం, అను వ్యాఖ్యానము శరణము
యెఱుఁగఁ దగు, ఆయావిషయములుగాని ప్రకృత పద్యతాత్పర్యముగాని మావిమ
ర్శకుఁడుగా రెఱుఁగ రని వారి శృంఖలలోని యీక్రింది వాక్యము చెప్పును.

“కేవల ధనకాంతామోహములను గననివాఁడు శివుఁ డని చెప్పరాదు.
ఏకాంతల మోహములం గననివాఁడు శివుఁ డనిన లెస్సగ నుండి యుండును.
కాని యీసందర్భములో మన కిప్పుడు ప్రసక్తిలేదు”

అని తప్పుత్రోవఁబడి ప్రధానాంశమును మెల్లఁగ జాఱవిడిచి వెక్కి-
రింపఁజొచ్చెను.

శ్లో॥ అవిదితపద్యసమూహః పురుష శ్ఛిచ్ఛేద పుస్తకం కోపాత్”

మఱియు, చ॥...శివశివ వేయిమాట లిఁకఁ జెప్పఁగ నేటికిఁ జిత్తజాతసం
భవ మగు నాయవస్థ భగవంతుఁ డెఱుంగును. (శ్రీపణా)

అని కథానాయిక నాయకునకు వ్రాయుచున్నది. ఇంతకుమున్న దీని
తల్లియుం, కథానాయకుఁడును బలికిన “శివశివ” లనుగూర్చి వ్రాసితిమి. అందలి
యుక్తులచేతనే యిదియు గతార్థప్రాయము కాని యిట మఱికొన్ని విశేషములు
గలవు. మన్మథతాపోపశాంతిని గోరు బాలామణి మదనారియగు శివుని స్మరిం
చుటయే యుక్తముకాని యభీష్టదైవమైనను నియ్యెడల హరిని స్మరించినఁ
బ్రయోజనములేదు. మఱియు నజ్ఞానము కతమున శివనిందను సల్పు మూఢ వైష్ణ

వులు గూడ, వ్యాఖ్యాతి రేఖోపశాంతికై రుద్రిణామాంకితములగు నౌషధములను సేవించుచునే యుండుననుట నిగద్యదితమే. అట్లుండఁ బ్రాజ్ఞులవిషయమునఁ జెప్పవలసినదే లేదు. ఈ కథానాయిక ప్రాజ్ఞురాలు యని వివేకులు శంకింపరు. శంకింతురేని, నాయికను [illegible] సుట్టియున [illegible] ంపన్నరాలినిగా నిర్దేశించిన యంశము లనవే [illegible] ద్యమును సంపన్న మగును.

ఎట్లందురేని ? నాట్యవిద్యయనఁ జైపైనిలేదు. దానియందు వాఱితేఱిన స్త్రీ సంగీతసాహిత్యాదులయం దెక్కుడు పాండిత్యము కలదిగా నుండవలయు నని లక్షణాలు రచించిన గ్రంథములు చెప్పుచున్నవి. కూరగాయ నాట్యములును, తాళ్ళసంగీతములును జూచి "తన కలిమి యింద్రభోగము" గా శంకించుట పొరపాటు. దిక్మాత్రి మీవిషయమున శాస్త్రము దాహరింపఁబడుచున్నది.

శ్లో॥ నానాశిల్పప్రయోగజ్ఞా... చతుష్షష్టి కలాన్వితా,... ఏభిర్గుణైస్తు సంయుక్తా గణికా పరికీర్తితా"... (దశరూపకమునుండి)

శ్లో॥ నానాకలావిశేషజ్ఞా...రసభావ విభావికా,...నటకీ,సాప్రకీర్తితా" (నిస్తరస్తు తత్త్వగ్రంథేష్వవిజ్ఞానగంతవ్యః)(భరతముని ప్రణీత నాట్యశాస్త్రము)

ఒకటి చెప్పవలసి యున్నది. ప్రపంచకమెల్లఁ దత్తత్కాలోచితవిద్యల యం దాఱితేఱినదే యుండు నన పలనుపడును గాని గ్రంథకర్త కథానాయికనుగాఁ జేయునప్పుడుమాత్ర మాఱితేఱినవస్తువే కైకొనుట విధి.

శ్లో॥ సాధారణస్త్రీ గణికా కలాప్రాగల్భ్యధైర్యయుక్॥(దశరూపకమునుండి)
అని తల్లక్షణము నుదాహరించి

శ్లో॥ రక్తైవ త్వప్రహసనే నైషాదివ్యానుపాశ్రయే "ప్రహసనవర్జితే ప్రకరణాదౌ రక్తైవైషావిధేయా, యథామృచ్ఛకటికాయాం వసన్తసేనా చారు దత్తస్య,...ఇతివ్యాఖ్యా"

తేలిన సార మేమనఁగా ? స్వభావముగా సర్వజన సాధారణానురాగము గల సామాన్యకుఁ బ్రకరణాదులయం దేకత్రానురాగకల్పనను శాస్త్రకర్త విధించుచున్నాఁడు. అట్టిచోఁ గులోచితవిద్యాప్రావీణ్యమును దన గ్రంథమునందలి నాయికనుగూర్చి వివక్షించుటలేమి యసాంగత్య ముండును ? అంగీకరించితీర వలెను. దీనిచే విదుషీత్వము దుర్నివారమగును. దానిచేఁ బ్రాజ్ఞయగుట స్పుట మగును. అంతతో సర్వము సంపన్నమని సంక్షేపము, అయాశాస్త్రార్థము చే. గణిక నాయికగా నుండుటయే తగదనువారి వాదము పూర్తిగా నిరస్తము,

ఇందునుగూర్చి లక్షణగ్రంథములలో నెక్కడను నిషేధము కానరాదు. విధి సర్వత్ర కలదు. అననురక్తకూడఁ గొన్నిటియందు నాయికత వహింపవచ్చును.

"ప్రహసనే త్వరక్తాఽపి, హాస్య హేతుత్వాత్" (దశరూపకమునుండి)

దీనింబట్టియే పాణిగృహీతలోని నాయికను వేపలానురక్తనుగా మేము వ్రాయక మ. అనఁ గావ్య మ్మిది యైనను బ్రహసన ప్రాయమ్ము" అని ముందు పీఠికలోనే సూచించి యుంటి మని యెఱుఁగునది. మఱియు నిందు భగవంతుఁడు, అనుచో నశ్లీలమని యొకవాదము. అందుకు– "శివలింగ, సుభగా, బ్రహ్మాం డాదిశబ్దానాం వివక్షితార్థస్య ప్రసిద్ధతయాఽశ్లీలార్థో నోపతిష్ఠతే, నతేషు దుష్ట త్వమిత్యాశేరిస్ఫుటీభవిష్యతి, అను కావ్యప్రకాశిక చూడఁదగు.

13 గీ॥...గాన మీరీతి చక్కనికాంతి గలుగు పలువరుస గలకలుకుల కోలయు టరుదె" (పాణిగృహీత)

గానమునకును, బలువరుసకుఁ గల చక్కని కాంతికిని, సంబంధము కలదు. వివిధసత్త్వలు స్త్రీలని చెప్పి, ఆయా యీభేదముల నిరూపించుచు భరతముని యిట్లు సూచించెను.

శ్లో॥...చారు నేత్రా, నఖదంతైస్సుపుష్పితైః,...నృత్తే గీతేచ నాట్యేచ రతా,...గంధర్వశీలా..." (నాట్యశాస్త్రమునుండి)

ఇట్లు గంధర్వసత్త్వకు నఖదంతములు చక్కనికాంతి కలిగి యుండుటను విశేషాకారముగఁ జెప్పి నృత్తగీతాదికమును వివక్షచేసి యింతకన్న నుత్తమ సత్త్వలకు నాయా యీవిశేషములు రెండును వివక్షింపకపోవుటచేఁ జక్కని కాంతిగల దంతములు గానవిద్యకు సూచకములని మేము వ్రాసితిమి. దిఙ్మాత్ర సూచకముగాఁ దెల్పినదగుటచేఁ దాదృశనఖాదిమత్త కిది యుపలక్షణము. దంత కాంతి యన్యథా యున్నచో నది యెట్టిసత్త్వమో తెలుపుచున్నారము.

శ్లో॥ కృష్టదంతోత్కటముఖీ... సౌకరం (పంది) సత్త్వమాశ్రితా॥ (నా॥ శా॥)

సూకరత్త్వమునకు నల్లనిదంతములు లోనైనవి గుఱుతు, ఆ పెసత్త్వ మునుబట్టి గానవిద్యలోఁ బ్రవేశముఁ గలుగునా? కలిగినే యనుఁడు. ఎట్లుం డును? ఘుర్ఘురారావమువలె నుండునా? మఱియుఁ బైపద్యమునందే— "కవ నమీరెంటికన్నను గష్టమగునె" అని తుట్టతుద నున్నది. విమర్శకుఁ డీవాక్య మునకు మఱియును వెక్కిరించుచు "తిరుపతి వెంకటేశ్వరుల కవనమువంటి కవ నమైనచో గానాభినయములకంటెఁ గష్టము గాదని యెట్టకేలకు సమ్మతించెను. ఇంతకుమున్న లిఖించిన ప్రమాణములవలన నభినయమునకు సాహిత్యాద్యావశ్య

కత విస్పష్టమే. ౬౦౦౦ ప్రతులు గల సూత్రప్రాయగ్రంథము రచించినవాఁడు భరతముని. ఆతని గ్రంథమును నేటికిని యే యాలంకారికుఁడుగాని ప్రమాణముగాఁ బట్టకపోలేదు. దానింబట్టి చూచినచోఁ గవికిఁగల సామగ్రియెల్ల నభినయించుపాత్రల కుండితీరవలె నని తెలియుచున్నది. పైఁగా సభలోఁ దానెట్లభినయించునో యితరులకలనఁ దెలియఁజేసినదియే కాని తనకుఁగూడఁ దెలిసికొనుటకు వీలులేని విద్యయభినయము. కవనమట్టిది గాదు. కవితారసనిర్ణేతలలో గవికిఁ గూడ స్వకవన విషయమున సహృదయత్వము నాలంకారికు లంగీకరించియున్నారు. అభినయ విషయమున సర్వదా పరప్రత్యయనేయత్వమే కాని గతి లేదు. కావునఁ గవనములో మెప్పువడయుటకన్న నభినయములో మెప్పువడయుటయేకష్టసాధ్యము. తాదృశాభినయమే మేము వివక్షించితిమి కాని చెత్తము వివక్షింప లేదు. కవికి ఛందోవ్యాకరణాది శాస్త్రజ్ఞాన ముండవలెఁగదా, యభినయపాత్ర కది యవసరమా ? యని యందురేని వినుఁడు.

శ్లో. గురులఘ్వక్షరాణీహ సర్వం ఛందస్సు దర్శయేత్ ... ఇతిచ్ఛందాంసియానీహమయోక్తాని ద్విజోత్తమాః, వృత్తాన్యేతేషు నాట్యేఽస్మిన్ ప్రయోజ్యాని నిబోధత...శ్లో. ద్విజా యేచైవలింగస్థా స్సంస్కృతం తేషు యోజయేత్, రాజ్ఞశ్చగణికాయాశ్చ, ... శ్లో త్రివిధం హ్యక్షరం కావ్యే విజ్ఞేయం నాటకాశ్రయం, హ్రస్వం దీర్ఘం ప్లుతంచైవ రసభావ విభావికం, ఏకమాత్రంభవేద్ధ్రస్వం, ... ఏవంతు సంస్కృతం పాఠ్యం మయాప్రోక్తం సమాసతః ... శ్లో. ఆశ్చర్యం, అద్భుతియం, నిశ్చయమిచ్ఛన్తి ణిచ్ఛయంతితథా (విస్తరస్తు తత్రైవద్రష్టవ్యః) (నాట్యశాస్త్రము)

ఆ యీ చూపిన దిఙ్మాత్ర వచనములవలన ఛందోవ్యాకరణ జ్ఞాన మావశ్యకమో, కాదో విజ్ఞులు తెలిసికొందురు. శాస్త్రము లిట్లు ఘోషించుచున్నను మనకవనములవలెనే, మన విమర్శనలవలెనే, యాంధ్ర యభినయాదులును బహిష్కృతము కూరగాయలుగా నడుచుచున్నవి అంతలో నాయావిద్యలు తక్కువ పరిశ్రమ కలవిగాఁ దలఁపఁగూడదు. ఇందును గూర్చి యింతమాత్రముతోఁ దత్త్వము తెలియదు. ఆ యా గ్రంథము లామూలాగ్రముగఁ జదువఁదగు.

శ్లో. అబోధోపహతా శ్చాన్యే జీర్ణ మంగే సుభాషితం (భర్తృహరి)
14. శా. ...ఆ శాపాశం బతిదీర్ఘమై (శ్రవణా)

ఇట "దీర్ఘ" మనుట యసందర్భమఁట. దృఢమైనది అనవలెనఁట! పాపము! భాగవతకర్త కీసంగతి తెలియదుకదా!

శా. ఆశాపాశము దాఁ గడున్నిడుపు లే దంతంబు రాజేంద్ర (భాగవతము)
15. సీ. ... గీ ...మునులకప్సర స్త్రీ గమనము (శ్రవణా)

ఇందు నసందర్భము లేదు. మునులు జితేంద్రియులు. వారికి స్త్రీసంబంధము గలుగనే కలుగదు ఒక్కచోఁ గలిగెనేని యప్సరలతోఁ గలుగును అట్లాఁ జనపదము నభిలషింతురో, యేమో అనుభయమున నిందు ర్లేఁడు తన యుంపుడుకత్తెలగు రంభోర్వశ్యాదుల సంపుటయు నక్కలిన వారు భ్రాంతు లగుటయుఁ గలుగును గదా? తాత్పర్యము. ఇట్లుండ "రంభ దాసీ దేలకావలెనో?" 'దాసీది' యఁట! ఇట్టి యీయన వ్యాకరణవిచార మెట్లు సేయ మొదలిడెనో కదా! ఇంకొకచో "పంథ" అనియు నీయన యీ శృంఖలలోనే వాడెను. మఱియొకటి ఉత్సుకత్వమా, ఉత్సుకమా, అని శంకించెను ఉత్సుకత్వము తప్పఁట! ఉత్సుక మని దిద్దవలెనఁట! ఈయన కుత్తరమేమి చెప్పఁగలము? ఏమో ఉత్సుకత్వము, అనుటకు బదులు, ఉత్సుకమే యనుటయే యుక్తమని యేల యెంచరాదు? ధర్మధర్మి వివేక మెందులకు? ఈయన యెట్లు వ్రాసినను వ్యాకరణ భ్రంశములను జూపినట్లే సంతసించువారు మాత్రము లేరా? చూతుముఁగాక.

"...గారు వంద్యులు, ... గారి గ్రంథరచనయందు నిరుపమాన మగు ధైర్యమునే గాక నిష్పక్షిక బుద్ధియు విమర్శనా నిపుణత్వమును, లోకజ్ఞానమును వెల్లడించియున్నారు. ఈ రెండు గ్రంథముల యందలి అసందర్భములు, అన్వయాభావములు, వ్యాకరణ భ్రంశములు అపార్థములు, అసభ్యములు, ఔచిత్యభంగములు, మున్నగు దోషములనెల్ల బహునేర్పుతోడను వివేకముతోడను, సామర్థ్యముతోడను చర్చించి యున్నారు." (1913సం॥ జూను 18వ తేది ఆంధ్ర ప॥)

పైపంక్తులు చదివిన ప్రతివివేకికిని — శ్లో॥ యస్మింబాలానాం పరిణతఫలస్ఫీతి రాస్వాదనీయా, యచ్చైతేషాంకబళనవిధౌ కోవిదః కాకలోకః॥ అను పండితరాయోక్తి స్మృతికిఁ దగులక మానదుకదా? అది యటులుండె, మావిమర్శకుడుగా రెట్లు విమర్శించినను యోగ్యతాపత్రిక రానే వచ్చినది. గాన ధన్యత్వమున కభ్యంతరము లేదు. ప్రకృత మనుసరామః.

16. ఉ॥...తండ్రినాఁడె తా నిచ్చినసొమ్ము...॥ (పాణిగృహీత)

ఇట నన్వయము తెలిసికొనలేక 'తాను' అనుమాట తండ్రిని జెప్పదని కొంత వెక్కిరించెను. తండ్రి, నాఁడె. పూర్వమే అనఁగాఁ దాను జీవించిన కాలమందనుట, తాను, ఇచ్చినసొమ్ము, అని యన్వయము. ఇందుఁ గల 'తాను

అను దానింగూర్చి సహాసుపతాశ్వమేధపీఠిక చూడఁ గోరెదను. 'తంద్రినాఁడె' అనునది సమాసమైనను గట్టి యర్థము నచ్చుటకు శంక లేదు గాని సర్గింప విస్తర మెందులకని సూక్ష్మమైన తోఁచిన నుత్తర మీఁబడినది.

17. ఉ॥...మందపవనస్మితపుష్పములను... (శ్రీపణా)

ఇట 'తర' యెందుల కని యొకశంక, మేఘసందేశమునఁ గాళిదాసు 'మందం మందం నుదతి పవనః॥ అనియు భారతములో నన్నయభట్టు॥ క॥...మంద మంద మృదూక్తిని॥ అనియు నేల యనవలెనో? అంతోక "మంద" తీసివేయరాదా?

18. ఉ॥...మలయమందసమీరకుమారుఁడు॥ (లక్షణాపరిణయము)

ఇట మలయసమీరమునకు 'మంద' అను విశేషణ మేల యని శంక, లయగ్రాహి॥ మందమలయానిల మమందగతిఁబీచెన్॥ భార- ఆది- ?. ఆ.

శ్లో॥ మృదుమలయసమీరో వాతి నైభాతికోఽయం॥ (వృషభానుజ) వేఱొకటి 23 వ ప్రశ్నకడఁ జూడఁదగు.

19. సీ॥...అనివార్య ఘర్మోదకాపతారము. (శ్రీపణా)

ఇది సాత్త్వికభావవిశేషమని యెఱుంగక గ్రీష్మఋతువు కాదనియు వర్షఋతు వనియుఁ జెమటపట్టినట్లు వర్ణింప రాదనియుఁ దెగ వెక్కిరించెను. మంచి నడివేసఁగిలోఁ జలిజ్వర మారంభించినవానికిఁ జలిగలిగినట్లే సాత్త్విక భావములకును ఋతుధర్మములకును సంబంధము లేదు. ఇవి సార్వకాలికములు.

శ్లో॥ స్తమ్భః ప్రళయరోమాంచా స్స్వేదో వైవర్ణ్య వేపథూ,... అష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః॥... రోమాంచస్వేదౌ లక్షయతి, శ్లో॥ రోమాంచః పులకోద్భేద స్స్వేదస్తంగా జ్జలోద్గమః,... స్మరరా జ్యాభిషిక్తేవ స్విన్నాంగీ కామినీ బభౌ॥ యథావా, శ్లో॥ స్వేదాంబుసిక్తే హృదయే సుపత్న్యాః... పునః పునస్సించతి బాష్పపూరైః॥ (కావ్యదర్పణమునుండి)

మఱియు వర్షఋతువునందుఁగూడ గ్రీష్మఋతుచిహ్నములు కొంతవఱ కుండుటకు నాలంకారికులు సమ్మతించియున్నారు.

"వర్షాసు గ్రీష్మలింగానువృత్తి ర్యథా;

శ్లో॥ స్వైరవస్తే...మాసేనభాసాంపతిః॥ (కావ్యానుశాసనమునుండి)

ఆలంకారికులమాట నటుంచుఁడు. వర్షర్తువునందు గ్రీష్మర్తుచిహ్నములు కొన్ని యనుభూతములుగా లేవా? అయినను బ్రకృతవిషయమునకు ఋతుసంబంధమే లేదని తెల్పుట యావశ్యక మగుటచే నట్లుత్తర మీఁబడినది.

20. గీ॥...అంగజానంత తాపశాంత్యౌషధంబు...కోడికూఁత॥ (శ్రవణా)

ఇది తప్పఁట! కోడికూఁత మన్మథతాపము నభివృద్ధి చేయుననియే చెప్ప వలెనఁట! కోడి జామున కొక్కొక్కొపరి కూయు నాచారమున్నను తెలవాఱు జామునఁ గూయుదానికే కవులు వర్ణింతురు అది కవిసమయ మని యెఱుఁగఁదగు దీనిం బట్టి తెలవాఱుజాము తాపవర్ధనమా కాదా? కవు లెట్లు వర్ణించిరి? అనునది విచార్యము శ్లో॥ యువతి జనకదంబే నాథముక్తోష్ఠబింబే చరమగిరినితంబే చంద్రబింబం లలంబే" ఇతి కాళిదాసః.

దీనింబట్టి తెల్లవాఱుజాము తాపవర్ధనము కాదనియుఁ ఉదుద్రేకమును వారించెడిదియే యనియుఁ దేలినది. కాన కోడికూఁత తత్కాలవ్యంజక మగుటచే నౌషధత్వరోపణ ముచిత మని స్పష్టమే—తాపమునకు "అనంత" అను విశేషణముకూడఁ గొంత విచారణీయమని యెఱుఁగఁ దగు.

21. తే॥ గీ॥ ...మలయవాయువులిరువురఁగలఁకఁజేర్వ గలయఁ దమకించి కోడికూఁతలకుఁ దలఁకు వారలైరఁట! గ్రీష్మవిభావరులను—(శ్రవణా)

ఈ పద్యములవలనఁ గోడికూఁత మన్మథోద్రేకకర మని తేలుచున్నదఁట! అయినచోఁ గోడికూఁతలకుఁ దలఁకిరని చెప్పు టెట్లు సంఘటించును? వర్షఋతువునందుఁ దెలవాఱుజామువఱకును దంపతుల రహఃక్రీడ కవకాశము కలుగక పోదు. గ్రీష్మమునందో? అంతవఱకును నవకాశ మేకలుగదు. కావుననే కాళిదాసు

శ్లో॥ అబలాసు విలాసినోఽన్వభూవ న్నయనైరేవ నవోపగూహనాని॥

అని నొడివెను. శ్రీకృష్ణరాయలు.

తే॥ గీ॥ ప్రియుల వేఁకువఁ దొడ లెచ్చరించి కలసి, రెలమి ధన్యులు పండు వెన్నెల బయళ్ల"అని వర్ణించెను—

"జ్యేష్ఠాషాఢౌ గ్రీష్మః,... రాత్రిశేషే సురతక్రీడా"(కావ్యానుశాసనము)

చూపిన ప్రమాణములచే గ్రీష్మర్తువునందట్లు వర్ణించుట యుక్తమని యు నంతమాత్రమునఁ దెల్లవారుజాము మదనోద్రేక కర మని భావింపఁ దగ దనియు గత్యంతరము లేక యట్లు ప్రతిపాదింపవలసివచ్చు ననియుఁ దెలియుట సుకరము. ఇతరత్ర కూడ నట్లే వర్ణించుచో—

శ్లో॥ శీతేఽతీతే వసన మశనం వాసరాంతే నిశాంతే క్రీడారంభః కువలయదృశాం యౌవనాంతే వివాహః,...... కర్తు మిచ్ఛంతిమూఢాః" అను నపహాస్యతకుఁ బాత్రమగు నని ప్రాజ్ఞు లెల్ల నెఱుఁగుదురు.

22. సీ॥ కురియుచున్నంచు తుంపురులు (శ్రీవణా)

వర్షఋతువున మంచుగురియుట మావిమర్శకుఁడుగారు వినలేదఁట !

"శ్రతశ్శాస్త్రసజో భాద్రపదశ్చ వర్షాః ... తుషారకణవాహీ...వాయుః॥
(కావ్యానుశాసనమునుండి)

23. మలయు ప్రాతఃకాల మలయవాయువులచేఁ జెమటబిందువుల మొత్త
ము లడంగ, (శ్రీవణా)

వర్షకాలమున మలయవాయువు లెక్కడ? అని శంక.
సీ।... తెలతెలవాఱంగ మలయ గంధవహుండు సోరణగండ్లలోఁ జొచ్చిచూచు।

తే॥ నాపురి విలాసవతుల యొయ్యారములకుఁ గడు సొగసి॥

చ॥ మలయపుగాలి రేలు...దంపతుల్॥ (ఆముక్తమాల్యదనుండి)

ఈరెండును బురవర్ణనమునందలివి కాన సార్వకాలికము లయి, యుండఁ
దగు. కాదు వసంతర్తువునందే సమన్వయించుకొమ్మని కవి తాత్పర్యమందురేని

సీ॥ గీ॥ జడగతి నెప్డుఁబొలయు, నందుఁ జందనశిఖరి మందానిలుండు॥
(ఆముక్తమాల్యదనుండి)

ఈపద్యమును బురవర్ణనము నందలిదే, ఎపుడుం బొలయునఁట ! దీనిచే
సార్వకాలికముగాఁ గ్వాచిత్కముగాఁ జల్లనిసమయములయందు మలయమారుత
సత్త ననుభవజ్ఞు లగు కవు లంగీకరించుచున్నారని యొప్పక తప్పదు కాన
మేము వర్షర్తుప్రాతఃకాలమున వర్ణించినది కవిసమయసిద్ధ మగుచున్నది. కాని
యిది యింకను విచార్యము. ఏమందురేని ? ఆముక్తమాల్యదలోని రెండుదాహర
ణములును దక్షిణదేశమునందలి విలుబుత్తూరు, మధుర, అను పట్టణములను గూర్చి
నవి గాన మలయపర్వతము సమీపమున నుంటచే శ్రీకృష్ణరాయ లట్లు వర్ణిం
చుట యుక్తమే యనియు హిమవత్పర్వత ప్రాంతముల మంచునకుంబలె మలయ
పర్వత ప్రాంతముల మలయవాయువులకు సాంతత్య మనుభవసిద్ధమనియు
నొకవాదము రావచ్చును. ఇది యెట్లిదైనను మాకు మఱియు నుపయోగము.

"పుణ్యాభరితం బనంతాఖ్య పురవరంబు॥ (శ్రీవణా)

మేమును దత్సమీపము నందలి పురమును గూర్చియే వర్ణించి యుంటచేఁ
బైయుక్తులు మాకు విరుద్ధములు గావు. మా వర్ణించిన "అనంతపురము" దక్షిణదేశ
మందలిదే యనుటకు గుఱుతు.

సీ. నారికేళ కటాసనమ్ములఁ గూర్చుండి... వేద సంతలఁ గాలమ్ము
వెళ్లఁబుత్తురు (శ్రీవణా)

అనుపద్యము నందలి నారికేళ కటాసన ప్రసంగమే, వేఱొక యనంతపు రమున కీభాగ్యము లేదని యెఱుఁగునది. మఱియు నీపద్యము నందలి వేదసంతలు, అనునది వేదసంధాశబ్దభవమని యెఱుఁగక విమర్శకుఁడు వెక్కిరించెను. అది యటులుండె, ప్రకృత మాముక్తమాల్యదలోని ప్రయోగముల వలన మా మలయ వాయు ప్రసంగము సమాహితమే యైనను బ్రసక్తి గలుగుటచే మఱికొంత చర్చ యిందును గూర్చి వ్రాయుచున్నారము.

శ్లో. పిత్ర్యైనాం సఫల ప్రసూన సుభగాం భృంగాంగనా నిస్వనాం, నృత్య త్సక్త శిఖండిమండిత తరుంత్రప్తిం ప్రజామః॥...౧॥శ్లో. ఇదం మధురగీతి భి ర్మధుకరాంగనానాంసఖే కలాపి కులన ర్తితైః పికకదంబ కోలా హలైః,...మ స్యైవనం" (వృషభానుజనుండి)

అతివిస్తర మెందులకు? వసంతర్తువునం దీ కవిశిఖామణి, మధుకరాంగనా సంగీత పికకదంబ కోలాహల, కలాపికులన ర్తనములకు సామానాధికరణ్యమును వచించియున్నాఁడు.

"వర్షాసు, ఘనశిఖిస్మయ హంసగమాః" (అలంకార శేఖరమునుండి)

అని శిఖండి ప్రసక్తిని వర్షర్తు చిహ్నముగాఁ జెప్పియుండఁగా దానిని వసంతమునందుఁ జెప్పుటచేఁ గ్వాచిత్కముగ నన్యఋతుధర్మము లనన్య ఋతు వులయందు వర్ణింపవచ్చునని తేలుచున్నది.

శ్లో. ప్రవేశే చైత్రస్య స్ఫుటకుటజరాజిస్మిత దిశి...ప్రశమినః
అత్ర ప్రవేశే చైత్రస్య స్ఫుటకుటజేతి కాలస్య... విరోధః, ఇదంచ తత్తచ్ఛాస్త్ర, తత్తత్ప్రమాణ, తత్తల్లోకాదిభేదా దనన్తమ్॥ యత్రతు లోకస్యకవేశ్చ ప్రసిద్ధ్యో ర్విరోధః, తత్ర కవిప్రసిద్ధి రేవబలీయసీతి॥
(అలంకారశేఖరమునుండి)

దీనింబట్టి చూడ నితరర్తుధర్మము నితరర్తువునందు వర్ణించుట కొండొకచో దోషమని యంగీకరించుచు నం దన్ని విరోధములకన్నఁ గవిప్రసిద్ధివిరోధమే బలవత్తరముగానఁ గవుల యాచార మనుసరింపఁ దగినదియని తేలినది. కవు లన్యఋతుధర్మములఁగొన్నిటి నన్యర్తువులయందు వర్ణించుటను జూపియే యున్నారము. కవిసమయము ననుసరించి కేవలాప్రసిద్ధములుకూడవర్ణింపవచ్చును. సుప్రసిద్ధములు మానవచ్చును.

"కావ్యజ్ఞ శిక్షయా పరిశీలన మభ్యాసః,...శిక్షా మాచక్షతే, తత్ర కవిస
మయే సతామపి భావానాం కేషాంచి దనిబంధః తద్యథా, మాలత్యా
వసంతే... కృష్ణపక్షే జ్యోత్స్నాయాః, శుక్లపక్షే త్వంధకారస్య...దివా
నీలోత్పలా దీనాంవికాసః ...క్వచి దసతామపి భావానాం నిబంధః
తద్యథా, నదీషు నీలోత్పలాదీనాం... జలాశ్రియమాత్రే హంసాదీనాం,
పర్వతమాత్రే స్వర్ణరత్నగజానాం నిబంధః శివచంద్రమసో బాలత్వస్య
చక్రవాకానాం నిశి భిన్నతటాశ్రియణస్య... (కావ్యానుశాసనము)

ఆ యీ సూత్రముల కుదాహరణములందే చూడఁదగు- మఱియుం గొన్ని
టికి నియతత్వమును గూడఁ జెప్పియున్నాఁడు గాని యందు మలయానిలమునకుఁ
జెప్పలేదు.

"కేషాం చిన్నైయత్యం, యథా, సముద్రేష్వేవ మకరాః...మలయగిరా
వేవచందనోత్పత్తిః... వసన్తఏవ కోకిలరుతం వర్షాస్వేవ మయూర
నృత్యం రుతంచ..." (విస్తరస్తుత్రైవ ద్రష్టవ్యః) (కావ్యానుశాసనము)

నియతములలో మలయవాయువులను బరిగణింప లేదుగాని మయూరనృ
త్యరుతములను బరిగణించినాఁడు. ఇదివఱలో నుదాహరించిన "వృషభానుజ"
వలనఁ గవులు నిరంకుశులని తేలక మానదు. అనఁగా నతఁ డితరకవుల ననుస
రించి యట్లు ప్రయోగించి యుండును. ఆకవులేని యున్మత్తులు గారు. మయూ
రములు వర్షఋతువునందుఁ బ్రాచుర్యముగా నృత్యరుతముల నాచరించినను నిత
రఋతువుల యందుఁగూడఁ గ్వాచిత్కముగా నవి యాచరించుట యనుభవసిద్ధ
మని యెఱుఁగఁదగు. అట్లే వసంతమున విశేషించి వీచు మలయానిలము గ్రీష్మ
మందుఁ దక్కువగను, గ్రీష్మాంతమని వ్యవహరింపఁబడు వర్షర్తువున నంతకన్నఁ
దక్కువగను గ్వాచిత్కముగాఁ గనుపట్టుట యనుభవసిద్ధము. వర్షర్తు వన్నంతలో
నెల్లప్పుడును వర్షములే యుండవు. గ్రీష్మర్తువునందుంబలె విశేషించి యెండలు
కాచి యాయెండ ననుసరించి "వృష్టిం ఘృష్టిభిః" అను వాక్యానుసారమున
వర్షము గురియుచుండును అప్పు డాయెండ వేఁడిమి నభివృద్ధి పఱచెడిది నైఋ
తవాయువు కావుననే జ్యేష్ఠాషాఢౌ గ్రీష్మః... నైఋతో ... వర్ణనీయః"
(కావ్యానుశాసనము)

వర్షము గురిసినప్పు డాతాపమును శాంతిపఱచెడి
వాయువు, పడమటి గాలిగాని తూర్పుగాలిగాని, యగుచుండును. కావుననే

తత్రి శాన్ర్వణో భాద్ర్రిపదశ్చ వర్షాః ... కదంబకుసుమామోదమాంసలః పాశ్చాత్యః పౌరస్త్య ఉత్తరో వాయుః॥ (కావ్యానుశాసనం)

అని నిర్ణయించెను. ఇందొక విశేషముగలదు. స్థూలదృష్టిచేఁ జూచిన నుత్తరపు వాయువునకు హేమంతఋతువుపజకును ప్రవేశమే కన్పట్టదు.

క॥ ఉత్తరపుగాలివీచె నియుత్తలమునఁ దుహినకిరణుఁడహితుండయ్యెన్ (భాగవ)

ఇట్లుండ మధ్యనున్న శరదృతువును దాఁటినఁగాని కానరాని హేమంత ఋతుచిహ్నములు వర్షర్తువునందు శాస్త్రకర్త శాసించుచున్నాఁడు. కారణ మేమి ? ప్రకృతఋతువునకు వెనుకముందులుగానుండు ఋతుధర్మములు సంకర ములుగా నుండుటనుగూర్చి యిదివఱకే వ్రాసియున్నారము. ఇప్పుడు తెలియ వలసిన రహస్యమేమనఁగా ? ప్రస్తుత ఋతువునకు మధ్య నొక ఋతువు వదలి కొని తనకు మూఁడవదియగు భవిష్యదృతువునందలి గాలిగుణతులును, నిట్లే తనకుఁ బూర్వమునందుఁగూడ మధ్య నొకదానిని వదలుకొని మూఁడవస్థానమున నుండు ఋతువునందలి గాలిగుణతులును గ్రాచిత్కముగా వర్ణింపవచ్చునని తేలినది. కాన వర్షఋతువునకు విలోమగతిచే మూఁడవదియగు వసంతమునఁ బ్రాచుర్యముగానుండు మలయవాయువులు వర్షర్తువునఁగూడఁ గ్వాచిత్కముగా వర్ణనీయములని తేలినది. బాగుగ నెండ కాచి వర్షముగురియనితఱి నివియే వర్షర్తువునందుఁ దాపాపనోదకములని యనుభవశాస్త్రకవిసమయాదులచే స్పష్టమగు చున్నది. ఇంకను విస్తరింపవలసియున్నను నాయాయీ గ్రంథములును బ్రాజ్ఞులును గలరుగదాయని విరమించితిమి. ఋతువు నధికరించి వర్ణించునప్పుడు తక్కఁ దత్తదృతు ముఖ్యలక్షణములే వర్ణింపవలయుననను నియమములేదు అను నది యిట సారాంశము.

23. శా॥...కూఁతు వృద్ధాత్ముఁడౌవానిం జేర్చు నపాత్రుఁ గూడదనరు...(పా-గ్ర)

వృద్ధాత్ముఁడు, వృద్ధః ఆత్మా శరీరం యస్యసః, శ్లో॥ ఆత్మాకశేబరే... ఇతి ధరణిః॥ వృద్ధుఁడని ఫలితము. ఇట్లుండఁగా నీయర్థము రాదనియు నాత్మకు బాల్యాద్యవస్థలు లేవనియు విమర్శకుఁడు వెక్కిరింపఁ జొచ్చెను. మఱియు నిందలి 'చేర్చు' అను పదమునఁట !. వారకాంతలవిషయమునఁ బ్రయోగింపనగు నఁట !, ఈజ్ఞానము సరియైనదే యగునా ? కాదు, కాకున్నను నొప్పుదము. ప్రకృత మట్టి యర్థము స్ఫురించుటకే అట్లు ప్రయోగించితి మందము, ద్రవ్యాశచే ముసలివానికిఁ గూఁతునిచ్చు దుష్టుఁడు తాదృశుఁడునుం గాఁడని మాయభి ప్రాయము. అయినచో నాకన్యకకు వేశ్యాత్వము ధ్వనిత మగు నని యాక్షే

పించునేమో ? ఇందుల కిదివఱకే యుత్తర మీయఁబడినది. సాక్షాల్లక్ష్మిని గంగను గూడ నొక్కొక్కచో మహాకవు లిట్టిరీతికిఁ దార్చియున్నారు చూడుఁడు.

శ్లో॥ సుభగయతితరాం న శక్నుతి వంచయతేఽం గణాంగనేవ శ్రీః, కుల కామినీవ నోత్క్షుతి వార్ధకేఽపి జన్మజన్మాఽపి॥

శ్లో॥ శిరసిధృతాపి భోగే మోహనవిక్షిన శీలితా దేవ,...

శ్లో॥ సంభవతి నఖలు రేఖా లలనానాం ప్రకృతిచపలచలితానాం, అను భవతి భవాదృశ్యాపి భుజంగ పరిశీలనం గంగా॥ (గోవర్ధనాచార్యసప్తశతి)

కవిప్రౌఢోక్తులును నాటకమర్యాదలును వెదకికొనుట పైపైనిలేదు. కావుననే

శ్లో॥ ఆనందనిష్యందిషు రూపకేషు వ్యుత్పత్తిమాత్రం ఫల మల్పబుద్ధిః, యోఽపీతిహాసాదివ దాహ సాధు, తస్మై నమస్స్వాదుపరాఙ్ముఖాయ॥

అని దశరూపకమున నట్టివారికి నమస్కరించెను. అనేకజన్మతపస్సాధ్య మగు సాహిత్యవిషయమునఁ బ్రతిపుఱుఁడును గణించుకొనినచో నమస్కరింపక చేయవలసినదేమి ? మా విమర్శకుని శంకలకుఁ బరిమితి లేదు. చూడుఁడు.

"బాలామణివేశ్య: వేశ్యలు గౌరవనీయులకు మ్రొక్కుట యాచారము. అయినను గ్రంథకర్తలు... మ్రొక్కించినారుకారు"

ఈ గౌరవనీయపద మేపాటి గౌరవార్హమైనది ? అది యట్లుండుఁగాక. ఇది యెంతటి స్వల్పానుభవపుశంక? మనుచరిత్రమునఁ బెద్దన్నగారు వరూథినిచేఁ బ్రవరాఖ్యున కేల మ్రొక్కింపరైరోగదా ! ఏల మ్రొక్కింతురు ? తాను ప్రేమించిన నాయకున కితరులకుం బోలె నితరాసాన్నిధ్యమందు వేశ్యయును నమస్కరింపదు. కావుననే పెద్దన్నగారు మ్రొక్కింపరైరి. ఇతరత్ర మేము మ్రొక్కింపలేదా ?

ఉ॥ పైఁట దొలంగి పాదములపైఁ బడ... పాదసరోజయుగ్మ మాపోటి నమస్కరించె॥ (శ్రవణా)

74. సీ॥...తనమేనికన్న మెత్తని క్రొత్తమల్లెపూవులు. (శ్రవణా)

మేనికన్న మెత్తని మల్లెపూవులనుబచే శరీరమునకుఁ గాఠిన్యము గలుగు చున్నదఁట ! పూర్వమధ్యాధునికు లెవ్వరు నిట్లు వర్ణించియుండలేదఁట ! ఉప మాన మన నేమో, దాని నేయేవిధమున వ్యవహరింతురో తెలియనివారుగూడ శంకించిన నెట్లు ?

శ్లో॥ "కైకేయి? తస్య శయనాని కథంభవేయు స్త్వచ్చేతసోఽపి కఠినాని శిలాతలాని" (భోజచంపువు)

ఇది కైకేయినిగూర్చి రామప్రవాసదుఃఖితుఁడగు దశరథుని వాక్యము. నీమనస్సుకన్నను గఠినములగు శిలాప్రదేశములు రామునకు శయనము లెట్లగునని పలికినాఁడు. దీనిచే కైకేయిమనస్సు మెత్తనిదియని యర్థము గ్రహించువివేకి యుండునా? ఉండెఁబో! దేనికన్న మెత్తనిది? రాతికన్న మెత్తనిది. అనఁగా? రాతివంటిది. ప్రకృతమో దేనికన్నఁ గఠినము. మల్లెపూవుకన్న, అనఁగా మల్లెపూవువలె మృదువైనది యని ఫలితము. ఔరా! కావ్యార్థగ్రహణము. ఈవిమర్శకునికిఁ దనగురువులు ప్రయోగించిన—

"పూర్ణశశితోడ నెమ్మోము బూతులాడె"

అనుచో నిజముగా నవి రెండును బూతులాడుకొనుచున్నవి యనియే బోధపడియుండును గాఁబోలును. అట్టి సరసకవనముగా నున్నంగాని యీయనకు నమ్మతముగాదోటు! అది యటులుండె. దానికన్న గొప్పది, దానికన్నఁ జిన్నది, దానికన్న మెత్తన, దానికన్నఁ గఠినము, దానికన్న నెక్కుడు, దానికన్నఁ దక్కువ, దానిని ద్వేషించు, దానిని స్నేహించు, ఆయాప్రయోగములకెల్లఁ బర్యవసన్నమగు నర్థమెల్ల 'దానిఁబోలును' అనునదియే కాని వేఱుకాదు.

"...స్పర్థతే జయతి ద్వేష్టి దృష్యతి ప్రతి గర్జతి, ఆక్రోశ త్యవజానాతి కదర్థయతి నిందతి...ఇతి శబ్దా స్సాదృశ్యవస్తుని" (విస్తరస్తుతత్రైవ) (కా-శా)

మఱియు బ్రకృతపు మల్లెపూవుచర్చ గల శ్రవణానందపద్యమెల్ల నిట్లే వెక్కిరించెను. దీనింబట్టి యీవెక్కిరింపును నజ్ఞానమూలక మని యెఱుఁగఁదగు. మఱియు వేఱొకచో

ఉ॥...వేల్పుమిటారుల తోడికోడలు॥ (శ్రవణా)

అని రూపింపఁగా నప్పచెల్లెండ్రకు రూపమున సామ్య ముండునుగాని తోడికోడండ్రకుండదని యేమో వెక్కిరించెను. ఆవెక్కిరింపులెల్ల నిట్టివియే యని యెఱుంగునది.

**25.** చ॥... నూతనస్మరుఁడన నొప్పువాఁడు మదమత్తుఁడు నా విటుఁడబ్బియుఁ॥ (పాణిగృహీత)

మత్తుఁడనుటచే రసభంగమైనదఁట! ఇయ్యెడఁ గవిభావ మసభ్యమఁట! అథప్రగల్భా, శ్లో॥ యౌవనాన్ధా స్మరోన్మత్తా" (దశరూపకం)

పురుషు నట్లు వర్ణించుటయే రసభంజక మగుచో స్త్రీని వర్ణించిన నెంత రసభంజకము కావలెనోగదా !

26. శోకీమనోనంతశోకాబ్ధి కెవ్వాని యొదయమ్ము పర్వచంద్రోదయంబు॥ (శ్రీప)

ఇది దిద్దికోవలయునఁట !, ఎందుచేతనో ?, చంద్రోదయమును జంద్రోదయముతోఁ బోల్చుటచేత, అగుచో వినుఁడు — సామాన్యచంద్రోదయమైనను జక్రినాకస్త్రీ శోకాబ్ధిసంక్షోభమునందుఁ బర్వచంద్రోదయమువంటిదే యని యర్థము. కేవలచంద్రునికిని బర్వచంద్రునికిని భేదముండుటచే సాదృశ్యము కలుగుట శాస్త్రసమ్మతమే. అట్లుకాక చంద్రుఁడు చంద్రునివలెను న్నాఁడనినచో నన్వయమగును. అనన్వయాలంకారమున కుదాహరణము,

శ్లో॥ రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ॥ (చంద్రాలోకః)

ఇత్యాదిక మెఱుంగునది. ప్రకృతమో ? "పర్వ" అను విశేషణముచే భేదము గల్పింపఁబడుచున్నది.

శ్లో॥ లోహితపీతైః కుసుమైరావృతమాభాతి భూభృతః శిఖరం దావజ్వలనజ్వాలైః కదాచి దాకీర్ణమివ సమయే॥ అత్రలోహితపీతకుసుమావృతం భూభృత శ్శిఖరం స్వేనైవ కస్మింశ్చిత్సమయే దావజ్వాలాకీర్ణే నోపమీయతే॥...

శ్లో॥ నఖకిరణపరంపరాభిరామంకిమపి పదాంబురుహద్వయం మురారేః అభినవసుర దీర్ఘికాప్రవాహ ప్రకరపరీతమివస్ఫుటం చకాసే॥ అత్రాఽపి నఖకిరణపరంపరాభిరామంహరేఃపదాంబుజం స్వాత్మనైవ సురదీర్ఘికాప్రవాహ ప్రకరపరీతే నోపమీయతే॥ (రసగంగాధరం) (విస్తరస్తుతత్రైవ)

27. తే॥గీ॥...నాతికన్నెతికమ్ము॥ (లక్షణాపరిణయము)

ఇట "లక్షణ శ్రీకృష్ణునిభార్యగాన "కన్నెతిక" మని వ్రాయఁగూడదని శంక. పైపద్యము మ॥ రా॥ రా॥ ఆదిపూడి ప్రభాకరరావుగారిది. ఈయంశము పైపద్యముగల పుటలోనే కలదు. కవన మెవరిది యేని ప్రకృతప్రయోగము దుష్టమా కాదా ? అని విచారింతము. కన్నెతికము, ఇందలి తికప్రత్యయము భావార్థకము, కన్యాత్వము, అని అర్థము. ఇది ప్రథమసంభోగమును బోధించు పట్టున నౌపచారికమని యెఱుఁగఁ దగు. ఇది వేశ్యాప్రథమసంభోగపరముగనే లోకము వాడుచున్నారు గాన ప్రకృతము ధర్మపత్ని యగు లక్షణనుగూర్చి వాడఁగూడదని శంక రావచ్చును. కాని శ్లో॥ భోగినోఽన్యా నృపస్త్రియః" శ్లో॥ ప్రథమా ధర్మపత్నీ స్యా ద్వితీయా రతివర్ధనీ, దృష్టమాత్రఫలం తస్యా మదృష్టం నోపలభ్యతే"

ఇత్యాది నైఘంటిక, ధర్మశాస్త్రోక్తిప్రమాణములం బట్టి భోగినీత్వమును లక్షణయందు సిద్ధింపఁజేయుట సుకరమే కాని యంతవఱకెందులకు? లోకములో వేశ్యలయందే నియమముగా వాడఁబడుచున్న సానిపదమును దనతల్లిని గూర్చి పోతరాజేల వాడెనో? ఉ. ...బమ్మెర కేసయ లక్క సానికిన్ (భాగవతము) ఈ పోతరాజుకూడఁ జెల్లెలక్కవచేతనే వాడెనందురా? సీ. ...చని యొక్క ముదుసలి సాని కపుడు (భారతము) యీ సాని కుంతీదేవి. ఈ నన్నయ్య, పోతన్నగారికి మార్గదర్శకుఁడు, పదముయొక్క వ్యుత్పత్తిని దెలిసి ప్రయోగించువారు గ్రాంథికులు, ఆ సంప్రదాయములు గేవలము లోకమును బట్టి వెక్కిరించుచో నెట్లు నిలుచును? గ్రాంథికభాష వేఱు. అది శబ్దతత్త్వజ్ఞుల ప్రయోగముల వలననే తెలిసికొనఁ దగియుండును. అజ్ఞుల కగమ్యము.

28. ఉ. ముక్కర ... బులాకి ...(శ్రవణా)

ఈ రెండును నొకటే నగను బోధించు పదములు కావు. ఒకటి నత్తును, వేఱొకటి యడ్డబాసను బోధించును. తెలివిగల్గి చూచినచో, శబ్దరత్నాకరమే సంశయనివారకము కాఁగలదు. లోకమును బట్టినచో శంకయే పుట్టును.

29. క. ...వేశ్యలవైన గృహమ్ములు... (శ్రవణా)

వ. నీవైన దర్శనము (భారతము) యీ ప్రయోగములకు మితియే లేదు.

30. మ. తనుదావచ్చిన... (శ్రవణా)

సీ. ...తనుదానఁ దొరఁగిన (మనుచరిత్ర)

త్రిలింగలక్షణశేషము 37 వ పుట, 10 వ సూత్రము కూడఁ జూడుఁడు.

1. తే. గీ. ... తలవంచుట (శ్రవణా)

వంచుట, వంచుకొనుట, అనునర్థమునందు వాడుట భారతసమ్మతమే.

క. ...పుట్టె నరిష్టమని రిష్టముఁ దమలోనన్ భార-సభా-౨-ఆ, వసంత॥... నా బంధులందఱు మనంబున నేమినారే భార ఆది-౫-ఆ. యుభయత్ర, అనుకొను, అని యుండవలదా? కొనులేకున్నను దాదృశార్థబోధకత్వమును నన్నయ్య గారు సమ్మతించిరి. ప్రయోగములు కుప్ప తెప్పలు.

32. తే. గీ ఇట్లు బాలామణియును గామెచ్చ (శ్రవణా)

ఈరీతి సముచ్చయములకు భారతము పుట్టినిల్లే. వ.... దానియందును నీడు నొక్కటియుం గలదు. భార-అర-2-ఆ. ఈ సందర్భమున సత్యవంతుని

యందున్న కీడొక్కటియే. సముచ్చయ మేల ? ఇయ్యది వాక్యాలంకారముగా సంస్కృతమున ఇవాదులంబలెఁ దెల్గున నన్నయాదులు వాడుచుండిరని యెఱుఁగునది. ప్రయోగములకు మితి లేదు.

33. తే. గీ. ...రెంటఁ దగులవలయు

తగులుధాతువు భారతసమ్మతము. రసభంజకముకాదు. క....వారు విని తగుల నెదఁ, భార-ఆ-౬ ఆ, మనోరథమ్ము తగులుఁగాక, భార-ఆది-౫-ఆ

34 క. ...ఎట్టు లీమోహజలం బీదుదు (శశిరేఖా)

జల మనుటకన్న జలధి యనుట యుక్తమఁట. అయినచో జలపదము జలధ్యర్థమునఁ బ్రయోగింప వచ్చును. క. ...జలశయనుఁడు విని కరంబు సంతుష్టుండై భార-ఆది-౫-ఆ.

(జలశయనుఁడు, జలధిశయనుఁడు, శ్రీకృష్ణుఁడు) యిది ఛందానురోధమున నిచ్చిన యుత్తరము నిజమనుకో శంకించుట పొరపాటు.

35....ఇంత కెఱుంగ నట్టివారెవ్వరు?...పశువులంబకువురీ సుఖమందవె (పాగ్మ)

ఇఁట నాయికానాయకులకుఁ బశుత్వము తట్టించుచున్నదనియాక్షేపణము. కవివివక్షిత మదియే గాన నది యాక్షేపింపఁ దగదు. రసాభాసవిషయమని మొదటనే చెప్పియుంటిమిగదా! అది గాక వేశ్యాసంసర్గమునకును బశుసంసర్గమునకును దౌల్యమును స్మృత్యాదు లంగీకరించు చున్నవి. శ్లో. పశువేశ్యాదిగమనే ప్రాయశ్చిత్తం॥ (పరాశరస్మృతి)

ఇదియుంగాక రసాభాసతాసూచనమును బ్రాచీను లిట్లే చేసియున్నారు.

శ్లో....... శునీ మన్వేతి శ్వా హతమపిచ హన్త్యేవ మదనః (భర్తృహరి)

36. క. ...కోర్కులతలు (శశిరేఖా)

ఈ మిశ్రసమాసము కవి ప్రయోగసిద్ధము.

సీ. కోరికిలతలు పైకొనలు సాగె॥ (యామినీ పూర్ణతిలక)

37. ఉ......ద్రవ్యము లాగులాడు (శశిరేఖా)

ద్రవ్యము, ద్వితీయార్థే ప్రథమా, ద్రవ్యమునుగూర్చి, లాగులాడు, పెనఁగులాడు, అని సమన్వయము అపార్థము లేదు.

ఉ. పైఁటకు లాగులాడి॥ (పాంచాలీపరిణయము) ద్రవ్యపదసాన్నిధ్యమునందే యపార్థమువచ్చినచోఁ బైటపద్ద నెంతవచ్చునో! గ్రాంథికభాష వేఱు.

38. అక్కడదనుకన్ (పాణిగృహీత)

ఆ + కడ, అక్కడ, కడ, అనఁగా? తుద. ఆతుదపఱకు, "నాయను
రెంతకు నీచెడు మేన నుండునో, అంతపఱకు" అని సమన్వయము. పూర్వోక్త
సందర్భములు మరలఁ జూడఁదగు.

39. చ. ......బుద్ధిలోపల (శ్రవణా)

ఈ లోపల నిర్ధారణ షష్ఠి కాదు. 'స్తనమ్ములలోపలన్, యిత్యాదౌ
లోపలశబ్దః, అంతరర్థ్యయ పర్యాయో దేశ్యశబ్దః' అహోబల, 274 వ పు
చూడుము.

40. చ. సదునగుసన్న యన్నము......

ఇందు వర్ణించిన భోజనమున "పప్పు, చారు, మజ్జిగ, చెప్పలేదఁట"
ష్టాన్నమన్నచోఁ దనకు విమర్శింపవలసిన కష్టము దప్పునఁట. పాపము! ఈ
నకు మేమెంతకష్టమును గల్పించితిమో, యిందులకు ఆముక్తమాల్యదలోని "
తెలినులి వెచ్చయోగిరము" లోనగు పద్యములు చదువుకొని సమాహితుఁడ
యుక్తము. శ్రీకృష్ణదేవరాయలు గూడ మేమొనరించిన పొరపాటునే చేసె
పిండివంటలు లోనగునవి వర్ణించినపద్యమందు, పప్పు, చారు, చెప్పకున్న
గై ముత్యన్యాయమున దత్సత్త సుగమ మని యెంచుఁగని వారెక్కడను నుండ
ఇది నిక్కము, యిట్టివే యీ బ్రాహ్మణుని శంకలు వానికే మేమిన్ని పు
పాడుచేయుచుంటిమి. ఇఁక విరమింపఁదలచి కొన్ని దిఙ్మాత్రప్రదర్శకవా
ములు వ్రాయుచున్నారము.

41. క. ఏపాటితఁడు (శ్రవణా)

ఈ యికారసంధికి అహోబల 451 వ పుట చూడుఁడు.

42. సీ. ... సిందూరంపుతోరంపు (శ్రవణా)

తోరము దోరముగా నుండియు నుండకయు సాగననుటకు అహో
220 వ పుట చూడుఁడు.

43. మ. నిండా నెత్తిపై కెక్కు (శ్రవణా)

ఈ తత్సమాకార సంధికి, అహోబల 169 వ పుట చూడుఁడు.

ఇట్లు మాపొత్తములోని యంశముల నుదాహరించి భారతాదుల నుదా
రించుటకన్నఁ గేవలభారతాదులలోని ప్రయోగములను జూపుచు మావిమర
త్రోవనే కొండొక యుపయోగించి చూపినచోఁ జదువరుల కింతకన్నను దత్
సుబోధమని యెంచి యట్లొనర్చుచున్నారము. (సశేషము)

తిరుపతి వేంకటేశ్వరు

ఆ + కడ, అక్కడ, కడ, అనఁగా? తుద. ఆతుదపఁజకు, "నాఁడు శాంతను నిచెడుమేన సూఁడునో, అంతవఱకు" అని సమన్వయము. పూర్వో సందర్భములు మరలఁ జూడఁదగు.

39. చ. ......బుద్ధిలోపల (శ్రవణా)

ఈ లోపల నిర్ధారణ షష్ఠి కాదు. 'సౌధమ్ములలోపలన్, యిత్యాది లోపలశబ్దః, అంతరార్థ్యయ పర్యాయో దేశ్యశబ్దః' అహోబల, 274 వ చూడుఁడు.

40. చ. సదునగుసన్న యన్నము......

ఇందు వర్ణించిన భోజనమున "పప్పు, చారు, పచ్చిగ, చెప్పలేనంట ఫ్లాన్నమన్నచోఁ దనకు విమర్శింపవలసిన కష్టము దప్పునంట. పాపము! నకు మేమెంతకష్టమును గల్పించితిమో, యిందులకు ఆముక్తమాల్యదలోని తెలినులి వెచ్చయోగిరము" లోనగు పద్యములు చదువుకొని సమాహితుఁ యుక్తము. శ్రీకృష్ణదేవరాయలు గూడ హేమంతరించిన భోగపాటునే పిండివంటలు లోనగునవి వర్ణించినపద్యమందు, పప్పు, చారు, చెప్పక గైముత్యన్యాయమున దత్సత్త్వ సుగమ మని యూహింపఁగని వారెక్కడను ను ఇది నిక్కము, యిట్టివే యీ ప్రాసిస్తానుని శంకలు వానితో పేమిన్ని పాడుచేయుచుంటిమి. ఇఁక విరమింపఁదలచి కొన్ని సత్పాత్రప్రదర్శకములు వ్రాయుచున్నారము.

41. క. ఏపాటీతఁడు (శ్రవణా)

ఈ యికారసంధికి అహోబల 451 వ పుట చూడుఁడు.

42. సీ. ... సింధూరంపుతోరంపు (శ్రవణా)

తోరము దోరముగా నుండియు నుండకయు సాధనుటకు అహ 220 వ పుట చూడుఁడు.

43. మ. నందానె త్తిపై కెమ్ము (శ్రవణా)

ఈ తత్సమాకార సంధికి, అహోబల 189 వ పుట చూడుఁడు.

ఇట్లు మాహాత్మ్యములోని యంశముల నుదాహరించి భారతాదుల నరించుటకన్నఁ గేవలభారతాదులలోని ప్రయోగములను జూపుచు మావివ త్రోవనే కొండొక యుపయోగించి చూపినచోఁ జదువరుల కింతకన్నను దనుబోధమని యెంచి యట్టులొనర్చుచున్నారము. (సశేషము)

తిరుపతి వేంకటేశ్వ